శ్రీ ర స్తు

# ఆంధ్రప్రసన్నరాఘవనాటకము

Andhraprasanna Raghavanatakamu.

జయదేవమహాకవి ప్రణీతంబగు

Jayadeva Mahakavi

సంస్కృతనాటకము ననుసరించి


శ్రీమదాంధ్రభాషాసంజీవనీ పత్రికాధిపతులును

శ్రీబిల్వేశ్వరీయాద్యనేకగ్రంథనిర్మాణచాతురీధురీణులును

శ్రీచెన్నపురి రాజకీయశాస్త్రపాఠశాలాంధ్రపండితులును నైన

మహామహోపాధ్యాయ

బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారిచే

B Venkataratnam Pantulu

విరచితము.







చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.





1945 [వెల రూ. 1—0—0.

# పీఠిక

ఆంధ్ర ప్రసన్నరాఘవనాటక మూలము సంస్కృతమున జయదేవకవి రచించిన ప్రసన్నరాఘవము. జయదేవకవి విదర్భదేశీయుఁడు. విదర్భ కిప్పటిపేరు బేరారు. జయదేవుఁడు సుమిత్రామహాదేవుల తనయుఁడు; కౌండిన్యగోత్రుఁడు; హరిమిశ్రుని శిష్యుఁడు. కొందఱు జయదేవుఁడు వంగదేశీయుఁ డనియు నందురు. ఇతఁడు పుట్టుకచే శైవుఁ డైనను శ్రీరామభక్తపరాయణుఁడు. ఇతఁడు సీతావిహారము, ప్రసన్నరాఘవము, చంద్రాలోక మను గ్రంథములు రచించెను. కవనప్రాశస్త్యముచే నితనికి పీయూషవర్షుఁ డను బిరుదము కలిగెను.

ప్రసన్నరాఘవనాటకప్రస్తావనలో భాస కాళిదాస బాణ మయూర చోరకవుల నితఁడు స్తుతించుటచేతను, మఱియు క్రీ. శ॥ 1247 సం. ప్రాంతమున రచితమైన సూక్తిముక్తావళి యను గొప్పగ్రంథమున తత్కర్త జల్హణుఁడు ఈప్రసన్నరాఘవమునుండి కతిపయశ్లోకముల నుదాహరించుటచేతను, భోజుఁ డీరూపకము నుదాహరింపమిచేతను నీకవి పండ్రెండవశతాబ్దమువాఁ డనుట కేవిధమైన సంశయమును గన్పట్టదు.

వంగదేశమున జయదేవుఁడు గణేశుని తత్త్వచింతామణి యను తర్కగ్రంథము నకు ఆలోకన మను వ్యాఖ్య రచించినవాఁ డని యొక యైతిహ్యము సర్వజనాదరణీయమై యున్నది. ప్రసన్నరాఘవనాటక ప్రస్తావనమందును జయదేవుఁడు తర్కశాస్త్రజ్ఞుఁడని పేర్కొనఁబడినందువల్ల నీయిరువురుజయదేవు లొక్కరే అని విశ్వసింపవచ్చును.

అర్వాచీననాటకములలోఁ బ్రఖ్యాతిగాంచిన ఈనాటకమును ఆంధ్రులు 'పిల్ల మురారి' అని వ్యవహరింతురు. దీనినిబట్టి యిది మురారి అనర్ఘరాఘవము ననుక రించిన దనుట స్పష్టము. దీనికవిత్వము పటువై సరసమై హృదయంగముగ నుండును.

ప్రసన్నరాఘవము రామాయణకథను వర్ణించెడు నేడంకముల నాటకము. కవి మూలకథలో పెక్కు చిఱుతమార్పులు గావించి కథ నతిహృద్యముగ నడపెను. ఇందలి శతానంద రామలక్ష్మణ జామదగ్న్యులసంభాషణము వీనులవిందై పాత్రోచితముగ నున్నది. ప్రథమాంకమున సీతాకరగ్రహణార్థ మరుదెంచిన బాణరావణుల ప్రవర్తన మెవ రికి నవ్వు పుట్టింపదు ? చివరియంకమున విద్యాధరమిథునము రామరావణయుద్ధమును, సీతాగ్నిప్రవేశమును, పుష్పకవిమానమున శ్రీరామాదు లయోధ్య కేఁగుటయును వర్ణిం చును. శ్రీరామపట్టాభిషేకముతో కథ సమాప్తి యగును.

అట్టి ఈయుత్తమనాటకము నాంధ్రీకరించినవారు శ్రీకొక్కొండ వేంకటరత్నము పంతులుగారు. వీరి జన్మస్థానము వినుకొండ. 1842-వ సం. మార్చిలో జననము. వీరు నియోగిశాఖాబ్రాహ్మణులు. వీరికి శ్రీతనుమధ్యాబిల్వనాథేశ్వరులభక్తి యపారము. శ్రీ పంతులుగారు గుంటూరిలో విద్యాభ్యాసము గావించి చెన్నపురి రాజమహేంద్రవరముల

## పీఠిక

లోని రాజకీయకళాశాలలయందు ముప్పదియేండ్లకాల మాంధ్రపండితులై వెలసిరి. ఆం[illegible] విద్యాపారంగతు లని పేరెన్నికగన్నవారు. ఆంధ్రులలో మహామహోపాధ్యాయబిరు[illegible] మందినవారిలో వీరే ప్రథములు. వీరు ఆంధ్రభాషాసంజీవని యను పత్రికను నడపి ప్రసిద్ధిగాంచిరి.

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్థమున ఆంధ్రవాఙ్మయము ఆంగ్లవిద్యాసంపర్కముచే క్రొత్తపోకడలఁ బోవసాగెను. నాటకసారస్వతము నూత్నముగ నాంధ్రమున పుట్టి పెరుగఁజొచ్చెను. సంస్కృతనాటకము లెన్నియో ఈ భాషలోనికి తర్జుమా చేయఁబడెను. ఆతరుణమున వెలసినవిజ్ఞులలో నొక్కొక్క రొక్కొక్కపత్రికతో సంబంధము సమకూర్చుకొని అన్యోన్యగ్రంథములపై విమర్శప్రతివిమర్శలు చేయుచు మోమోటమిలేక వాగ్రంగమున సంకులసమరము నెఱపుచుండిరి. పండితు లనేకు లనుమోదకులై పత్రికాప్రచురణములకు ప్రోద్బల మొసఁగుచుండిరి. కొన్నివిషయములం దావిమర్శనములు వ్యక్తిదూషణములపాలయి పాఠకులకు విసువెత్తించినవి. భాషాజిజ్ఞాసువుల కవి యే కొంచెమో యుపయోగపడినను పరస్పరవివాదములచే నలుసులెన్నినట్లును స్తనశల్య చేసినట్లును నెరసులు వెదకుటవల్ల నాపత్రిక లాసంపాదకులకాలమందే చివర కల్పాయుష్కములైనవి.

శ్రీపంతులుగారు సంస్కృతాంధ్రములం దసమానపండితులు. మహామహోపాధ్యాయబిరుదము వారి భాషాపైదుష్యమును చాటును. తొలుదొల్త నీబిరుదమునందుటయే పండితలోకమున కీయనపై మత్సరమునకు హేతు వని కొందఱిమతము. వీరి బిల్వేశ్వరీయముపై "అముద్రితగ్రంథచింతామణి"యందు ప్రకటితమైన విమర్శనమే యట్టి మత్సరమునకు మూల మని మఱికొందఱి యభిప్రాయము. ఆయన యింటఁగాని, బయటఁగాని యెల్లవారితోను సర్వకాలసర్వావస్థలందును వ్యాకృతభాషనే భాషింప సమకట్టినవాఁడు. ఆపట్టుదలకై ఆయనమిత్రు లాయనను "ఆంధ్రజాన్సన్" అని పిలుచుచుండిరఁట! ఇది యెట్లున్నను, ప్రిన్సఫ్‌వేల్సు హిందూస్థానసందర్శనసందర్భము వర్ణించుచు, దేశభాషాకవులు అన్నిభాషలలో పద్యములు వ్రాసి ఆంగ్లానువాదములతోఁ బంపఁగా, ఆరచనలలోని ప్రౌఢికి లండన్ క్రౌన్ పెర్ఫ్యూమరీకంపెనీవారు శ్రీపంతులవారినే సమ్మానించిరి.

ఉ. ప్రిన్సఫువేల్సు నాఁ బరఁగు శ్వేతముఖాధిపు రాక సాకుచే
తన్నముదంచితంబుగను తారకహారము పంచి వేల్లదీ
విన్నభవల్ల నీ వెనసి విశ్రుతసత్కృతి నాంధ్రభాషకున్
మున్నమకూర్చితౌర గుణమున్ గవిరత్నమ! ధీరరత్నమా!

—బిల్వేశ్వరీయము.

**ఆహా! మనభాషకే యి దెంతగౌరవము!!**

# పీఠిక

శ్రీ పంతులుగారు నీతిచంద్రిక, ప్రిన్స్ ఆఫ్ వేల్సు హిందూస్థానసందర్శనము, శంకరవిజయధ్వజము, సింహాచలయాత్ర, బిల్వేశ్వరీయము, ధనంజయవిజయవ్యాయోగము, నరకాసురవిజయవ్యాయోగము ఇత్యాదు లనేకగ్రంథములకు కర్తలు. వీనిలో నీతిచంద్రిక చిన్నయసూరిగారి నీతిచంద్రికకు శేషగ్రంథముగ రచితమైన వచనకావ్యము. ఇదియు బిల్వేశ్వరాదులును ఒకప్పుడు యూనివర్సిటీపరీక్షలకు పాఠ్యగ్రంథములుగ వెలసినవి. వీరిశైలి కడు పెడుసు. ఆ పెడుసుదనము ప్రకృతనాటకమున సైతము ప్రత్యక్షము.

పరస్పరవైషమ్యముచేతనైననేమి భాషోద్ధరణాశయముచేతనైననేమి అన్యోన్య రచనలను పండితులు తీవ్రవిమర్శనములకు గుఱిచేయుచుండిరి. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు శ్రీ కొక్కొండవారి గ్రంథమును తీవ్రఖండనములచే విమర్శించిరి. శ్రీ కొక్కొండవారు శ్రీ శాస్త్రులవారి ప్రతాపరుద్రీయమును చీల్చిచెండాడ నెంచి నాటకములలో గ్రామ్యభాషాప్రయోగమును నిరసించిరి. నెల్లూరిలోని "వాగ్వల్లి" అను పత్రికయొకటియే శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి శాకుంతలము తొలిపద్యములలో శతాధికదోషములు చూపినది. ఇరుపక్షములవారిని గావలసినవారు శ్లాఘించుచుండిరి. ఉద్దండపండితు లీలాగున చెలరేఁగి వ్రాసినవ్రాఁతలు మన కీనాటి కొక్కింత యేవపుట్టించినను నాఁటి కవి యుక్తము లనియే ఆదరణ మందినవి.

నాఁటివిమర్శన లెల్ల పదప్రయోగాద్యౌచిత్యమునుమాత్రమే విశేషముగ నాశ్రయించియుండెను. ఇట్టి విమర్శనములను ఖండించుచు శ్రీ గిడుగు రామమూర్తిపంతులవారు తమ "తెనుఁగుపత్రిక"యందు "భాషాభిషక్కుల భేషజ" మనుపేర కవిప్రయోగముల నెల్ల నారయక యేలక్షణగ్రంథమునో ఆధారముగ నిడుకొని గ్రంథములతీవ్రవిమర్శనలకు గుఱికావించు టుచితముకాదనియు, సమకాలికపండితులు పత్రికలలో దూషణభూయిష్ఠము లగు వ్రాఁతలకు పక్షులగుట సారస్వతాభివృద్ధికి బాధకమనియు పలువిధముల సూచించియున్నారు. వారియాక్షేపణములకు సమాధానముగాని వారిమత మసంగతమన్న యధిక్షేపముగాని నేటివఱకును వెలువడలేదు. కనుకనే శ్రీ కొక్కొండవారు చేసిన భాషాసేవకై వారిని సంస్మరించుచు, ప్రసన్నరాఘవవిమర్శ భాషాభేషజములలో ప్రకాశితమైన గుణదోషముల నిష్పక్షపాతముగ పరామర్శింపఁగోరువారికి మూలగ్రంథ మత్యావశ్యకముగావునను, బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారికిని శ్రీ పంతులవారికిని వెలసిన చిరకాలమైత్రిని పురస్కరించుకొనియు, నీగ్రంథమునకు పునర్ముద్రణ మత్యంతావశ్యకమైనది. ఆలోపము దీర్ప సంకల్పించిన భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఆంధ్రలోకమున కెంతయు నాదరణీయులు. వారి భాషాసేవ చిరస్మరణీయమైనది. ఈ తొలివ్రాఁత వ్రాయ నవకాశము గలిగించినందులకై వారికి నే నెంతయు కృతజ్ఞుఁడను.

చెన్నపట్టణము.
3 మే, 1945.

వేదము లక్ష్మీనారాయణశాస్త్రి.



శ్రీప్రసన్నరాఘవాయ నమః.

# ఆంధ్రప్రసన్నరాఘవనాటకము

## పీఠిక

శ్లో. శ్రీతనుమధ్యా మంబాం జగతాం శ్రీబిల్వనాథ మపి పితరమ్
తచ్ఛివమిథునం శివదం శివాయ చేతోంబుజే భజేఽహామిహ.

క. తనుమధ్యాంబిల్వేశ్వరు, నిని జగములకెల్ల జననినిం జనకునిం ద
ద్వినుతశివమిథునమును శివ, మునకై సేవింతుఁ జిత్తమున శివదంబున్.

చ. భువి జయదేవనామకవిపుంగవనిర్మిత మై ప్రసన్నరా
ఘవ మనునాటకం బెసఁగుఁగా యది ప్రాకృతసంస్కృతాత్మకం
బవు నిది తత్సమాంధ్రకృతి యంచితమాంధ్రప్రసన్నరాఘవం
బవు ననఁ జేయ నెంచితి సహాయుఁడు దేవుఁడె నేను రత్నమన్.

క. పద్యమునకుఁ బద్యంబును, గద్యమునకు గద్యముచు పగం బొడకట్టున్
హృద్యంబుగ నీకృతియం, దావ్యకృతిం గాంచినట్టు లర్హాలు పొగడన్.

ఉ. ఔఁ గనుకన్ దదర్థ మిట నారయుఁడీ రసికు ల్సమంబుగా
బాగుగ నున్నచోటులను బన్నుగ మూలకృతిని నెన్నుఁడీ
బాగుగ లేనిచో నముఁ డవం దెగడుండు ప్రసన్నరాఘవం
బేగద నాటకం బిది మహిన్ మహనీయమె యాతఁ డద్దయున్.

తే. అరసి సిద్ధాంతి శివశంకరాఖ్యశాస్త్రి, కరుణ నాంధ్రప్రసన్నరాఘవము దీని
నంకిత మొసగ్గు నీతండ్రి కనియె మైత్రి, "నాత్మవత్సర్వభూతాని"యనువడువున.

చ. అవుటఁ బ్రసన్నరాఘవసమాహ్వయనాటక మిద్ది రాఘవుం
డవుటను దాతభక్తిభరుఁ డాక్రమముం గ్రహియించి యీకృతిన్
బ్రవణత నాదుతండ్రికి నిరంతరకీర్తి భువిం బ్రవర్తిలన్
దివి బహుసౌఖ్యము ల్వెలయఁ దృప్తిగ నంకిత మే నొనర్చెదన్.

సీ. నరనుతుఁ డన నేల సురనుతుఁడును నగు ధర్మైకనిరతత దానపరత
రమ్యుండు విద్యచే సౌమ్యత మితహితసత్యభాషణముల శాంతవృత్తి
సింహాసనాసనుండు స్థిరత శౌర్యముచేత నంతరరుల గెల్చె నరు లెవ రిఁక
గణనీయుఁ డతఁడె లోకత్రయజయమునఁ గామరోషాశలఁ గనని కతన
గీ. రాజపూజ్యుండు స్వాశ్రితరక్షకుండు, యమనియమముఖయోగాంగుఁ డాత్మబోధుఁ
డుచితవేషుండు భూసురుం డుత్తరుండు, శ్రీముఖాభిఖ్యుఁ డితఁడె నాఁ జెలఁగునతఁడు."
(బిల్వేశ్వరీయము.)

## షష్ఠ్యంతములు

ఓంకారవాచ్యభక్తున, కంకరహితసచ్చరితున కాత్మజ్ఞునకున్
శంకాతంకాజ్ఞునకున్, శంకరనారాయణైక్యసజ్ఞానునకున్. ౧

నరసింహకులామరునకు, నరసింహ సువినుతునకుఁ బ్రణయవినయునకున్
నరసింగరాయశర్మకు, నరసారథిదేవరూపనామరతునకున్. ౨

మహితాదివేదునకుఁ బాపహావిశ్వామిత్రగోత్రభవభాగ్యునకున్
మహిఁ గొల్కొండగృహాఖ్యున, కహితపదైకాజ్ఞునకు మహాభిజ్ఞునకున్. ౩

శిథిలేతరనిజమతునికి, బుధవినుతాచారునికిని బుణ్యాత్మునికిన్
గుధరవరసుధీరునికిన్, మధురహితమితాప్తభాషణప్రౌఢునికిన్. ౪

వాదప్రతివాదాభా, వాదరునికి దీనబాంధవావనునికి స
త్త్వోదారునికి నుదారుని, కాదృతవినయునికి ధార్మికాగ్రసరునికిన్. ౫

యతిభక్తునికిం గోవిం, దతనయనాగోద్భవునికి నరసాంబాన
త్సుతునికి రామాంబాపతి, కతులమతికి నాజనకుని కధికసుకృతికిన్.

# ప్రథమాంకము

శా. చేయంగ్ శ్రేయము నవ్వి విద్రుమలతాశ్రీకాంగుళిశ్రేణికల్
జ్యాయశ్శోణసరోజకోరకరుచుల్ పద్మాక్షునల్చేతులున్
వ్రాయు న్నల్వ మొగంబులందు నెవి చేల్ ప్రద్యుమ్నివాల్గంటిచ
ద్దోయిం జెక్కిళులందుఁ బత్త్రముల నెంతో వేడ్క నువ్వెత్తుగన్.

వ. మఱియును.

శా. ఆరూఢి న్సుఖదం బవు న్హరిముఖాబ్జాంచన్మరున్మాధురీ
ధీరోదాత్తమనోహరం బడె సదాప్తిం బాంచజన్యస్వనం
బారాల్లంఘితమేఘనాదవిభవం బై కుంభకర్ణవ్యథన్
గూరించుం దితిజేభరాజికెది ప్రీల్కాల్పుం దశాస్యాశలన్.

వ. అదియునుంగాక.

ఉ. పొక్కిలితమ్మినల్వ గడుఁ బొత్పపఁగం బొగడంగఁ గన్నులం
జక్కఁగ విప్పెలర్పఁగను చందురుమో మలరంగఁ గిన్కమై
గ్రక్కన నుక్కమీఱి మధుకైటభుల న్సరసంబుగా సిరిన్
మక్కువ వాక్పతిం గనెడుమాధవుఁ డేలెడు మమ్ము నిమ్ములన్.

[నాంద్యంతమందు]

సూత్రధారుఁడు: [ముందు చూచి సహర్షంబుగ,] ఔరా! ఏప్రకారముగా నీపారిషదులు నిజాస్యశారదారవిందలాస్యలాలసార్యాలోచనఖంజనుండును, నిఖిల మునిజనమనోరంజనుండును, కపర్దరంగన్నర్తితగంగాతరంగనికరుండును మందాకినీహారిచందనలాలాటికాయమానమకుటఘటితనవసుధాకరుండును, అక్కటికమున కిక్కయును, ముజ్జగమ్ములనుత్తమ్ములఁ గలిగింపఁగల తెలిదామరదుంపమొలకయును, షాడ్గుణ్యసంపన్నుండు నైన శంకరునియాత్రయందు గుమిగూడియున్నవారు! కనుక, వీరి మ్రోలఁ జేరి, స్వకలాపలోకనానుగ్రహముకై వేడుకొనియెద. [అంతయుం విమర్శించి] అవుఁబో, వేడుకోలున నేమి? ఎందువల్ల ననఁగా;

క. నేర్పరులు రూపుచేతనె, యేర్పఱుపంగలరు పరులయింగిత మూహన్
వేర్పడనిమొగలిపూవు దవులిర్ప న్వలపునను నళులలీలం బోలన్.

[విలోకించి సహర్షముగ] తగు నీయనుసంధానమువలననే, సామాజికసమాజముచే బోధింపఁబడినవాఁడు వీఁడె నాయొక్క చెలికాఁడు రంగతరంగుఁ డిక్కడకే వచ్చుచున్నాఁడు.

నటుఁడు—[ప్రవేశించి] ఓయిభావా! సభవారు నాచే నీకుఁ జెప్పించుచున్నారు. ఎట్టనఁగా, భరతరాజ [అని సగముమాట చెప్పఁబడఁగా].

సూత్రధారుఁడు—[చెవులుమూసికొని] హా! అయుక్తమయుక్తము. అవుఁగాక, నిశ్శేషమగు నందాక విందు.

న—భావా! ఇప్పు డిది యే మయుక్త మని నీవు చెప్పితివి?

సూ—ఓయీ! ఇద్దియెకద, పెద్దవాఁ డుండఁ జిన్నవాఁడ నైన నాయెడ రాజపదము చెప్పఁబడియె. నేనన్నఁగా భరతమాత్రుఁడనే. మఱి నాయన్న గుణారాముఁడు రాజపదభాజనుండు.

న—ఎట్టిగుణములఁ గలయట్టివాఁడు నీగుణారాముఁడు?

సూ—ఓయి! పేరనే యుత్తరము దత్తము.

న—[నవ్వి] గుణములపొందిక పేరనే యెట్లు?

సూ—అట్లే.

తే. గుణగణములను రూపించుఁ గుతుక మొదవ, గొప్పవారికిఁ బేరె యీక్షోణియందు
మొగి సువర్ణంబు శ్రీఖండమును మఱియుఁ, జెలియ రత్నాకరసుధాకరు లెటు లటుల.

మఱి యిది యేమి? గుణారామునందుఁ బేరుచేతనే గుణాధిగమ మెట్లని యుపహసింపఁబడియె? ఎవఁడు జనకుఁడను పేరుగల యేలికయోలగంబున హరచాపారోపణంబను రూపకము నభినయించి, కడుఁ దనిసిన యాయొడయనిచే నీయఁబడిన రంగవిద్యాధరుఁ డను ఖ్యాతిం గాంతంబోలెఁ బడసె, వాఁడుగదా!

న—అతఁ డిపు డేవా డలరించుచున్నాఁడు?

సూ—దక్షిణాపథమును. దాక్షిణాత్యుం డగు నొకానొక నటాపశదుఁ డీగుణారామనామము తనదియే యని చెప్పుటచేత నీతనియొక్క రంగవిద్యాధరుఁడను ఖ్యాతి వానిచే నపహృతయయ్యె. అయ్యది విని గుణారాముఁ డాదెస కరిగె. మే మిపుడు వింటిమి, సుకంతుఁ డను పేరుగల గాయకునితోఁ జెలిమిచేసి దాక్షిణాత్యుం డగు వాహినీపతియొక్క యోలగంబున రంగసంగర ముపక్రమించినాఁ డని.

న—ఆహా! మహోపక్రమము.

సూ—ఇం దచ్చెరువు పుట్టదుగద! ఎట్టు లన్న:

ఆ. బిసమనోజ్ఞభుజ సువికసితాంబుజనేత్ర, శరదుదీర్ణపూర్ణచంద్రవదన
చంద్రికాస్మిత యవు సత్కీర్తి నపహృత, దయితఁ బోలె నెనయఁ దడవఁ డెవఁడు.

కనుక, సామాజికులయొక్క సందేశరహస్యము నంతయుం జెప్పుము.

న—ఎది యన నిదియె గద, నీచే నభినయింపఁబడుదానిం గాంచెదము.

సీ. ప్రతియంకమునగు * సర్వరసాంకురంబు * న్నతమసుమావళి * రాజితంబుమఱియు
* ఘర్మేతరాంశునికై * వడివక్రత నైన * నాహ్లాదద మైప్రక * టసు
సందర్భమై లో * కసన్నుతంబై నాట్య * ముఖ్యప్రబంధమ న్ప్రఖ్యనుగని
వేదరాశికి నెట్లు వేదాంతశాస్త్రమ ట్లవును సాహిత్యవిద్యకు నెది దుద
నమరు నమరాద్రివలె సువర్ణాప్తిరుచిర *, పదకలన నప్సరోంగనభంగి యత్న *
ప్రకటనీయార్థమున నిధిపగిదిఁ గవికృ *,తంబు శ్రుతిరంజనంబు గేయంబు సుకృతి. *

సూ—[విమర్శించి, సహర్షంబుగ] మారిషా! ఏ మని పేరుపొందిన దీనాట్యప్రబంధ మని యెఱుంగుచున్నావా? [వెండియు విమర్శించి, విహసించి] ఓయీ యేనాదల నత్తమిల్లి యున్న నల్లగల్వ రేకును గడలికడళుల గమికడ నెమకునట్లు దీనినామధేయమును వేఱుగా నిరూపించుచున్నాను. ఓయీ! ఇదే యీపద్యమునం దావినుండి యేడేసియక్కరములంగల పదిబంతుల నొగివ్రాసిన "ప్రసన్నరాఘవనాటకము" అని, మఱి యెత్తుగీతి నాల్గడుగుల యంత్యాక్షరంబులం గ్రమంబుగం బఠింప, "రత్నకృతి" యని సువ్యక్త మవును.

న—[పద్యముం బఠించి విమర్శించి సహర్షవిస్మయంబుగ] ఆహా! ప్రసన్నరాఘవనాటక మనునది యీదృశ్యప్రబంధమునకుఁ బేరుసరిగాని, రత్నకృతి యన నేమి?

సూ—క. తనుమధ్యాబిల్వేశుల, తనయుం డనఁ బ్రథితుఁ డయ్యెఁ దచ్ఛిష్యుఁడు స
ద్వినుతుఁడు కొక్కొండాన్వయుఁ, డన వేంకటరత్నశర్మ యతనికృతి యిదే.

న—ప్రసన్నరాఘవనాటకగ్రంథమునకుఁ గొక్కొండ వేంకటరత్నశర్మ కర్తయా?

సూ—ఈయాంధ్రప్రసన్నరాఘవనాటకప్రబంధమునకు.

న—ఈభాషాంతరీకరణమునకు మును దీనాటక మేభాషయం దుండెను?

సూ—దేవభాషయందు.

న—ఆహాహా! కవులనెడు కలువలవికసనమునకు వెన్నెలయైన చదువులయవ్వయొక్క మక్కువ పెంపుసొంపు. దాని యనుభావమువలననే కవుల కిటువంటి వింత తీపుఁబలుకులు వెలయుచున్నవి.

సూ—కట్టిది యీ కవిచేతనే చెప్పఁబడియెను.

చ. చదువువెలంది త్వచ్చరణసారసరేణుకణంబుచిత్తభూ
మిఁ దనరుసజ్జనాళి కెది మించు నదే కవితాలతాకృతిన్
బొదలెడునీచెవిం జివురు పొందికసూక్తిచలచ్ఛిరస్స్వర
ద్గదితసుపారిజాతకలికాస్తబకంబునఁ బాద మూనెడిన్.

[విమర్శించి] పలుకు మించుబోణి యను రాయంచ యెవ్వనియొక్క మొగముదమ్మి నిమ్ముగ నెనసి, నలువమోముదామరలోఁట చెలులాట యుబుసుపోక నెనయునో, ఆ కవిబ్రహ్మ యవు వాల్మీకిమునియందు నాచిత్తము మఱియుఁ గౌతుకాయత్తమగుచున్నది.

న—ముజ్జగంబులందు నిది యిట్టే కదా.

ఉ. శ్రీరఘురామకీర్తినటి చెన్నుగ నాఁడఁగఁ దోడ మ్రోయు వా
ద్యారవమాద్యముం గలుగు నట్టిఁ డెసంగెడుఁ బుట్టపుట్టువౌ
వారక యేనిమోము నెలవల్లను గల్గినకావ్యసత్సుధా
వారిధిఁ ద్రావి సత్కవి నవస్తనయిత్నుతతుల్ రసందిడున్.

[విమర్శించి] ఎవనికీర్తియనెడు పున్నమవెన్నెలచే ముద్దిడఁబడినదై వాల్మీకియొక్కయుం జదువుసంద్రముల్లసిల్లెనో, ఆరామచంద్రుఁడే నాయెద యను వెన్నెల పులుఁగును నలరించుచున్నాఁడు.

సూ—ఇది యుక్తము.

తే. చంద్రునందును శ్రీరామచంద్రునందు, నల్లగల్వలనెయ్యంపుఁబెల్లుబిగిని
సొబగుమీఱుమిటారులచూపునందు, నెవనికి న్మది ముదమొంద దెసక మెసఁగ.

మఱియు, మారిషా!

తే. వడిగఁ బుడమికి డిగియెడి బమ్మకొమ్మ, దారిఁ బడియెడియలజడి దలఁగు నెట్టు
రామగుణకీర్తనామృతరమ్యవాపి, యందుఁ గ్రుంకక యుండిన నసువు మీఱు.

న—కుసుమితారామమ్మును దుమ్మెదలువోలె నేల యీకవు లందఱు రామునినే వెండియుం గొండాడుచున్నారు?

సూ—[విహసించి].

తే. తమ్మునెమ్మదినెందునుం దనుపుఁదమకు, సుగుణమణిగణ మిడుఁ గాన సుకవులెల్ల
నల్ల శ్రీరామభద్రునే యభినుతింత్రు, వారి కది దోషమే గుణవర మగుఁగద.

ఇదియునుం గాక, మారిషా!

ఉ. దేనికి సచ్చరిత్ర మవు దివ్యము బీజము ప్రజ్ఞ మొల్కవై
జ్ఞానికకాండసంగతియుఁ గాండము గావ్యము నూత్నపల్లవం

బా నొగి మూర్తిభూతకవితావనిజం బడి రామసత్కథా
నూనఫలంబు లేక మఱియు న్వితథీకృతమేనిచే నగున్.

ఎవండు వెండియుం నీప్రబంధముచేతఁ గవితాకామినీకేళికర్ణపూరవిహారలీల ననుభవించుచున్నాఁడు ?

సూ—[పొలయలుకగా] మారిషా!

మ. ఎనయించుం దగ నేనివాగ్విలసనం బేణాక్షిబింబాధరం
బున కెంతే నధరత్వము న్మధురసస్ఫూర్తిం గవీంద్రుండు వ
ర్ణ్యను గన్నాఁ డతఁ డాలిథేయమును గొండిచ్చుండు నీపీనులన్
దినుసారం జయదేవుఁ డొండఁడొ మహాదేవాత్మజుం డాదటన్.

మఱియును,

ఆ. లక్ష్మణుండనఁబోలె లలిసుమిత్రాగర్భ, జన్ముఁడై నయితనికి న్ముదమున
రామచంద్రచరణరాజీవమున భ్రమ, ద్భ్రమరభావ మొందు స్వాంత మరయ.

న—చంద్రచరితము నెఱుఁగని చకోరముయొక్క సరణి నెక్కరణి నే ననుసరించినాను ! భావ! ఈకవియే నాకుఁ దన కృతిపుస్తకమును సాదరముగ నొసఁగి యీచొప్పునం జెప్పెఁ గాపాడఁదగిన దిది పలుకుదొంగలవలనని. అయనయును నాచే సవినయముగ నిట్లు విన్నవింపఁబడియె.

క. పీనున నిడి యునిచి మెడన్, బూని తలం దాల్చి చేత మొనయించి యెదన్
స్తేనాపహారభయమునఁ, బూనికి నీపల్కు ముత్తెముల నేఁ గాతున్.

సూ—మారిషా ! ఈయశీకళంక యాశవి కేల ?

క. సులలితవచనసువృత్తన్, లలనం గృతినొరునిదాని లాలసుఁడై ముచ్చిలి యెవఁడే న్గదలికి న,వ్వలిదరిఁ జేరినను మేలు వడయును చెపుమా.

న—భావా ! ఈతండు ప్రమాణప్రవణుండుగాను వినఁబడుచున్నాఁడు. కాన నే నిందు రేయెండ యెండలందువలెఁ గవిత్వతార్కికత్వములయం దేకాధికరణవృత్తిత్వముం గాంచి కౌతుకముఁ గాంచుచున్నాను.

సూ—ఇందేమి కౌతుకము ?

చ. గొనబగువాణి యెవ్వరిది కోమలకావ్యకలాకలాప యా
ఘనులకు డిందునే యరయఁ గర్కశతర్కవచోవిజృంభణన్
అనువుగ గోళ లుంచఁబడు నన్నులచన్నుల నేరిచేత నె
న్నను మదకుంభికుంభదళనమ్మున నమ్ములువోవె వారిచేన్.

న—బావా! నిజకవిత్వతత్త్వవినోదమునితు లీసభికు లెట్లన్యునియొక్క కవితచేతఁ జొక్కుదురు?

సూ—ఇది కలిగినదే. మారిషా! ఈతనిచేతనే చెప్పఁబడియె.

ఉ. పొందుచుసోక్తివైభవము చేతను సంతస మెంతయేనియుం
బొందుదు రన్యసూక్తులను మోదముఁ గొందఱుసాధు లెందు మా
కందము స్వాలవాలముననఁ గల్గియుఁ దా మకరందపూరముం
జెందఁగఁ గోరదే కలశజీవనసేకము సైకమేనియున్.

న—ఆహా! ఈతనిపలుకుల సరళతయు మృదుళతయు.

సూ—ఒక్కచో వక్రతయుఁ గఠినతయు.

న—[సకౌతుకంబుగ] ఎట్లీరెంటికి రామణీయకము?

సూ—అట్లే. ఇట్టె యిక్కవిచేతనె వక్కాణింపఁబడినదిగద యిది!

ఉ. వక్రములం గవీశ్వరులవాక్కుల దూఱుదురేనిఁ బ్రాకృతుల్
వక్రముల న్మృగాక్షులయపాంగము లెన్నరయేని నీరసుల్
వక్రతఁ గోరదే బుధులస్వాంతము దచ్చతురత్వవిజ్ఞతన్
వక్రముఁ గ్రొన్నెలన్నిఫుడు బల్విడిఁ జెల్వుగ మౌళిఁ దాల్పఁడే.

మఱియును.

చ. పరఁగ సుధాబ్ధియం దమృతపానముఁ బల్మఱుసేయుచుం బయో
ధరుఁ డుడురూపము ల్వఱపు ధారుణిపై పడగండ్ల నవ్వియుం
గరకలు గాలేదు క్షణముకాలమునం గఠినంబులై యటే
నిరతసుధోద్గిరంబులుమనీషులసత్ప్రతిభోక్తు లొప్పెడున్.

న—యుక్తము. ఈకవి కంఠకకరణ మేమో ప్రమోద మేదురము. అందువల్ల నిటువంటివి సుధాశీతలంబులు సూక్తు లుల్లసిల్లుచున్నవి.

సూ—ఉ. దేనికిఁ జోరుఁ డౌఁ దుఱుము ధీరమయూరుఁడు గర్ణపూర మా
లేనగ హౌను భాసుఁడు వరిష్ఠవిలాసము గాళిదాసుఁ డౌ
నా నరయంగ హర్షుఁడు సుహర్షము బాణుఁడు పంచబాణుఁ డౌ
నేనికిఁ గాద దిక్కవిత యిష్టవధూమణి కౌతుకాప్తికిన్.

మఱియును.

ఆ. కాదు బ్రహ్మవిద్య గాదు రాజ్యేందిర, గాని కవుల కవును గవితలలిత
జోక నిడఁబడుచును లోకోత్తరునికయి, కూఁతురీతిఁ గూర్పఁ గూర్మిఁ జేర్మి.

[నేపథ్యమందు.] బాగోయి కుశీలవోత్తంస బాగు.

సూ—అహా! యాజ్ఞవల్క్యశిష్యుఁడు దాల్భ్యాయనుఁ డితఁ డిక్కడనే యున్నాఁడు. వ్రతమును బూనినవాఁడును, శూద్రులఁ జూడఁగూడనివాఁడును నగు నితనియెదుట నిలుచుట మన కనుచితము. కనుకఁ దొలఁగుదము. [అని నిష్క్రమించిరి.]

ఇ ది ప్ర స్తా వ న.

---

[తరువాత దాల్భ్యాయనుఁడు ప్రవేశించుచున్నాఁడు. కాదు బ్రహ్మవిద్య యను నా పద్యము నే పఠించి] ఇట్లే యిది. అట్లుగదా; ఈరాజు జనకుఁడును సకలజగజ్జననయన నళినద్యుమణి యవు నొకానొక పురుషమణికిఁ దనదుకన్నియ నొసఁగ నెన్నికఁ గన్న వాఁడై మాగురువుచే నుపదేశింపఁబడిన బ్రహ్మవిద్యయందును, కులక్రమాగతమైన రాజ్యసంపదయందును, బొత్తిగా నాదరములేనివాఁ డాయెను. [చెవి నిచ్చి] ఎక్కడి దిది నింగి న్వీణియయొక్క మ్రోఁత? [విమర్శించి] తగును. మాగురువును జేరవచ్చు వాఁడును, వాతాహతకలక్వణితవీణాగుణుండును, వేల్పునిరాబారియు నైన నారదునిచేతఁ గలిగినది గాఁబోలు. [మీఁదుసూచి] ఆహా! శబ్దసామ్యమువలన మోసపోతి. ఇది కమ్మనిపలుకులఁగల తుమ్మెదకవయా? [వెండియు నాలకించి, సహర్షకౌతుకంబుగ] ఆహా! భగవంతుఁ డగు యోగీశ్వరుని యనుగ్రహమహిమ! దేనిచేత నే నిటువంటి వానియొక్కయు మాటలఁ దేటపఱచుకొనుసట్టి యుత్కృష్టసిద్ధినిఁ బడసినాఁడనో! కనుక నివి పలుకుపలుకుల నన్నిటి నాకర్ణించెదనుగాక. [ఆలకించి] ఒక్కఁ డేమి వక్కాణించెను? చెలికాఁడా! కలాలాపుఁడా! ఎక్కడనుండి వచ్చినాఁడ వని యడుగఁబడుచున్నాఁడవు? మఱియొకఁ డేమనెను? చెలీ! మధుప్రియా! అనవరత వికసనంబగు నమృతకరధర కపర్ద మంజుల మందాకినీ కమలవనమువలననుండి నేను వచ్చినాను.

దా—ఆహా! వీనిపలుకు విన్నాణమును, పేరుపొందికయును, [మఱియు నాలకించి] కల దొకానొక క్రొత్త వార్త. కలాలాపుఁ డే మనియెను? కలదుగదా; ఒకానొకప్పు డుత్ఫుల్లకమలమయరంబగు దండ నొసఁగి దండమిడి సుప్రసన్నుఁడైన సుధాకరమౌళితో వేయిచేతులబలియుఁడు బలినందనుండు బాణుం డిట్లనియెను. దేవా!

ఆ. లంకజేనికయి బలంబునం బలమఱు, వెండికొండకంటె వెలయుబలిమి
గలుగు నెద్ది ముజ్జగంబుల నే నందు, సఫలముగ నొనర్తు సద్భుజతతి.

వక్కాణింపఁబడియె ముక్కంటిచే.

క. కల దది నాయది దివ్యము, విలు మును పనుపఁబడె జనకవిభునొద్దఁ బురం
బులు మూఁడు మిడుతతనమును, జెలువఱఁగనె దేనిములికి చిచ్చున మెచ్చన్.

అని నిని తన వేయిచేతులఁ జూచుకొనుచు, బాణుఁడు బయలువెడలె. నేను వేడుక తోడ నిచ్చటికి వచ్చినవాఁడ. నీ వెక్కడనుండి యిక్కడికి నరుగుదెంచినాఁడ వది యెండియు వాకొనుము. అచ్చటి వృత్తాంత మెటువంటిది? [చెవినిచ్చి] మధుప్రియుఁ డేమి వాక్రుచ్చె? నేను వాసవుని వనమువలననుండి వచ్చినాను. అందు నాచే నొకానొక నిశాచరుని గర్జిత మిది వినఁబడినది. ఓరోరి! తోఁటవాండ్రారా! రాత్రించర చక్రవర్తి రాజమౌళినిఁ బూజింపకయుండ, చెట్లు కోయఁబడిన కుసుమములఁ గలదిది నందనవనము? వారిచేఁ బలుకఁబడినది. ఓయి లంకమన్నీనిలెంకా! ఇది మన్నింపఁదగి నది. ఇపుడు, జానకీ స్వయంవరావలోకనోత్సుకిత సకలసురలోక విమాన వితానముల కై నేఁత కై మిక్కుట మవు పువులయొక్క యక్కఱగద? అది యాలించి, వాఁ డీ వార్తయే లంకేశునకుఁ బూల కానికగా నొనర్తు నని చనియెను. నేనో వినోదంబున నిచ్చటికి వచ్చితి.

దాల్భ్యుఁడు—[సహర్ష కౌతుకంబుగ] ఆహా! ఏమో క్రొత్తవృత్తాంతరహస్యము మధుకరద్వయమువలన నాచే వినఁబడినది. [ఆలోచించి] అయ్యో! ఇయ్యది పెను బెడదకుఁ బుట్టినట్టి మొలక. ఎట్టులన్న; ఈ సీతా స్వయంవర వార్త, బాణ రావణులయొక్క చెవుల కెక్కినది. [నిరూపించి] ఒక్కపక్షంబున నీ్వపాదం బక్కఱ లేదు. భ్రమరోక్తులు భ్రమారోపితంబులుగాను సంభవించుచున్నవి. [వెండియు విచారించి] ఇవి భ్రమరమాత్రకములు గావుగా? ఎట్టన్న;

క. మందేతరవరరసని, వ్యందమవహోదారసుందరాలాపంబుల్
వందులవలెఁ గన శ్రవణా, నందకరంబు లివి సెలఁగు నరు లరుదందన్.

[నేపథ్యమందు,] మునీ! యుక్తముగా నూహించితివి. మేము వందులమే కదా? పలు దెసలనుండి వచ్చిన పక్షుల గొనములగముల నెన్నఁగ జనకరాజుచే నియోగింపఁ బడినవారము.

దా—[తనలో] ఆహా! మహోత్సవము! నాపచన మెది తుమ్మెద దోయిచేఁ జెర్చి నదో, యది వందిద్వయముచేఁ బండినది. అందువలన నొదవినది సీతాస్వయంవరావ సరము. కావున నేను భ్రమరవృత్తాంతమును గురువునకు విన్నవింతును. [అని నిష్క్రాంతుఁ డయ్యె.]

ఇది శుద్ధ విష్కంభము.

[అంత వందు లిరువురు ప్రవేశించుచున్నారు.] వారిలో నొకఁడు—చెలికాఁడా! నూపురకుఁడా! చూడు చూడు.

క. శ్రీలిం దమతమవిక్కున, భూతలపతు లున్నపీఠపుంజము పోలుచున్
సీతాస్వయంవరముఁ గనఁ, గౌతుకమునఁ గూడినట్టికడలగమి యనన్.

నూ—నెయ్యుఁడా! మంజీరకుఁడా! చూడు. అ. ఇయ్యెడ, పలుగొమ్ములపొగమ్ముల కొమ్ముల నునుపుఁగమ్ములచేఁ జేయంబడిన గద్దెలందుఁ గూర్చున్నవారును, కెంపుమై పూఁతలం గలవారును, నైనఱేండ్లు అచ్చపటికపుమేడలకొట్టకొన నున్నట్టి బంగరు సింగంబులువోలెఁ గ్రాలుచున్నారు. మఱియుఁ బాలవెల్లి వెల్లువకొనలం గ్రొత్తగ న్నిగుడుచున్న వెన్నెలఱేని చాయలో యన మెఱయుచున్నారు.

మం—చూడు. అ.

చ. వరనటపంచశాఖ పరివర్తితసూత్రవలగ్నుయైన యీ
ద్విరదరదోరుమంచకృతవిభ్రమపుత్రిక యాడు నిత్తఱిన్
ఖురరిపుచాప మెక్కుడఁగఁ బొంపిరివోయెదువేడ్క నిక్క భూ
వరులయతిత్వరాన్విత విభావనమైనది చిత్తవృత్తినాన్.

నూపురకుఁడు—ఓయి నెయ్యుఁడా! ఇతఁ డెవఁడు? ముక్కంటివింటి నెక్కుడుట యందలి మిక్కుటంపువేడ్క యనెడు నామనిలచ్చిచే విచ్చిన గగుర్పు మొగ్గల గమిచేఁ గైసేయఁబడిన తనబుజమ్ము లనెడు తియ్యమామిడికొమ్మదోయిం జాచుకొనుచున్నాఁడు.

మంజీరకుఁడు—స్వకీయ యశస్సుగంధసముత్సుకితచారణషట్చరణకులకలకలముఖరితదిగంతుఁడు కుంతలాలంకారుఁడు మల్లికాపీడుఁ డను పేరుగలవాఁ డీతఁడు.

నూ—వెండియు నితం డెవండు? దవ్వుగ నెగఁద్రోయఁబడిన బంగరుకడియము చేతఁ దెలుపఁబడిన తన సింగాణిగొనము తాఁకులవలనం గలిగిన కాయలచాయచే నంద మైనభుజమును గనుఁగొనుచున్నాఁడు.

మం—ఈతఁ డుత్తరదిక్సత్తకాశినీఫాలఫలకాలంకారుఁడు కాశ్మీరతిలకుఁడు.

నూ—మఱియు నెవఁ డితఁడు? మగఁటిమి కలిమి గందపుఁజెట్టుకొమ్మకుఁ బుట్టపుట్టువు కత్తిఁ బట్టుకొని యున్నాఁడు.

మం—స్వప్రతాపప్రభాపటలపాటలితమలయాచలనితంబమండలుండు కాంచీమండనుండు వీరమాణిక్యుఁ డని పేరువడసినవాఁడు ఱేఁడు వీఁడు.

నూ—మఱి యితఁ డెతఁడు? ఎడయని గగుర్పుగల చెక్కిళులఁ గదలు పోగులఁ దాల్చి

శైవమున వెల్లడిపఱుపఁబడిన ముక్కంటివింటిని వీనుసొమ్ముగం గావించుకొనుటయందు వేడుక గలవాఁ డగుచు వెలయుచున్నాఁడు.

మం—వీఁడు, అసమసమితి మహార్ణవమకరము మత్స్యరాజు.

నూ—వెండియు వీఁ డెవండు? గందపుఁబూఁతచేతఁ దెల్లనైన తనబుజములచేఁ బోల్పఁబడిన చిలువఱేనిమేనిజిగి గలవాఁడు. పైఁడికొండవింటిదంటవింటిం బూవువంటి దని యెన్నుచు నిలుచున్నాఁడు.

మం—వీఁడు, స్వచ్ఛమౌక్తికహారాలంకృతవిశాలోరస్థ్సలుండు నుత్తుంగదోస్తరంగుండు సింధురాజు, [మఱియుం సకౌతుకంబుగ,] చెలికాఁడా! చూడు వీరిని.

గీ. కడఁకముక్కంటివింటి నెక్కిడెడు వేడ్క, రోమహర్షణముం గల రుచిరబాహు
లవనిజాలోకనసుకుతూహలవికటిత, హృదయు లగుచున్నవారు ఱేం డ్లెల్లయెడల.

నూ—[చెవినిచ్చి] నెచ్చెలీ! తెలియఁబడని యింపయిన నిబ్బరపుఁ బెనుగ్రం దిదేది?

మం—క. దివిజేంద్రచాపయుతమై, ప్రవర్షణమునను జనుఘనవర్గముధ్వని నా
శివుసింగాణిం గొనివ, చ్చ్నువరమ దేభములయులివు సుమ్ము చెలంగున్.

ఓయీ! శంకరకర పరిమండిత కాండాస మెట్లు తేఁబడె? [వెండియుం జూచి] ఓయీ! అద్భుతరసైకతాండవరంగమండపము కోదండరత్న మిది.

చ. గొనముగనైన మైనులియ గొప్పఁగ దప్పినఁ గన్న పన్నగే
శుని దగునూర్పుగాడ్పునను జొప్పడుఘోరవిషాగ్నికీలలీ
లను లలిగాలఁ బూస్త్రయివలద్భసితంబును జోపనోపె దే
నను వెలువడ్డమఱుల్కలఘునంబగుగాడుపు ఘోరఘోర మై.

నూ—ఓయీ! ఎందు సువర్ణమయపత్త్రపత్త్రిభావమును సుపర్ణరథుఁడు గోవిందుఁడు పొందె నని బృందారకులచేతం దలఁపఁబడెనో, అదియ యిది త్రిపురవినాశకము కార్ముకము.

మం—చుట్టు దిరిగి, రాజులారా!

శా. ఆకర్ణంబుగ నీడ్చునీహరధనుర్జ్యావల్లిజ్యామండనుం
డేకల్యాణగుణుండు వానికడకే యింపొందఁగ న్వచ్చుఁ దా
క్ష్మాకాంతాత్మజ మందయాన దరకూజత్కాంచికాశ్రోణియై
య్యాకర్ణాక్షిమహోత్సవంబుకొలఁ గాహా భాగ్యమెవ్వానిదో.

[విలోకించి] ఓయీ! సమయసంచారసమ్మిళద్గండస్థలకర్షణమసృణరణరణన్మణికుండలంబగు రాజమండలం బెట్లు కదలెను? [విహసించి]

గీ. కనుకనుమి వెల్లడిగ విలుకాండ్ర చేత, భక్తియే చూపఁబడినది శక్తి గాదు
చేయఁబడిన దంజలిముష్టి సిద్ధి గాదు, తలయె వంపఁబడినయది ధనువు గాదు.

నూ—నవ్వుచు సంస్కృత మాశ్రయించి, ఓయీ! బూరగచెట్లపూఁతవలె వీరియారంభ సంరంభ మెట్లు ప్రవర్తిల్లెను? ఎట్లనఁగా;

ఉ. కొందఱు దవ్వునం గనియుఁ గొండ యిదెం తని చెంతఁ జేరి వే
కొందఱు దాఁకి తిన్నఁగను గొందఱు గోఁగిటఁ జేర్చి గట్టిగాఁ
గొందఱు పట్టి చేకొలఁదిఁ గొల్చి స్వదోర్బలమెల్ల నల్లనం
గొందఱు శైవ మీవిలు దగుంద్రిదశాద్రి యటం చెరంగిరొ.

[సవిషాదంబుగ]

శా. నానాద్వీపములందునుండియు నృపు ల్నల్వొందఁగా నందఱుఀ
రాజైరీయెడ నేని కానో యశ మన్న న్వొండిడాల్గన్న దీ
చో నేఁడుం గదలింపఁడయ్యె ధనువుం జూ వంపలేఁడయ్యెడుఀ
హీనత్వంబును గన్న దయ్యెనె యహో యీయుర్వి నిర్వీరమై.

[నేపథ్యమందు]—ఆ! ఎవఁడు వీఁడు విపరీతవైతాళికుఁ డొకవిల్లు వంపఁబడమివల్లనే నిర్వీర ముర్వీతల మని వ్యపదేశించుచున్నాఁడు?

నూ—[భయముతో] వెయ్యుఁడా! త్సాతలవిచలత్సింహికేయస్యందనధ్వని కఠోరము కంఠధ్వానము వినఁబడుచున్నది.

మం—చెలికాఁడా! నేను వెఱచిగినవాఁడం గాను. కాన, వీని నడిగెదను. [పరిక్రమించి] ఓయీ! నీ వెవఁడవు అన్నిసీమలం ద్రిమ్మరు నాకుం దెలియఁబడనివాఁడవు?

పురుషుఁడు—[ప్రవేశించి] గర్వముతోఁ బరిక్రమించి [క్రోధముతో]

ఓరీ! కొన్నియూళ్లు ద్రిమ్మరు దుర్విదగ్ధవైతాళికుఁడా! ఎట్లు నన్నును దశ [అని యర్థోక్తియందు], [తనలో సాశంకంబుగ] ఆ! దాఁపఁదగినదాని వెల్లడింపఁ దల పడితి. కానీ. దీనినే నిర్వహింతును. [ప్రకాశముగా] ఎట్లు నన్నును, దశదిగ్వర వర్ణినీకర్ణపూరీకృత కీర్తికిసలయునిఀ, త్రిభువనవీరనామధేయునిఀ, నూతికప్ప మున్నిటి నప్రసిద్ధ మన్నట్లు పలుకుచున్నావు? అదంతయుం జెప్పుము. కర్ణాంతనివేశ నీయగుణం బగు కార్ముకరత్నమును గన్యారత్నము నెక్కడ?

మం—ఇద్దియే యద్ధనువు. కన్యామణినో పిమ్మటఁ జూడఁగలవు.

పు—ఛీ! మూర్ఖుఁడా! రాశి నక్షత్ర పాఠకుల గోష్ఠినే నెట్లు చూడవైతివి? వారును గన్యనే మొట్టమొదటఁ దెలుపుచున్నారు. పిమ్మట ధనువును.

మం—తనలో, ఎట్టితఁడు ప్రచ్ఛాదనమునే వెల్లడిచేయుచున్నాఁడు? కానీ! ఇందుచేతనే యాతని కొంతయుఁ వారింతును. ప్రకాశముగా నవ్వి, ఓయీ ! పరివారమునందెల్ల నీవే నక్షత్ర విద్యాకుశలుండవు.

పు—ఆ ! నే నెట్లు నక్షత్రవిద్యాకుశలుండను ?

మం—విల్లెక్కిడకయే కన్యావలోకనమునకు నెక్కరణి సముత్కంఠితుఁడ వవుచున్నావు?

పు—నాకును జాపారోపణమున సంశయమా ?

మం—ఔను.

పు—ఎందువల్ల నిది యుప్పతిల్లుచున్నది ?

శా. విద్యుల్లేఖ ఘనంబు లేకయె దివి న్వెల్గించుచు న్నాతకుం
ఖద్యోతప్రతతిం గడు న్వెలిఁగెడు న్బల్వింతగా నెంతయున్
హృద్యంబైనది దైవతాపగయుఁ లే కెంతే నభోదేశమం
దుద్యత్సద్యుతి మేచకోత్పలవనంబు న్మస్తకాలోక్యమై.

[మ్రోలఁ జూచి, తనలో]. నా ప్రతిజ్ఞాభంగమునకు విధిచేత విపరీతసృష్టినైపుణ్య మెట్లు ప్రకటింపఁబడియె? ముం దిదియా? [విద్యుల్లేఖ ఘనంబు లేకయె యని పద్యంబుం బఠించి విమర్శించి]. అటు గాకున్న మత్ప్రతిజ్ఞాభంగమునకై యావిధి యెవఁడు ?

మ. అలదుగ్ధాబ్ధిని నున్న వెన్నెనిదియా నందంపునాభ్యబ్జిఁ గ్
జెలువొంద న్నిజవాపికాశమలినిం జేయ న్మదిం గోరి యం
కిలిశంక న్నలుమోములం బలుకు వీక్షింపంగ నాద్వైన య
ర్మిలికై తియ్యనిపల్కులం బలుమఱు న్సైలాందఁగా నీతఁడున్.

[నిపుణంబుగ న్నిరూపించి] ఆహా ! సాదృశ్యముచే మోసపోతిని. ఎట్లనఁగా;

ఉ. కాదిది మించు మేఁడపయిఁ గ్రాలునొకానొకచానమేనిడాల్
గా దళుకొత్తెడుంబసిఁడి కమ్మిగఁ గల్వలతోఁట మేటియుం
గాదు సమీనఖేలనము గన్నను దన్నయనావలోకమే
కాఁదగు నబ్బురం బహహ కాంత యి దేనికిఁ గాంతయా నోకో.

ఔ నిది సీతానామధేయము గలది కన్యారత్నము ! [నిర్వర్ణించి]

మ. వనజం బామనెదీవు వ్యర్థముగ నో షద్మారి యీనారిపా
దనఖం బేనియుఁ బోలఁజాల వికఁ దద్వక్త్రంబునుం బోలెదే
ఘనితారత్నముకన్నుదోయి యొదుర న్వర్తిల్లెదే యింకఖం
జనమా నీవు జనాభిరంజనము మెచ్చం జేయఁగంజాలుదే.

[వెండియు సవిస్మయంబుగ]

ఉ. ఒకటి సృజించె వేధయె పయోధిని దుగ్ధమయంబు దేవుఁ డిం
కొకఁ డుపమన్యుఁ డన్తపసియౌన్ సృజియించెఁ దపంబు సల్పి మున్
ప్రకటముగాఁగ నిప్పుడు వరంబుగఁ గేదఁగి రేకువంటి కం
టికిఁ దుదచూడ్కి నీసతి ఘటించును బెక్కొటిఁ బాలసంద్రముల్.

మం—నెయ్యుఁడా! నూపురకుఁడా! ఒకానొకతె చేతివలనఁ గైకొని యిదేమి యంతఃపురికాజనము సకౌతుకంబుగ నాలోకించుచున్నది?

నూ—గురుగృహమునుండి వచ్చుచున్న యంతఃపుర పరిచారికయగు చంద్రికయొక్క చేతివలన గ్రహించి చిత్రపటమును జూచుచున్నది యని నే నూహించుచున్నాను.

మం—నీచేత నాచిత్రపుఁ బటము చూడఁబడెనా?

నూ—ఆ! (చూడఁబడెను.)

మం—అం దేమి వ్రాయఁబడి యున్నది? అది తెలుపు.

నూ—రాచకూఁతురు (సీత), మఱిలాఁతివాఁ డెవఁడో నల్లగలువవలెఁ జామనిచాయయు, మెదువునయిన మేనుగలవాఁడు, తనయంతం దాన యందగాఁడు. కొనచెవిసొమ్ముగఁ గావింపఁబడిన ముక్కంటివింటి గుదుసుగలవాఁడు రారాజుకొడుకు.

మం—అహాహా! ఈ స్త్రీజన మతిముగ్ధము. ఎందువలన నన, రా జతికఠినప్రతిజ్ఞగలవాఁడు గాఁగా, చిన్న యీడుగల యల్లుని (పెండ్లికొడుకును) గోరుచున్నది. [వెండియు సాకూతంబుగ] ఈ పట మెవనిచే వ్రాయఁబడిన దని యెఱుఁగుదువా?

నూ—ఓయీ! భగవంతుఁ డైన యాజ్ఞవల్క్యునిద్వితీయద్వితీయచేత నని దీని నెఱుఁగుదును.

మం—ఇపుడు కోరిక మొలకరించినది.

నూ—ఎట్లు?

మం—దేవి మైత్రేయి త్రికాలదర్శిని సిద్ధయోగిని దబ్బఱ వ్రాయదు.

నూ—[నిట్టూర్చి] సబాముచేఁ గట్టడియగు వీఁ డిటఁ దొలఁగెనా; అంతయుఁ దలఁపఁ దగినదే.

మం—హా! వీ డేఁడు? వీనిని దొలఁగింతు [నని యంతటం గలయఁ దిరిగి] ఓయీ! ఈవల నావల నేమి విలోకించుచున్నావు? ఇది యేమి కోదండము గాదా? ఔను గాన నిందే దృష్టి యుంపఁబడందగు.

పు—ఆ! దృష్టి యని యేమి చెప్పుచున్నావు? ఓయీ! ఇది ముష్టియే యీయఁబడు

చున్నది. [ససంరంభంబుగ, సంపరిక్రమించి, శేఖరభ్రంశ మభినయించి సవిషాదం
బుగం గాంచుచున్నాఁడు.]

క. ఓలంకేశా విగళిత, చూడాలోకనము చేతఁ జూ చనెదుఁగదా
కాలంబు గావున న్వే, శూలిది విల్లందికొమ్ము శూరత మీఱన్.

పు—[తనలో], నే నెట్లు వీనిచే నెఱుఁగఁబడితిని? అటుగాదేని, ఘుణాక్షర న్యాయాను
సారముగ శబ్దసామ్య మాయది. [ప్రకాశముగా]

గీ. హేలమెయి నారినిం గట్టి యెక్కువెట్టి, శూలివిలు మేలు మే లనఁ జూడఁబడుదు
నేను బూనిన నిది యెంత భూన నడ్డ, మేమి యుండెడు నీదారి హితతమంబు.

[పరిక్రమించి, తనలో] అయ్యో! ఈ ప్రతికూలశకునశంకువుచే శైలచాప చాపా
రోపణముకొఱకు నాభుజబలము కట్టఁబడిన ట్టయ్యెను. దీనిచే నేమి? [ప్రకాశంబుగ]
ఓయి! ధను వన వంకరయే పద్ధతి. కావున సరళమైన కరవాలధారాపథంబున
సీతం దెత్తును.

మం—ఓయీ! ఏల ప్రాగల్భ్యములఁ బలుకుచున్నాఁడవు? చూడవా యేమి?

తే. భూరిరోషారుణాక్షిశోభోరుభిన్న, భ్రూవిభంగవిఘటిత సుభ్రుకుటియుతము
కోశనిర్ముక్తనిస్త్రింశఘోరబాహు, దండచండంబు నరవీరమండలంబు.

పు—[కత్తిదూసి చుట్టుపట్లఁ జూచి], చూడు,

తే. దారితారిద్విరదకుంభతటవిముక్త, మౌక్తికసుతారకితనభోమండలరుచి
కాళరాత్రి వలెనె యెదిక్కులునాల,ముని నదిది నాదుకైదువు భూపులార.

[ఆకాశంబునఁ జెవి నిచ్చి] యేమి చెప్పుచున్నారు? ఓ.

తే. ఒకఁడెఁ జెక్కుండ్రతో నెట్టు లోపుదు నని, సలుప నని వగ మానుము తలఁతు పెద్ది
జయముమదియొనర్పుచిత్తమసమరమునను, బూన్కిసమరేఖచే నిందుఁబొందుఁగాను.
ఆహా! మానిసిపురుగులదిట్టతనము? కాఁబట్టి స్వాకారముచే వీరి న్వెఱపించుచున్నాను.
[నేపథ్యమందు]. [అని, నిష్క్రమించెను].

చ. అమరసరిత్సువర్ణజలజాంచితభూరిబిసాంకురంబులన్
సమదదిగంచితోల్లసితసామజసద్దశనాంకురంబులన్
భ్రమదముచేత నేయవి పరంగను బీఁకుటఁ బాపె బాలభా
వ మవి మదీయబాహు లివి బాగుగ సత్ప్రకటీకృతంబులౌ.

[అంతట స్వరూపముతో దశాస్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నూ—చెలికాఁడా! చూడు. ఓ. ఆశ్చర్యము. ఓ. ఒకమానిసికిం బదితలలు,

మం—వయస్యుఁడా! వీఁడు మనుష్యుఁడు గాఁడు. ఐన, రాక్షసరాజు.

నూ—[భయముతో], కావున నన్ను నాశనేస్తకాఁడు కాపాడవలయును. ఓయీ! రక్కసుఁడే తన కెదురుపడిన మానిసి మ్రెక్కుచున్నాఁడు. వెండియు రక్కసుల యొడయుం డన నేల?

మం—[నవ్వి] చెలీ! వెఱ్ఱ పేల? నిఖిల వీరవరులచే నభివందింపఁదగినదిగదా, వంది జాతి! అందువలన, భువనైకశూరుఁడైన యీ నిశాచర చక్రవర్తి మనవంటివారి విషయమున నెట్లు విపరీతవర్తనము గలవాఁ డగు?

కావున నిర్భయుండవై యితని నడిగెదము. (రావణుని సమీపించి) ఆహా! ఇన్నితల లేమని మోవఁబడుచున్నవి? ఏమునియూ? ఒక్కటిం ద్రోచి తక్కినవి నఱికి యొక్కడనేని విడవఁబడ కుండవు?

రావణుఁడు—[సక్రోధుండుగ] హా? ఓరి పాపుఁడా! అస్థానమందు నాదు శిరశ్ఛేదముం దెలుపుచు నాకమంగళమును భావింపుచున్నావు. నీవు వైతాళికుఁడవు కావున జీవించి యున్నాఁడవు.

మం—[విహసించి,] ఓయి దశకంఠుఁడా! స్థానమందైనచో మాత్రము మస్తకచ్ఛేదంబు మంగళమున కెట్లగు?

రా—ఓరీ! స్థానమందైన మంగళమునకే, ఎట్లన్న;

క. ఘనవిద్యాధరవనితా, జనకరవిన్యస్తకుసుమచయసంకీర్ణం

బున శివచరణమునను రణ,మునఁ దలగమి దెగుట నాకు మొగి మంగళమే.

నూ—నీ విట్టివాఁడవైన నెందువల్ల నిందు నిజరూపముం గోపనముసేసి మ్రుచ్చువలెఁ జొచ్చినాఁడవు?

రా—ఛీ! మూర్ఖా!

క. పురహరగిరిసంచాలన, వరశక్తిసమన్వితములు బాహులు నావీ

గురుభుజములచేఁ దచ్ఛివ, శరాస మొకఁ డెక్కడ నెటు సైఁతును లజ్జన్.

దీనిచే నది చాలును. జానకి యెక్కడ? వక్కాణింపుము.

మం—అపవారించి (మఱుఁగుసేసికొని) నెయ్యుఁడా! నూపురకుఁడా! అప్రతీకార మనర్థము. మఱియు [సవిషాదంబుగ.]

చ. అగుఁగద యాజ్ఞవల్క్యుఁడు మహాముని నీకులసద్గురుండు నీ

కగుఁగద తండ్రి యజ్ఞనకుఁ డంచితుఁ, డంబ ధరిత్రి యట్టి నీ

వగుదువయో పలాశనకరాంకగ దుర్విధివైశసంబునన్

సుగుణరో బిడ్డరో యిపుడు శోకముఁ బొందకయుండ శక్యమే.

సూ—ఔచ్చోలీ! దిగులొందకుము. ఈ రాచపిండునందెల్ల నొకండైనను, తగనివనికిఁ బూనిన వీని కెదురుగ నిలువఁగలవాఁడు లేఁడా?

మం—[నిట్టూర్చి] క్రోధోద్ధతుఁ డైన దశకంఠునకు సహస్రబాహువైన కార్తవీర్యుని కంటె నన్యుఁడైన క్షత్రియుఁ డెవ్వఁ డభిముఖుఁడవు?

సూ—[సహర్షంబుగ] బ్రదికితిమి. ఓ. అదె వేయిచేతులు గల కృతవీర్యసూనుఁడు వచ్చెను.

మం—[విహసించి] ఇస్సీ! తెలివిలేనివాఁడా! పరశురామ కఠోరకుఠార ధారాజల నిమగ్నుఁ డైన యర్జును నివు డెట్లు చూచుచున్నావు?

సూ—ఓరీ! దబ్బఱ చదువరీ! ఎట్టయెదుట నున్నన్ లేన ట్లెట్టు వాదాడుచున్నాఁడవు? ఓయీ! ముందర వీఁడు వేయిచేతులవాఁడు చూడఁబడుచున్నాఁడే; చూడు.

మం—ఔను. వీఁడు బాణాసురుఁడుగా నుండవచ్చును. [భయముతో మనస్సునందు] కనుక, ఇది మఱియొక యనర్థ మంకురించినది. [విమర్శించి] అది గాకున్నన్, విష మునకు విష మౌషధము గాఁగలదు.

బాణాసురుఁడు—[ప్రవేశించి, గర్వముతోఁ బరిక్రమించి] చిరకాలమున కిప్పుడు,

క. కైలాసముకంటెం గడు, సారతరంబైనధనువు శర్వునిదిది సా
 కేలం గుసుమసమముగన్, గ్రాలంగావింతు భుజవనము సఫలముగన్.

రా—[వినఁబడమిచేత] ఓయీ! ఇప్పుడును సీత రప్పింపఁబడకున్న దేమి?

బా—[చూచి, తనలో,] ఇక్కడ దశకంఠుఁ డెట్లు వచ్చె? అగుఁగాక. [ప్రకాశముగా] ఓయీ! ఇంత శూరవారమందు శివనిచేతఁగాని యీ సింగాణి యెక్కిడఁబడ దయ్యెనా?

మం—ఎక్కిడఁబడదయ్యెడు.

రా—[చూడఁబడమిచేత.] అందువలన నాదు చంద్రహాసమే సీతను రప్పించును.

బా—[విహసించి] నీ వీరలక్ష్మీవిలాస మిటువంటిదేని, విల్లెక్కు పెట్టకయే సీతను రప్పింప నేల?

రా—అ! పొల్లు ప్రల్లదము లాడువాఁ డెవఁడు వీఁడు?

గీ. చండబాహుదండచలితహరాచల, కీర్తిశాలి నగుచుఁ గెరలునాకు
 బాలబిససదృశము బాణాసనము నెక్కు, పెట్టుకొర్కిఁగలుగు నెట్టి దసము.

బా—ఇది యశక్తి పర్యాయోక్తి.

రా—అ! ఓరీ! ఈ దశవదనునికిఁగూడ నశక్తిసంభావన యెట్లు?

బా—[నవ్వి] ఓయీ! బహువదనత్వము బహుప్రలాపితకు హేతువు. పరాక్రమము నకు బహుబాహుత్వమే.

రా—ఓరీ! ఏల? పలాలజాలముపోలె నిస్సారమైన నిజభుజసారముచే వీరంమన్యుఁడ వవుచున్నాఁడవు?

బా—పలాలజాల నిస్సారమా, నా భుజసారము? [బాహువులం జూపుచు] ఇక్కడఁ గదా?

శా. పాతాళంబున కేగి తండ్రిది పదాబ్జద్వంద్వముంగూర్చి సం
ప్రీతిం ద్రెక్కఁగ నెన్నిమాఱు లట నావే చేతులం దాల్చి యీ
ధాత్రి న్నిర్గతభారసర్వఫణుఁగం దద్దండధరాకేంద్రు సం
ప్రీతుం జేయఁగనైతిఁ గూర్మకిటిదిగ్వేదండముల్ప్రొక్కఁగాన్.

రా—ఓరి బలితనయుండా! చలితనయుండ వవుచున్నాఁడవు. ఎందువలన నసత్యవిక్రమ వర్ణనచే, సత్యవిక్రముఁడవు లంకేశ్వరు సమక్షమున నిన్నుఁ బొగడుకొనుచున్నాఁడవో, అందువలన.

బా—మఱి నీ వెట్లు సత్యవిక్రముండవు?

రా—ఆ. చంద్రమౌళిధరము శయ్యగల్గు శయ్యంబు, గాఁగఁ జేసె నేవి కలశసంప్ర
లిప్త హిరలక్ష్మి దివ్యసౌధంబులా, మద్భుజములమహిమ మది నెఱుఁగవు.

బా—ఈ వ్యర్థ యుద్ధముచె నేమి? ఓయీ! మన యిరువుర బాహుసారతారతమ్య
పరీక్షయం దీశరాసమే త్రాసు గాఁగలదు.

రా—అట్లగుఁగాక.

మం—ఓయీ! నరవీరైకసమర్పణీయ జానకీవివాహమనోరథముచేతఁ జేతోమార్గ మేల నలఁగింపఁబడుచున్నది?

బా—క. శివధర్మ మెక్కుపెట్టుట, యవనితనయ నేను బెండ్లియాడుటకై కా
దు బహుళదోర్వ్యూహబల, ప్రవరత ప్రథితముగ దెలియఁబఱుచుటకొఱకే.

రా—క. శివగిరిశిఖరముఁ బెఱుకుట, సువిదితమన్మద్భుజబలసుపరీక్ష యిదో:
శివధనురానమనక్రియ, యవనిజకుచయుగళకేళి కాసక్తినె యా.

[నేపథ్యమందు,]

క. ఎవఁడేని సురాసుర మానవకిన్నర సిద్ధచారణ ఖగాహులలోఁ
దివి నెక్కిడు నీధనువున్, దవువాఁడు మదీయసుతకు ధవుఁడుగ నుండన్.

రా—[సహర్షంబుగం బరిక్రమించి చేతులఁ జూచుకొనుచు,]

తే. చేతులార త్రైలోక్యముఁ జేయఁ డీరు, తెలుపుగా నీశివధనుస్సు మలఁచు కీర్తి
సరగ జానకి కుచకుంకుమరసమునను, బాటలత్వంబుఁ బడయుఁడు బాగుమీఱ.

[వింటిపయిం జేతు లుంచి కదలింపఁ గడఁగి,] [తనలో,] కదల దేల! [ప్రకాశంబుగ] ఓయి బలినందనుఁడా! నీవే యిప్పు డీవి ల్లెక్కు పెట్టుము. క్రొత్తగా వచ్చినవాఁడ వగుటచేత, మాకును మాననీయుఁడ వగుచున్నాఁడవు.

బా—అట్లగుఁగాక, [అని పరిక్రమించి, కోదండమునకు భుజమండలము నారోపించుచున్నాఁడు].

రా—[స్వగతంబుగ] ఓ మనస్సా! ఏల వెఱచెదు? కుంఠీకృతదశకంఠపరాక్రమంబగు నీశితికంఠకార్ముక విషయంబున వీఁ డెంతటివాఁడు?

మ. ఎవఁడే నన్యుఁడు దీని భీమునిదియౌ నిష్వాస మెక్కించి తా
నవనిప్రోద్భవఁ బెండ్లియాడినను నే నత్యుద్ధతిన్ మైథిలిన్
జవమారంగను లంకఁ జేర్తును వచస్సంతర్పితం జేయుదున్
స్వవశంగా నొనరింతు నెంతయు మహాసంతోషముం గాంచెదన్.

మం—[సహర్షంబుగ] మిత్రుఁడా! నూపురకుఁడా! చూడు. ౨.

చ. కదలదు కొంచెమైన శివకార్ముకమిద్ది సహస్రబాహుఁడై
విదితుఁడు నైన బాణసురవిద్విషు చేతులచేత నీశరన్
మదనశరార్దితాధిక సమంచితవాక్కుల వాంఛితంబు నై
కదలనిసాధ్వి మానసముకైవడి నైపము ధర్మి మల్పమే.

రా—[సవిషాదంబుగం దనమనంబున] సీతానునయాంతరాయముం దెలుపు నీ దురుపశ్రుతియేల? [ప్రకాశంబుగ] ఓయి బాణుఁడా! నీభుజబల మంతయుం జెత్తప్రోవు వోలె నిస్సార మాయెనా?

బా—[సక్రోధంబుగ] ఓయి! నయపరాఙ్ముఖ! దశముఖ! నా భుజవనము నాలోకించుచును వెగటుమాట లేల మాటాడుచున్నావు?

-[నవ్వి,] దీనిచే నేమి చేయఁగలవు?

బా—సహస్రబాహుఁడైన హైహయరాజుచే నేది చేయఁబడియె నదియె.

రా—ఆ! పాపుఁడా! ఇదె, నా ప్రతాపానలము నీ భుజవనమును నిర్దహించును.

బా—ఇదే, ధనుర్లతానుగత మదీయ బాహు బలాహకాళీ నిష్ఠ్యూత నిష్ఠుర శరధారాసారము నీ ప్రతాపానలము నార్చును.

బా—ఆ. బాణపంచశలినిఁ బఱపరబాణుండ, కలదు నాదు కేల ఖడ్గలతిక
[హృదయము నభిలషించి,]

పంచబాణ నీవు పఱపర బాణములన్, నన్నుఁగూర్చి వచ్చు నస్త్రులఁతుక.

సూ—ఓయీ! బాణరావణులు తమం దమర పొగడుకొనుచు సిగ్గొందకున్నారు.

రా—ఆహా! ఎట్లాత్మమాత్రశ్లాఘనీయుఁ డగుచున్నాఁడు పంక్తికంఠుఁడు!

శా. మామందోదరి గొప్పకొప్పున రహింపం జారుమందారదా
మామోదన్మకరంద మానుచును సమ్మానంబునం బొల్చు వీ
ణామాధుర్యధురంధరధ్వనిని విన్నాణంబునం దెల్పు చో
రా మద్విక్రమము న్మధుప్రాయములన్ రంజిల్లఁ గీర్తించెదున్.

బా—ఎట్లు వీఁడు మందార కుసుమ దామ కమనీయ కామినీజనోపభోగ సౌభాగ్యలీలచే స్వీయవిక్రమమును విభావించుచున్నాఁడు? అందువల్ల నిప్పుడు,

మ. తులితస్వర్ణ మహీధ్రశేఖరము లౌ దోర్దండముల్నా విపే
బలవైరిం బవిహస్తుగర్వకలితుం భంగించి తన్నందనో
జ్జ్వలమందార ముఖామరద్రు లతికావర్గంబులం బెల్లగిం
చిల నావేడుకతోఁట దేవతరువల్లీద్వ్యంబుగం జేయుతన్.

[అని నిష్క్రమించెను.]

రా—ఏమి వీఁడు పోయినాఁడే. పోనీ! నేనో,

క. నాఁనుపజీవిని యేడుపు. నీయానన న్విసకయున్న నేనిట సీతా
తోయజనేత్రం బలిమిన్, జేయక చేర నకవి దుసే యిటు లయ్యెన్.

మం—[స్వ.] బిడ్డా! జానకీ! ఇప్పుడు దైవముచేఁ గాపాడఁబడినదానవు.

రా—[ఆలకించి,] ఇది యెవనియేడుపు వినఁబడుచున్నది? స్వరముచేత మారీచుఁ డని యూహించుచున్నాను. తగును. వీఁ డొకానొకవీరుని నారసముచేఁ బీడింపఁబడినవాఁ డగుచు నంబరము నవలంబించి పోవుచున్నవాఁడుగా నుండవచ్చును. అందువలన వీని నూఱడింతును. [అని నిష్క్రాంతుం డయ్యెను.]

సూ—చెలికాఁడా? పులినోటినుండి విడివడిన ముగుదజింకవోలె సీత యిప్పుడు విడుపు గన్నది.

మం—ఇది యిట్లేకాని, ఈవృత్తాంత మంతయు ఱేనికి విన్నవింతము.

[అని యందఱు న్నిష్క్రమించిరి.]

ఇది ప్రథమాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## ద్వితీయాంకము

[తరువాతఁ దాపసుఁడు ప్రవేశించుచున్నాఁడు]

[ముందు సూచి,] ఆహా! పెక్కులు చిలుకపిల్లలతోడఁ గూడుకొనుటవల్లం జెల్లుగఁ జామనిచాయ గలిగిన పసరువన్నెతీఁగల మేలుకట్టుచే బాగుమీఱిన పూఁదోఁట యొక్క వాటమైన యునికిగల యీప్రదేశము నాయుల్లమును జల్లఁజేయుచున్నది. [ముందు సూచి] ఈ భిక్షు వేల దండనుండెడు? [బిగ్గఱగా] ఓయి భిక్షూ! ఇక్కడ.

భిక్షువు—[ప్రవేశించి] తాపసున కంతయుం గుశలమా ?

తాపసుఁడు—నీరాక చేత నిప్పు డది విశేషము. [వెండియుం సస్నేహముగా] భిక్షువా నీవు పురుగువలె భూపర్యటనముచే బడలినావు. కావున నీమిథిలయందు నైదురేలు విశ్రమింపుము. ప్రసంగమువలన నీ క్షేమం జూడఁబడఁదగు.

భిక్షువు—కోరికలేని మాకు ఱేని పరిచయముపలన నేమి ?

తా—కాదుకాదు. ఈ సీరధ్వజుఁడు బ్రహ్మవిద్యావినోదశీలుఁడు.

భి—[కౌతుకముతో] సత్యము. ఈరాజు బ్రహ్మవిద్వాంసుఁడు.

తా—నిజము. స్వామియయిన దశకంఠునకు [అని యర్ధోక్తి గలుగఁగా,] స్వామియైన శితికంఠుని యాజ్ఞ.

భి—[విహసించి] తెలిసెఁ దెలిసె. నీవు రాక్షసుఁడవుగదా ? తాపసుఁడవు కావు.

తా—నీ వెవ్వఁడవు ? అది చెప్పుము.

భి—నేను నెవఁడో యొకఁడను; నీవంటివాఁడను.

తా—సర్వమంత్రి మకుటమాల్యభూతుఁడైన మాల్యవంతునిచేతఁ దాటకంగుఱించి పంపఁబడిన వాఁడనుగదా నేను. అతనిచేత వినఁబడెఁగదా ? ఎట్లన్న; విశ్వామిత్రముని తనజన్నమును గాపాడుటకొఱకు నీకొడుకుల రామలక్ష్మణుల నిమ్మని యయోధ్యానాథుఁడైన దశరథరాజును యాచించెను. అపుడే డీముని యవశ్యము మానసీయుఁ డని యెన్ని తనకన్నులకన్నఁ బ్రీతిపాత్రము లైన యయ్యిరువురు తన యులనతని కొప్పగించెను.

భి—ఆటుపిమ్మట నటుపిమ్మట.

తా—అంతట సంతుష్టుండై యాముని యా భూమీశ్వరునకు దివ్యమైన తాటంకయుగళము పారితోషికమొసంగెను. మఱి, ఈ తాటంకద్వంద్వము వెలుఁగొందందగినది.

క. కాన నిది పీరజననివి, పీనుల కుచితం బటంచు విలసిల సౌరా
మానికములలో వర్ణవి,తానము తానే తెలిపెడుఁ దథ్యముగాఁగన్.

అందుచేతఁ గౌసల్య కర్ణములయం దునుపవలసినది యని చెప్పెను. రాచకొమరుల నిరువురఁ దోడ్కొని యమ్ముని నిజాశ్రమపదమునకుం జనియెను.

భి—అహా! మణులలోపల వర్ణములు స్ఫురించుననునది యసంభావ్యమఁట! [ఆలోచించి] మఱియుం మాల్యవంతునిచే ఎవనివలన నాలకింపఁబడియె?

తా—తే. వార్తకౌతుకకరివిద్య పరమవిమల, మఱిజగన్నుత మృగనాభిమహితగంధ
మంబుఫునఁ దైలబిందువునట్టు లణఁగ, కేచు నీమూఁడు దమయంత నీజగమున.

అందును బలుగుండ్ర వేఁగువాండ్ర నియోగించినవాఁడు మాల్యవంతుఁడు.

భి—పిస్మటఁ బిస్మట.

తా—అది విని యాకమ్మదోయి లంకజేరియమ్మ చెవులకుఁ దగిన దని యెంచి దానిని హరింపఁ బ్రేరింపఁ దాటకంగూర్చి మునుపే యొవఁడో పంపఁబడెను. ఇపుడా తాటక చేతివలనఁ దాటంకములఁ దెచ్చుటకుఁ దాటకావనముంగుఱించి నేను బంపఁబడినాను.

భి—అట్లయిన నెట్లు మిథిలోపకంఠవనంబుం బ్రవేశించితివి.

తా—లంకేశ్వరుఁడు మిథిలకు వచ్చెనని నేను వింటిని. మిథిలావృత్తాంతము దెలియఁ దగిన దని మాల్యవంతుఁడుం జెప్పెను. అందువలన మొదట మిథిలోపకంఠమునకే వచ్చితిని. మఱి నీ వెవ్వఁడ వది చెప్పుము.

భి—తాటకంగుఱించి మాల్యవంతుఁడు మొట్టమొదట నెవనిఁ బంపెనో! వాఁడే నేను గదా? మిథిలాగమనకారణమో మన కిరువురకు సమానము.

తా—[సహర్షంబుగ] ఇప్పుడు చెప్పు మంతయుం సతాటంక మగు తాటకావనమును గూర్చి.

భి—[నవ్వి] చెలికాఁడా! సతాటక మని యంతవఱ కడుగుము.

తా—[సాతంకంబుగ] మఱి యా తాటక యిపు డెక్కడ?

భి—పురిం బ్రవేశించెను.

తా—అదేమి దశరథునిదా?

భి—కాదుకాదు, కాలునిది.

తా—తాటకకు దేనిచేత నంతకపురప్రవేశము?

భి—రామబాణముచేత.

తా—ఓయీ! ఆరాముఁ డెవఁడు?

భి—[విమర్శించి] విశ్వామిత్ర పరిచర్యాప్రవణులైన దశరథునికొడుకు లిద్దఱిలోఁ బెద్ద వాఁడు వీఁడుగదా!

తా—సరే. మఱి, తాటకాకుమారులు మారీచసుబాహు లిపు డెక్కడ?

భి—సుబాహు వామెనే యనుసరించెను. మారీచుఁ డరణ్ బాలలీలోచితమైన రాము నా రాచపాతకముచేత దూరముగా నెత్తుకొనిపోఁబడి ప్రాణముతోనే పాఱవేయఁబడెను.

తా—ఐన నిది యునిచేనేని దశకంధరునికి విన్నవింపఁబడెనా?

భి—సరే. వాలమ్మగారిచేఁ గొనిపోఁబడినవాఁడును కూఁతలిడుచున్నవాఁడును నగు మారీచునిచేతనే మిథిల కరుగుచుండిన లంకేశ్వరుని కిది విన్నవింపఁబడియెను.

తా—పిమ్మట, ప్రకృతికోపనుండగు రాక్షసరాజే మని తలంచెను?

భి—చెలీ! సీతాముఖశీతాంశు శకలమైన లంకేశ్వరుని మనసుసంతాపమును బొడమదు.

తా—అందువలన రామలక్ష్మణు లిపుడు విశ్వామిత్రాశ్రమమందే యున్నారా?

భి—లేరులేరు. ఆయిరువురతోడంగూడ విశ్వామిత్రుఁడు మిథిల కరిగెనని నేను వింటిని. [తెరవంకఁజూచి సాతంకంబుగ] ఆహాహా! మహాప్రమాదము. పలాశ సమూహ దాహక దావదహనుఁడు సానుజుండు రాముండు వీఁడె సంప్రాప్తించెను? కానఁ దొలఁగి చనుటయే మనకు శరణము. [అని యిరువురు నిష్క్రమించిరి.]

ఇది శుద్ధ విష్కంభము.

---

అంతట రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.

రాముఁడు—వత్సా! లక్ష్మణా! ఆరామమునయొక్క రామణీయకముఁ జూడుము.

లక్ష్మణుఁడు—ఆర్యా? స్వభావముచేతనే యీతోఁట యందమైనది. ఇప్పుడన్ననో వసంతలక్ష్మీసమాగమముచేత మఱింత విశేషము.

రా—అబ్బాయీ! ఇది యిట్లే. వసంతలక్ష్మి అవతరింపనే యవతరించినది. ఎట్లనఁగా?

తే. లేఁతి పూఁదేనెఁ ద్రావెడు లేఁటిబోంట్లు, కాకలీధ్వని యింపుమయి క్రాలుఁ జాల
దక్షిణానిలనిర్దిష్టతత్పదగతి, నిందు వంజుళమంజరి యెలమినాడు.

మఱియును,

ఉ. చిత్తజరాజశాసనముచే మలయాచలమందునుండి యా
గిత్తహిమాయిరౌతు దగుకీర్తిశైలముదాఁక భూతలం
బిత్తఱి గెల్వఁ గోరి సురభీడితబాలసమీరణుండు మున్
జిత్తజవైరి వ్యాళధరుఁ జేరఁగ జంకుచుఁ బోవుఁ దిన్నఁగన్.

ల—నేను మఱియు నిట్లూహించుచున్నాను.

మ. ప్రతిమార్గంబున నల్లతావరతనూవర్గంబు పుష్పౌఘము
త్కృతమాధ్వీకరసంబువర్షముగఁ బర్వింపంగఁ బూజింపఁగాఁ
జతురాళి ప్రమదానుగీతపరమాసక్తంబు నా జింకశా
క్కితగం ద్రిమ్మరుఁ దిన్నదిన్నఁగను బూన్కిం బూవడిం గా డ్పిలన్.

రా—అబ్బాయీ ! ఇంతలోఁ జాలు. ఇపుడు భగవంతుఁడైన విశ్వామిత్రుఁడు పూజనీయుఁడైన యాజ్ఞవల్క్యునిసమాగమసుఖ మెంతదడ వనుభవించుచుండునో, యంతదడ వాయనయొక్క సాయంతనదేవతార్చనమున కుచితములైన కుసుమములను గోయుము.

ల—వల్లే [యని చెట్టునడుమఁ బూలుగోయుట నభినయించుచున్నాఁడు.]

రా—[పరిక్రమించి.] ఏమి ! ఇచట చండికాలయ మొకటి యున్నది! (బద్ధాంజలియై).

క. తల్లీ దయామృతరంగిణి, ఫుల్లాంబకసత్సుధోర్మి పురుశీకరిణీ
సల్లలితచంద్రమౌళి, ప్రోల్లసితసతీమతల్లి మ్రొక్కెద నీకున్.

ఆహా ! ఇదె దగ్గఱనే, మదకలకలహంసోత్తంసితకమలసముదయకమనీయము సరోవరము నాచిత్తమును స్వాయత్తముగఁ జేసికొనుచున్నది. [సకౌతుకంబుగ] ఔరా ! ఎట్లిది పిల్లరాయంచ, వనజవనచరి నృహచరిస్వాసి, మామిడిచెట్టునడిమియెడ కరుగుచున్నది? [చెవి యొగ్గి] ఆహా ! ఇ దేది ? మదనమహారాజవిహారమదావళముయొక్క పసిఁడిగొలుసుల చప్పుడుచాడ్పున మనోహరమగు కోలాహలము వినఁబడుచున్నది. [నిపుణంబుగ న్నిరూపించి] నిజముగ నిది యందెలరొద ఈరాయంచపిల్ల తిరిగికొనఁబడినందున. ఇందువల్ల నిందు ముందుగ నెవతెయో యొకసుందరి, కాళ్లకదలికచే మ్రోయుచున్న యందియలఁ గలదియగుచుఁ జండికకో వెలకు వచ్చుచున్నదిగా నుండు వచ్చును. కాన, నిఁక నాలోకించుట చాలును. పరస్త్రీశంకయు, రఘువంశజులమైన మాసంకోచమునకు, [అని పరాఙ్ముఖుఁ డగుచున్నాఁడు.]

[తెరలో] భర్తృదారికా! ఇక్కడ నిక్కడ.

రా—ఈమె రాజకన్యయా ? అందువలనం దిలకించెద. [అంతయు విలోకించి, సకౌతుకంబుగ].

ఉ. ఏయదియిద్ది జాలిపయి నేర్పడ గీచినపైఁడిగీఁత గాం
గేయపరంటిలోనిజిగిఁ గేరెడు నంగముల న్నిడుర్ హారి
ద్రాయుతనీరపూరరుచి దర్పకుక్రీడలగీముపాకిటన్
శ్రీయుతమైనదివ్వెవలెఁ జెల్వుగ వెల్వడుచున్న దెన్నఁగన్.

[అంతట సీత ప్రవేశించుచున్నది. సఖియును.]

సీ—చెలీ ! చూడు మిప్పు డిప్పూఁదోఁట, విల్లెక్కిడికొన్న వాఁడును, ఆమనితోఁడఁ గూడు కొన్న వాఁడును, నగు మరునిచేతఁ గైసేయఁబడినకైవడిఁ గానఁబడుచున్నది.

స—అనవద్యాంగి ! ఇది యిట్లే.

రా—సర్వానవద్యాంగి యని చెప్పఁగఁదగు. ఇప్పుడలికి వ్యక్తముగదా !

తే. మోవిబంధూకబంధువు మొగలిరేకు, వన్నెగ న్నిప్పుపూ మొగ్గవలెను ముగ్గ
పలువరుస దాడిమీబీజపరిభవకర, మగును మొగ మన్నఁ దమ్మి కొసఁగును గొలువు.

[వెండియుం జూచి.] ఆహా ! ఈమె ముగ్ధయయ్యును, ఆయా కమనీయవస్తువుల విషయమైన పరిశీలనౌచిత్యచాతుర్యమును, అంగములచేతనే యంగీకరించుచున్నది.

చ. అడుగులచేత నంచదరుణాంబుజకాంతి నధఃకరించెదుర్
గడుకొని కేలఁ గైకొనెడుఁ గ్రమకిసాలసుశోణశోభలన్
విడువక విద్రుమద్యుతి నివే పలుకప్పునఁ గ్రోలులీల నొ
ప్పడరెడు నవ్వువెన్నెల సుధాంశురుచి న్నగువన్నె మిన్నగన్.

స—రాజపుత్త్రీ ! ఇదిగో ముందు చండికగుడి.

సీ—[సాంజలిరై] ఓసి దేవేరీ ! నెలదారిసామేనిదానా ! ముజ్జగముల ముత్తైదువా ! నీకుఁ గేల్మోడ్పు.

స—[నవ్వి] జాతరీతి మిగులఁ దగినదే.

సీ—[పొలయలుకతో] పొల్లు ప్రల్లదములఁ జాలింపుము.

స—[దోయిలించి] ఓదేవీ !

క. ఇందుశిరోమణిరమణీ, యిందుశిరోమణి మదీయహితసఖియౌ నీ
యిందుముఖి యిందుసుందరుఁ, బొందుత మగనిం దొరదొరఁ బురుషోత్తమునిన్.

రా—ఎట్టిమె పెండ్లిఁగోరునది చెలికత్తె? [ఆలోచించి] ఇది యుచితమే. వయస్సంధియం దీపె యున్నదిగదా ? అట్లే.

చ. కడవఁగ బాల్య మీడుగడఁక న్మనమారఁగ రాఁగ మౌగ్ధ్య మె
క్కుడన్గొ చనంగఁ గౌఁగిలిడు కాంక్ష పొసంగఁగ మిక్కుటంబుగాఁ
దొడరక యున్న నెవ్వఁడును దొయ్యలిదైనది మేను మానుగా
నడరెడుఁ గామదేవత మహాకవచంబుగ నిజ్జగంబునన్.

స—ఓదేవీ ! నాకోరికను వేగిరముగానే నెఱవేర్పుము ఈమె నెంజెలిం జెందకముందే.

సీ—ఏమని నెంజెలిం జెందెద ?

లక్ష్మణుఁడు—ఓరాజహంసకన్యకా! ఏల నెంజెలిం జెందుచున్నావు? ఇదుగో నీ మగండు మామిడిచెట్లనడుమ మఱిఁగియున్నాఁడు.

స—[సహర్షంబుగఁ దనలో] ఓమనసా సంతోషింపుము. ఇది సుఖోపశ్రుతిగదా?

సీ—[సకౌతుకంబుగ] ఎవని దిది యేనికగున్న గొంతుగవళివలెఁ దిన్నని తీయని బలుపుఁ బలుకు వినఁబడుచున్నది? కావున రావే కాంతము. [అని యిరువురు పరిక్రమించుచున్నారు.]

రా—[సవిషాదంబుగ] అయ్యో! ఎట్టి బత్తాంగి లతయేత మఱుఁగుపడెను? [లతంగూర్చి]

క. స్తనవిజితస్తబకశ్రీ, వినుతాధరనిర్జితకిసవిలసితలక్ష్మీ
వనిత న్మఱుఁగిడియెదె నా, నను గనకున్నావు నీవు నలువేవల్లీ.

[మఱియు, సహర్షంబుగ]

క. నలుపైన యరఁటియాకుల, నడుమఁ గనంబడెడునంగనామణి జలదం
బులనడుమఁ గానఁబడుశశి, కలవలెఁ దనిపెడుఁ జకోరకమునువలె ననున్.

రా—[అరఁటిచెట్టుంగూర్చి.]

ఆ. బాలహేమరంభ పడఁతుకతొడసిరిఁ, బడయఁ గడఁగు మీ వడెడల కదర
నీవిలాసవతినిఁ బోవనీ కాపుమీ, స్త్రీలకల లెనసిన స్థిరతను గను.

సీ—[సకౌతుకంబుగ] చెలీ! వీఁ డెవఁడు, కరువపునెమిలిపింఛెపుఁ గనులఁ గైసేయఁబడిన చెవులుగలవాఁడు, పసిఁడివన్నెవాఁడు, ముగుదతనముచే విడువఁబడినమోడ్కి-వేడబములు గలవాఁడు, కొమరుఁడు, చూడఁబడుచున్నాఁడు? వీనియెడ నామది ప్రేర్మిచేఁ దోడుగఁబడుచున్నది.

ల—ఔరా! ఈమె యేమె? నిర్వికారమధురమూర్తి, తద్దయు దయగలదిగ దర్శింపఁబడుచున్నది. ఈమెయందుం దల్లియందువలె నాచిత్తవృత్తి వర్తిల్లుచున్నదిగద?

సీ—[సకౌతుకంబుగ] చెలీ! ఈకొమరునిఁ గనుచున్ననాకు బిడ్డయైన యూర్మిళ మదిం దోఁచుచున్నది.

స—[నవ్వి] యుక్తము. ఇతఁడును, ఎవనికో యొకని కట్టివానికి బిడ్డఁ డను శబ్దముచేఁ జేర్కొనం బడఁదగినవాఁడు కాఁగలండు. ఎవనిఁ జూచుచున్న నాకు నీవును మనస్సున స్ఫురించుచున్నావో?

సీ—ఓసీ? నవ్వులమారీ! ఈమాట చాలు. ఇతఁ డెతఁ డని యడుగు.

స—[పరిక్రమించి] ఓయీ! ఎవ్వఁడవు నీవు? చిన్నప్రాయమువాఁడ వయ్యు, నెఱుఁగని వనవీథులయం దొంటరిగానె విచ్చలవిడి విహరించుచున్నాఁడవు?

ఉ—ధీ మూర్ధురాలా ! సమీపమున వర్తిల్లుచున్న యన్నయైన రామచంద్రునితోడఁ గూడియుండుటచే సాధవంతుఁడ నైన నన్నొంటరి యని యెట్లు చెప్పుచున్నావు ?

స—ఇపుడు నామనోరథశాఖ పుష్పితము.

సీ—మనము ముందువలె నిపు డెట్లు తిరుగుచున్నారము ? [అని పరిక్రమించి, యపక్రమించి.] సకియా ! ఒకటి మఱచితి. దేనికి బండిగురివెందతీఁగతోడికూడిక నమ్మగారు గోరుచున్నారో, అట్టి యీతియ్యమామిడిచెట్టు చూడఁదగినదిగదా ?

స—[సకౌతుకంబుగ మనస్సున,] ఆహా ! లజ్జాకుతూహల హేలాలాలితంబులు, వయస్సంధిమధురంబులు, వనితాజన లలితంబు లివి యెట్టివి ? (మాటలు.) [ప్రకాశంబుగ,] అందాఁక రమ్ము. చూతము. [అని యిరువు రరిగిరి.]

రా—[చూచి, సహర్షంబుగ,]

క. ఇది నామది యనుకలువకు, ముదంబు నిడు శారదమగుపున్నమ రేయై పొదలెడు వెండియుం నీయెడ, నిదియె జగన్మోహిని యన నెసఁగెడు నాహా.

[చూచి,] అట్లుగదా ?

ఉ. ఒందుత దీనిచూడ్కి యసితోత్పలమాలికమాడ్కి వేడ్కమైఁ
బొందుతఁ బూర్ణచంద్రరుచిఁ బోల్పగుదీనిదినెమ్మొగ మ్మిఁగం
బొందుగ దీనిచన్నుగవ పోరెడుఁ దామరమొగ్గలందముఁ
దెం దమముఁ సృజించెడును వింతగ దీనిదిగొప్పకొ ప్పాగిన్.

[విమర్శించి,] రసాలాలోకనకుతూహలమువలన నీచెలువ యెట్లెక్కడనే మెలఁగుచున్నది ? అందువలన నందనుకం దోలఁగియుండుదును. [తొలంగి తీఁగపొదయందణఁగుచున్నాఁడు.]

సీ—[సరభసంబుగఁ జనుదెంచి] చెలీ ! ఇదిగో తియ్యమావిచెట్టు. [సలీలంబుగ, రసాలలతను పరామర్శించుచు] సకియా ! మొలకగోరులకొనలచే వ్రాయఁబడిన మెత్తని యాకులచే నెన్నుచున్నాను ఇది యెవఁడో యొకనేర్పరిచేతఁ గావింపఁబడిన దని. ఇటు గాదేని, తనమది కదలికఁ దలరిన తుంటవింటిదంటచేతనే.

రా—ఓసీ లతాంగీ ! మఱి నే ని ట్లూహించుచున్నాను.

ఉ. ఫూవిలుకాఁడు నీతనువెపో తనవి ల్లని మధ్యదేశముఁ
దాఁ బిడికెంటఁ బట్టె భువనత్రితయైకవశీకరోరము
ద్రావిళవల్లిరేఖ లన రాజిలువ్రేళులసందుగీరలం
దో వరవర్ణినీమణి యొహో త్రివళీకపటంబుడంబునన్.

స—[చేరఁబోతి] ఇదిగో యీ వాసంతిక. [సకౌతుకంబుగ,] రాజపుత్రికా! ఈకడ సాలోకింపు.

క. ఇందు న్యాసంతీరస, బిందువు నిందిందిరములు పేర్మిం ద్రావున్
మందెని మందిర మయ్యెర,విందము నతిమందము గని వే విడనాడున్.

సీ—ఇది యిట్లే [ఇందున్యాసంతీత్యాదిపద్యముం జదువుచున్నది.]

స—ఆహా! తీఁగయొక్క చక్కందనము!

రా—ఆ! ఇది యేమి? వెండియుం దీవ వర్ణింపఁబడుచున్నది. ఇది యుక్తమే.

క. వదలఁగ శైశవశిశిరము, పొదలఁగ యౌవనవసంతమును గుచగుచ్ఛా
భ్యుదయ మొదవుటను నవయువ, తిదితనులత ముదమునిడు మదినిఁ గడు మాకున్.

స—[నవ్వి,] చూడు. ఇదె వాసంతీలత తానే బాలరసాలము నాలింగనము సేసికొన ముందుగ నరుగుచున్నది.

సీ—[బాలయలుకతో] ఇప్పుడు తప్పనుదువులఁ జెప్పు నీయొక్క ప్రక్క నెడలి వేఱొక్క చక్కి కరిగెద.

రా—[నిర్వర్ణించి]

తే. విమలబిసరోచులు కపోలవిభ్రమములు, చంచలసలీలనీలాంబుజములు గనులు
చారువికసదశోకకిసములు శయము, లతివవిలాసములు మనోహరము లవును.

సీ—[సకౌతుకంబుగ, తనలో]

ఛ. విరిసిననల్లగల్వలను బేర్చినదండ యనంగ నల్లనై
మరుపగవానియాదలను మానగుక్రొన్నెలవోలె లేఁతయై
పరఁగెడువీఁ డెవండు సిరిపాపని మీఱెడుఁ గురచెసొమ్ముపాఁ
డిరవుగఁ దీఁగయింట నిడు సెంతయు వేడ్క ను నాదుచూడ్కికిన్.

స—భర్తృదారికా! తీవెఁ జూచు కుతూహలము నేల మానినావు?

సీ—[వినన ట్లభినయించుచున్నది.]

స—ఎట్లీమె యన్యాసక్తచిత్త యయ్యెను? మఱి యీమెచిత్త మెట్లో? [రామునిఁ జూచి, సాకూతంబుగ,] ఆ! ఇది యీమె చిత్త మను గజమునకుఁ గట్టుకంబము. [నిర్వర్ణించి] ఇది యుచితమే. అట్ల కదా?

క. ఈముగ్ధాకృతిచేతన్, శ్రీమహితునిచేఁ గుమారవృషభునిచే నా
రామం బీయది సలతము, సోమాప్తిఁ గపర్దమువలె సొబగొందుఁ గడున్.

స—[సీతను జేతఁబట్టుకొని] ఏమమ్మా! నీచెలికత్తె నేల విడనాడెదు? అటు గాదే నిది యుచితము.

క. నామాట వినుటవలనన్, శ్యామ లతావలయమునకు నరుదెంచుట నే
నీమనమున నీమనసిజుఁ, డేమే తెలకొన్నవాఁడె యెఱిఁగింపవుగా.

సీ—[తనలో] దీనిచే నే నె ట్లెఱుఁగఁబడితిని? [అని సిగ్గుతో మొగము వంచుకొని నిలుచున్నది.]

రా—క. కనవే కురంగనయనన, యనములఁ గమలస్మయాపహారములను గనుం
గొన నగుఁ గళిందనందని, ఘనతుంగతరంగశోభ ఖతలం బెల్లన్.

స—[తనలో] ఈమె యేల సిగ్గుపడుచున్నది? అందువలన వేఱుచోటికిఁ జేర్చెద. [ప్రకాశంబుగ] నీహృదయ మేల యిప్పుడును నీప్రణయకోపమును వదలకున్నది?

సీ—[తనలో] ఏల యిది యలుకంగుఱించి పలికెను? మఱి యిది కాదు. [వెల్లడిగా] చెలీ! నీయెడ నే నేల కినలుదు? వే ఱెండో డెంద ముంచితిని, అందుచేత నట్లు తలంచితిని.

స—ఇప్పుడు మఱి యెక్కడ దత్తచిత్త వవుచున్నావు?

సీ—ఆరామ సీమనే.

స—ఆహా! ఈమె జాణగా నగుచున్నది. ఆకారప్రకటనముచేతనే వ్యక్తముగా నాకారగోపనమును జేసినది.

సీ—[లజ్జ నభినయించుచున్నది.]

స—సమ్మిక కిమ్మయిన నావంటిదానియందును, మనస్సు దాఁపకుము. నే నెఱిఁగినదే.

క. నీమన మున్నది దెలిసితి, రామునియెడ శ్యామతామరసదామశ్రీ
కోమలునెడఁ గమలాక్షుం, డామహితునియెడ శిఖండకాంచితునియెడన్.

సీ—సకియా! చూడు.

క. వలఱేనిచానదగునం, దెలరవళి యనంగ నేమొ నెఱిఁబల్కుచు నీ
యొలమావిమొగుడ తేనియ, నెలమిం ద్రావియును దేఁటి యిటఁ ద్రిమ్మరెడున్.

[తనలో]

క. కనులార ద్రావుఁడీచెలు, వునిసెమ్మొగమనెడితమ్మిపువుదేనె స్మీ
రనువొంద నందుఁ దిరుగుఁడు, గనఁబడియెడి నెం దితండు గడుఁగడు మఱియున్.

[అని, సలీలంబుగ రాము నాలోకించుచున్నది.]

రా—[నిర్వర్ణించి]

మ. అగుసర్వస్వము యౌవనంబునకు నీమా సర్వభోగాళికిన్
దృగుపాత్రం బగుభాగ్యము న్మదజయశ్రీకన్నసౌభాగ్య మా

జగదేకం బగుసారమా జనికి మెచ్చుంగాఁ ఫలం బంగజా
ధ్వగశృంగారరహస్య మీరమణి యా బాగించు కేఁ గాంచితిన్.

సీ—[తనలో, వెండియు నాగాథనే చదువుచున్నది.]

స—భర్తృదారికా !

క. ఇది యొకబాలభ్రమరము, గదురఁగ మది నల్లగల్వగమిని మెలంగాఁ
గదిసి కడుం గడఁకఁ బొదలిన, ముదమున నీకనులయెదుర మురియుచుఁ దిరుగున్.

సీ—[స్వగతంబుగ] ఓ కనులారా ! ఈమేలు వినికిచే నెగడుఁడు. [అని మఱియును రాము నాలోకించుచున్నది.]

రా—[సోత్కంఠంబుగ]

తే. బాల యమృతపయోధికల్లోలలోల, లోకనములు మునింగించు నీకడ నను
గాదె యిది సుముహూర్తంబు గాకయున్న, బ్రహ్మనిర్మాణముఁ లవెట్లు బాగుమీఱు.

చేటి—రాచకూఁతురా ! రాణిగారిచే నాజ్ఞాపింపఁబడినదానను. ఏ మని యనఁగా, బిడ్డ యగు సీతను దోడ్కొనివచ్చి యచ్చెరువుఁ గలిగించు మంచి నగలచే సింగారింపవలె నని; అందువలన నాసీతమొగముదామరం గనుంగొని కన్నులు చల్లగాఁ గలవారము గాఁగల మని.

సీ—ఎట్లు కూరిమివలన ముద్దరాండ్రు నాయమ్మగారు ?

చే—మిగుల ముగుద లని యనఁదగును.

సీ—మఱి యెట్లు నాయమ్మగారు ముగుదలు ?

చే—సహజముచేఁ జక్కందనము గలిగి చూడ్కులకు జాబిలిరేకమాడ్కిం జూపట్టునట్టి నిన్ను, నైసేఁత చేతఁ నైసేయఁ గోరుచున్నందున వారు మఱి మిగుల ముగుదలు గారా ?

ఆ. చెలియ నీదు మొగము చెలఁగుఁ జాదురుఁడుగఁ, బందువెన్నెల నిడుఁ బండ్లడాలు
నల్లగలువదండ నాతి నీయదిజడ, పాలపోఁతమాడ్కిఁ బరఁగుఁ జూడ్కి.

ఇందుచేఁ జాలు. అందువలనఁ బోదము. [అని ముగు రరిగిరి]

రా—[సవిషాదంబుగ, తనమనమున] అయ్యో! ఇయ్యబ్జాస్య చూపుమేర మీఱి పోయెను. [వెండియు సప్రత్యాశంబుగ]

తే. అగపడకయు నాకనులకు నగపడియెడి, నెంతయును వింత యింతి మేల్బంతియిద్దీ
పగలురా రేయిపోయినఁ బలుదమిఁ గను, సచ్చకోరకములకును జంద్రికవలె.

ల—ఆర్యా ! ఇది యగపడుచున్నది.

రా—అది యెట్లు తిరిగి వచ్చెను? [చూచి] కాదుకాదు. [బిగ్గఱగా,] అబ్బాయీ ! ఏది యగపడుచున్నది ?

ల—శా. లీలానిర్జితచిత్తసంభవధనుశ్శ్రేణుండుశై చూడఁగా
బాలుండై నసుధామయూఖునికి నొప్పం గాంతి నిండించుచున్
జాలన్ రాగముచేత మించుచు నుదంచత్తారకావా ప్తియై
క్రాలు న్సంధ్య స్వయంవరాంగనవలెం గావించుచున్ మోదమున్.

రా—(స్వ.) సుఖోపశ్రుతిచేత నింతకు నేమో యూఱడింపఁబడుచున్నాఁడను. (ప్ర.)
అబ్బాయీ ! ఇది యిట్లే. ఇప్పుడు గదా ?

మ. పొనరం జేసి కడుం బ్రబుద్ధకమలంబు ల్గాఁ ద్రిలోకంబులన్
దనరం జొచ్చుఁ బయోధిగర్భమును మార్తండుం డితం డిప్పు డ
వ్వననిధ్యాశ్రయుశాభిపంకజము నొప్ప న్విప్పఁజేయంగఁ దా
ఘనకౌతూహలుఁ డౌటనో యన హరిఖ్యాతుండు పద్మాప్తుఁడున్.

[మఱియుం సకౌతుకంబుగ.] అబ్బాయీ ! వీని నిక్కడఁ జూడుము. ఇంచుక మెఱయుం జీఁకటిగుత్తు లనెడు కస్తురిమకరికలగములఁ గలిగిన రాత్రిమత్తకాశినిఫాలస్థలమునందలి గందపుబొట్టువలె రేఱేఁడు వెలుఁగొందుచున్నాఁడు.

[విలోకించి, నిర్వర్ణించి]

శా. చాలం జక్కవదోయి కీయది మనశ్శల్యంబు జ్యోత్స్నాప్రియా
పాళీత్రోటికవాటయుగ్మము దెర్వం గుంచెకో ల్గాంచఁగన్
శూలిప్లుష్టమనోజభూజముబడిం జూపట్టు క్రొమ్మొలకా
మ్యాలీఢస్మయసామజాంకుశము నుద్యచ్చంద్రమో రేఖయా.

[విలోకించి నిర్వర్ణించి సహర్షంబుగ.]

మ. అలలం బోయినపంకముం గలదిగం గాంచ న్మృణాళంబు నొ
ప్పలరుం గ్రప్పుడబ్బి పుష్పశరభార్యాశీధుభృంగారనా
శరుచిస్ఫీతము వార్ధివెన్న ఖసరోలక్ష్మ్యబ్జపత్రాంబుబిం
దులసద్ధర్మము చంద్రఖండ మిది సంతోషంబు నీ దేరికిన్.

[చుట్టుపట్టుఁ జూచి సహర్షంబుగ,] అహాహా ! ఇప్పుడు.

రత్నావళి.

పొందఁగఁ దూరుపుబంధకిబంధువు - పొదలినఘనతిమిరప్రకరం
బందఁగఁ బదమరసై వ్వరిణివైరిసు - ధాంశునికరనికరంబు పొరిం
బొందు గసీలార్ధస్ఫటికమువలెఁ - బొనరుచు దిఙ్మధ్య మిటం గా
శిందీగంగామిళదమలాంభో - లీలాన్యోన్యాంచితమైత్రిన్.

అందుచేతం ద్వరితముగానే దేవతార్చనముకొఱకుఁ గోసినపూవులతోఁ బూజనీయుఁడైన విశ్వామిత్రుని నుపాసింతము. [అని రామలక్ష్మణు లిరువురు నిష్క్రమించిరి.]

ఇది ద్వితీయాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## తృతీయాంకము

[అంతట వామనకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వామనకుఁడు—[తన్నుఁ జూచుకొని,] ఆహా! నామేని పెంపు. కానీ! సొగసుగా నిగిడింపఁబడిన కేలు దలలతోడఁ బోవు నాకు వాకిలితలుపు సిగరములు దాఁకకున్నే? అందువలనం గుజ్జుగా నయి పోదును. [అని యట్లొనర్చుచున్నాఁడు.]

కుబ్జకుఁడు—[ప్రవేశించి, విహసించి,] ఓయి వామనకా! ఇపుడు నీవు, అన్నిగొనముల చేత నిండుకొన్నావు. ఎందువల్ల ననఁగా, మొదట వామనకుఁడవు. ఇపుడు మఱి గుజ్జుతనముం బొందినవాఁడవు.

వా—[సక్రోధంబుగ] ఓరి మోఱకా! నీ గుజ్జుతనము నొరునియెడ నెట్టు పెట్టుచున్నావు? నీవే గుజ్జవురా. తలుపు దారబందములు దాఁకు నను జంకుచే నాచే నాయందు గుజ్జుతనము గలిగించుకొనఁబడినది.

కు—ఓరీ బుద్ధిలేనివాఁడా! జేనెడంత నీ మేనిచేఁ దలుపు దారబందము లెట్లు తాఁకును! మఱి నేను గుజ్జని నీకు నెవఁడు సెప్పెను.

వా—ఓయీ! నీ వెన్నునందలి యీబొలముద్దయే.

కు—ఓరి బుద్ధిమాలినవాఁడా! ఇద్ది యెట్లు బొలముద్దరా! మఱి సొబగు సిరికిఁ దలగడదిండురా!

వా—ఓరీ! మెల్లమెల్లఁగాఁ జెప్పు. మనవంటి యంతిపురి కొలువుడుగాండ్రకు సొబగన్న మాట విన్న నొడయఁడు కనలఁగలఁడు.

కు—వెఱవ నేల? ఱేఁ డిపుడు సమాదియింట నున్నాఁడు.

వా—లేఁడు లేఁడు. ఇపు డెవఁడో యొక పెన్నిరాబారిరాక వార్చుచు మోసల నున్నాఁడు.

కు—ఇపు డెవఁడు పెను నిరాబారి? వేగుగా నుండును.

వా—సరే.

కు—అందువలన మనము చెడిలిమి. మొదటనే మనము యాజ్ఞవల్క్యుఁ డను పేరుగల

యెవఁడో యొక పెనునిరాభారిచేఁ గఱుపఁబడినవాఁ డగుచుఁ గన్నుల మూయుటచేతను దెఱచుటచేతను రేలుంబవళ్లు గడుపుచున్నాఁడు. ఇప్పు డీతనిచేతఁ గిరుఱింపఁబడినవాఁ డవుచు నంతిపురమునే విడువఁగలఁడు. పిదప దిసమొల తపసి నూలుగుడ్డలచేఁబోలె నితఁడు మనచే నేమిసేయఁగలఁడు ?

వా—వే ఉండును. వీఁడు మన రాచతపసికి విద్దె గఱప వచ్చువాఁడు గాఁడు. మఱి ముక్కంటివింటింగంటకు.

శు—[విహసించి] వేలిమిపొవచే నల్లనైన కన్నులు గలవారికి ముక్కంటివింటింగంటకు వేడ్క యెటువంటిది ? అందువలన వీఁడు రాచపాఱుఁ డని యెన్నుచున్నాను.

వా—ఎట్లు నీయొడలివలెనే నీమదియును వంకర యయ్యె ? వీఁడు నిక్కముగ రాచవాఁడె యని యెఱుఁగఁబడుచున్నాఁడు.

శు—కావునఁ దడవుగఁ దపసితనమున విసికినవాఁడై వీఁడు సూటియైన మదిగల మన రాచతపసియొక్క దొరతనమును గైకొనుటకు వచ్చుచున్నాఁ డని వీని నే నెంచుచున్నాను. అణఁగుత దోసము. ౨. ఇటువంటిది పలుకకు. ౨. ఇతఁడు తడవుగ నలరింపఁబడిన బమ్మయొక్క పలుకుచేత రాచతనముఁ బాపికొని పాఱుతనముఁ బడసినవాఁడు.

శు—ఎట్లు నీమేనివలె నీమదియుఁ బొట్టిదయ్యె ? ఎవఁడో యొకనియొక్క మాటచేత బాఁపఁడు గానివాఁడు బాఁపఁ డౌనేని, నామాటచే నీవును బాఁపఁడ వవుము.

వా—ఓరి పాలసుఁడా ! భగవానుఁ డగు నలువకును గొడ్డుమాఱిగల నీకును వేఱిమి యెట్లు లేదు ?

శు—నిక్కముగా వీఁడు బాఁపఁడే యైన నీవింటిఁగంటకై యేల పూనెను ?

వా—కలదు. ఇతనిప్రక్కల నిక్కడనే యలవఱిచికొన్నవిద్దెలఁగల యిద్దఱు రాచకొమరు లున్నారు. అందువలన వీరికిం గనఁబఱుపఁగలవాఁడ నిచ్చిచ్చుకంటివింటి నని వచ్చుచున్నాఁడు.

శు—అందువలన నెట్లు వీఁ డచ్చమైన తలఁపుగలవాఁడు.

వా—సరే.

శు—అందువలన నంతయుం జెప్పుము. వీనియందుం దబ్బఱదోసము మోపుటచే నాకు దోసఁగు గలిగినదా లేదా ?

వా—పెద్ద దోసము గలిగినది.

శు—దమ్మముతప్పు మెఱుఁగవురా. తగులము గలవారియెడఁ బరియాచకపుఁ బలుకులు దోసమునకుఁ గతములు గావుగా.

వా—[విహసించి,] ఎట్టితఁడు నీకుఁ జుట్టఱికము గలవాఁడు ?

కు—వీనికి నిరువురు కొమరులు. మనకును నిరువురు కొమిరెలు. కాఁబట్టి చుట్టఱికము గలుగఁగల దని తలఁచుచున్నాను.

వా—ఎట్లు మన కిట్టి పున్నెము ? [నేపథ్యమందు,]

మ. శరసంతాడితతాటకుండు విలసత్సద్రత్నతాటంకుఁడున్
శరదంభోజదళాయతాక్షుఁడును క్ష్మాజానొందు శ్రీరాముతోఁ
వరలీలాత్తశిఖండమండితుఁడునై భాసిల్లుసౌమిత్రితోఁ
బరమామోదుఁడు వచ్చునిచ్చటికి విశ్వామిత్రుఁ డీశం డహా.

[సహర్ష విస్మయంబుగ] ఎల్లజగములకు వెఱపుఁ గొలుపునది యెదియో యది తాటక యను రక్కసి యని వినఁబడుచున్నది గద? అద్ది యీతనిచేత బిద్దింపఁబడియెను. కావున నితనికి ముక్కంటివింటి నెక్కిడుట యెన్నఁదగియున్నది. అందువలన రమ్మా. వీనులవిం దగు వేలుపుబువ్వను దేవేరులకు విన్నవింతము.

[అని నిష్క్రమించిరి.]

ఇది ప్రవేశకము.

[అంతట రామలక్ష్మణులచే ననుగమింపఁబడినవాఁ డగుచు విశ్వామిత్రుఁడు,] వత్స రామభద్ర ! చూ.

భాస్కరనిలసిత వృత్తము.

జక్కవపులుఁగుల కూఱట గల్గన్ జానుగ నొగి సవి కపగ సుఖింపన్
జుక్కలగములను నొక్కట మెక్కన్ జుక్కలదొరఁ బరిహాసనము సేయన్
దిక్కరిగమనలు గుంకుమపూఁతన్ దేజరిలఁగఁ గలువలు బెగడొందన్
బక్కన నగఁగను బాగుగఁ దమ్ముల్ భాస్కరుఁ డిదె యుదయించెను గనుమా.

రా—[కేల్మోడ్చి]

మాలిని. వనజవనచయంబుం బాగుగా నేలువానిన్
స్వనదుపగతశోకవ్రాతముం బ్రోచువానిన్
ఘనతిమిర మఱన్ లోకత్రయిం గాచువానిన్
దినకరుని నుతింతుం దేవు వేఁగాళ్లవానిన్.

వి—[స్వగతంబుగ=తనలో] నాచేఁ గొని తేఁబడిన యీ బిడ్డని రామభద్రునిం జనకరాజు తన తనూజచే సమ్మానింపఁగలఁడా ?

ల—ఆర్యా ! చూడు. చూ.

శా. ఎందాఁకం ద్యుమణిం బ్రభాతసమయం బింపొందఁ బైకెత్తి పె
న్సంద్రంబందుననుండి నింగియనుబాజాఱందు నుంచుం జగం

బందాఁకం గొననౌను మూల్యమిడి యంచబ్జాకరం బెంచియో
యుందుర్ ఫుల్లసరోజహస్తముల శ్రీ నెంతే నిడు న్మందలన్.

వి—[సహర్షంబుగం దనలో] బిడ్డఁడైన లక్ష్మణునిచేతనే యెట్లుత్తరము దత్తమయ్యె! ముగ్ధవచనములు దేవతాధిష్ఠితములు గదా?

రా—భగవంతుఁడా! బహుమనుజశూరవారణతురంగమతరంగితయయ్యు నీరాజధాని తపోవనధాత్రివలెఁ బ్రశాంతపావనిగ నెట్లు భావింపఁబడుచున్నది?

వి—దీనిని జనకుఁడు పాలించుచున్నాఁడు. అతనికి భగవంతుఁడు యాజ్ఞవల్క్యుఁడు పరమాస్యోపనిషదుపదేష్ట.

రా—ఎవఁడు యోగీశ్వరుఁ డని కొనియాడఁబడుచున్నాఁడు?

వి—వత్సా! అతఁడే యితఁడు.

క. పొంది దినేశుప్రసాదముఁ, బొందుగ యోగీశ్వరుఁ డనుభూరిప్రథకున్
మందిర మయ్యె నెవం డ, య్యిందిర కరవిందమువలె నెంచఁదగుఁ గదా.

[నేపథ్యమందు,]

చ. చెలువుగఁ గుంకుమాంబువులచేఁ దడుపంబడుఁగాత భృంగసం
కలితసుమాళిచే నెనయుఁగాతఁ గడుం బొలు పంతకంతకున్
సలలిత హార ముత్తెములచప్పరము ల్వెలయంగ నల్వగం
బురవనితాళిచే నిపుడు ప్రోలిపె పెంపెరువు ల్పొరిం బొరిన్.

వి—తగునిది, నారాకవలన సానందుఁడైన శతానందునియొక్క వాక్పరిస్పందము. [విలోకించి] ఆహా! వీనియొక్క సంభ్రమాతిశయము, నగరాలంకారము కావింపఁబడినను, వెండియు నాజ్ఞాపించుచున్నాఁడు.

శతానందుఁడు—[ప్రవేశించి] భగవంతుఁడా! అభివాదనము సేయుచున్నాఁడను.

వి—వత్సా! అపరిమిత తపఃప్రభావుఁడ వవుము.

శ—ఓ భగవంతుఁడా! ఈ జనకరాజును భగవదాగమనమును బ్రతిపాలించుచున్నాఁడు.

వి—ఇదిగో వచ్చుచున్నాను. [అని పరిక్రమించుచున్నాఁడు.]

వి—[విలోకించి] ఈతఁడు రాజర్షి జనకుఁడు.

క. అంగుగ నా జేడెనిమిది, యంగంబుల నెవనియందు నంగీకృతమై
రంగుగఁ ద్రయిరాజ్యశ్రీ, యుం గడుకొని యోగవిద్యయును రాజిల్లున్.

[అంతట జనకుఁడు పీఠమునుండి లేచి ప్రవేశించుచున్నాఁడు.]

జనకుఁడు—[విలోకించి] ఆహా!

తే. ఎవఁడు తప మనునగ్నిలో సెసకమెసఁగఁ, దాను దనమేను బంగారుగానె యొనిచె
కనియె నొగిని వర్ణోత్కర్ష మును ఘనముగ, నతఁ డితఁడు గాధినందనుం డధికశక్తి.

[ముందఱ వచ్చి,] భగవంతుఁడా! ఇది సకలసంపల్లతాప్రరోహనూతనారామము ప్రణామము.

వి—క్షమాశునాసీర సీరధ్వజా! అప్రతిహతమనోరథుఁడవు కమ్ము. [అందఱు యథోచితముగాఁ గూర్చున్నారు.]

జ—భగవంతుఁడా! శునాసీరపదము చేత దూరముగాఁ గీడ్పఁబడితిని.

వి—ఎటువలె? హరిచందనవనకరుని శునాసీరునిఁగూడఁ గ్రిందుపఱిచి వర్తిల్లుచున్నాఁడవు.

జ—క. ఎటువంటిది యగు నాకుం, బటుసుఖహేతువు త్వదీయపదయుగనమనం
బటువంటిది గా దనిమిష,కుటమని నందనవనజము కుశికతనూజా.

వి—ఆహా! నీయొక్క హార్దోత్కర్షము! అందుచేత సహజసంతోషసముద్రమగ్నుఁడ వయ్యు నస్మత్సమాగమసంభవములనఁ గలిగిన సుఖశీకరములను బహూకరించుచున్నావు.

జ—భగవంతుఁడా! రాజ్యరాహుగ్రస్తచేతశ్చంద్రము లగు మాకు సహజానందచంద్రికోద్భేద మెక్కడిది?

వి—ఇట్లు కాదు.

శా. తాఁకుక్ జ్యానినదంబు దిగ్దశకముక్ దారంబు కంఠంబునీ
లోకంబందు వెలుంగుఁ దేజము గడుక్ లోజ్యోతియాత్మీయమే
మీకు న్వాకొను సింహపీఠినృపతక్ మీశాంతిఁ బద్మాసనం
బోకళ్యాణులు రాజు లీరు నిమివంశోత్పన్నులే యాదుకా.

శ—ఇట్లే యిది.

తే. సక్తిలేకయు సద్రాజ్యసరసునందుఁ, జారువారాంగనోద్ధూతచామరోర్మి
వెలిగొడుగుఁ దమ్మిరాజహంసులు రహింత్రు, యోగిరాజపథంబున నున్నవారు.

ల—[అపవారించి] ఆర్యా! ఈరాజులు బ్రహ్మవిద్యావినోదు లని నాకుం గౌతుకము.

రా—ఏమిందుఁ గౌతుకము?

ఉత్సాహ. గొడుగునీడ చేనిః జాటు గొలుపఁ జాల దంట దె
న్నఁడును మత్తగజమదమషి నాఁబడెడికళంకముక్
గడిమినార్పనోపకుండు గాలిచామరములద
క్కడిఁదియేఁదొ జ్యోతి దానిఁ గాంతురాత్మ నీనృపుల్.

వి—శతానందుఁడా! రాజహంసు లని సత్యముఁ జెప్పితివి. ఈ రాజహంసులు కువలయో త్తంసులే కదా.

జ—ఇది మా పూర్వులయం దొప్పుచున్నది. కొన్ని యూళ్ల కేలికయైన సీరధ్వజునియం దొప్పదు.

వి—ఆ! ఏమి చెప్పఁబడియె?

తే. అవనిపాలురు వెలయింతు రవనిఁ బలువు, రవనిపతియశమనసీకె యన్యునికెటు
లవనవనిదనహూఁతునీ యనుఁగుఁగూఁతుఁ, జేసెఁ గాకావునను నీవె చెలఁగె దధిప.

-భగవంతుఁడా! అభినవభువననిర్మాణనిపుణుఁడ వగు నీకు నస్మన్నవభాషణ భంగ నిర్మాణ నిపుణత యిది యెంతటిది? నీ వతఁడవుగదా! ఎతనికి,

మ. తనచూడ్కిం బొనరించి కోపగుణరక్తచ్ఛాయముఁ జెన్నలా
కను నాకంబనుభిత్తిప్రాయ మును వేడ్కం దేవతాచిత్ర మో
యనఁగా నాయె సుధాకరారుణుల గేయంబైనబింబంబుల
ప్లునొగిం గాంచ సుధాసులాక్షుల ద్రవంబుల్గగ్గు పెన్జిప్పలే.

—ఇట్టే యిది. అతఁడుగదా యీ భగవంతుఁడు.

చ. ఎవనిది నూతనత్రిదివసృష్టిసముద్యమసంభ్రమం బహో
యవనిఁ బడం ద్రిశంకువును నాకమునందుననుండి త్రోయ నా
కవిభుఁడు సాఁపఁ బాదమును గాంచె వికాసముఁ జాల దేవతా
ప్రవరులు గేలుమోడ్పు లిడ భక్తిఁ గనెన్ ముకుళత్వ మెంతయుఁన్.

-[అపవారించి] ఇట్టి దితనిది సంతాపితత్రిభువనంబె తపోఽభిధానంబు తేజంబు.

రా—అబ్బాయీ! నీకు దెలియదు.

చ. కనలినవేల్పుఁదేనిపదఘాతముచేత నధోగతుం, ద్రిశం
కునిఁ గని దృష్టియీతనిది కోపవిపాటలకాంతి నెంతయుఁన్
గని ముకుళీకృతోరుకరకంజవిరాజిత మాచు సంజచా
డ్పున నమరాళ్యుపాసితగఁబొల్చె మహాత్ముల క్రోధ మల్పమే.

వి—[స్వగతముగ] ఇంతతోఁ జాలు. ప్రస్తుతవిషయము విచారింతము. [ప్రకాశముగ]
రాజర్షి! వసుధాసంభవంబగు కన్యారత్నంబు నిన్ను నలంకరించుచున్నదా?

జ—తమ యనుగ్రహమువలన జామాతృరత్నమును నలంకరించును.

వి—యుక్తము.

జ—[విలోకించి] భగవంతుఁడా!

క. సకలజనలోచనోత్సవ, నికరమునకు నిరవుగ నిట నెగడునెలం డీ

సుకుమారుఁడు హారితమణి, ప్రకరము కల్పద్రుమ మన భ్రాంతిఁ గొలిపెడున్.

శ—ఇతఁ డెవఁడు ? ఇతనికే యీతఁడౌఁగదా !

ఆ. నల్లగలువరేకు నాఁడెంపు మేల్జిగి, చెంతఁ బసిఁడివన్నెఁ జెన్నుమీఱు
ఖంజరీటనయనకర్ణాగ్రమున నున్న, చంపకస్తబకముచందమునను.

వి—పేర వీరిరువురు రామలక్ష్మణులు.

జ—ఆహా ? కర్ణామృతము ! [మఱియు సకౌతుకంబుగ] భగవంతుఁడా ! ఏ మిది ?

మ. భవగాధాతిగభావలభ్యము పరబ్రహ్మంబునందు న్మహో
త్సవ మెట్లుం బెద నట్టె నీలజలజశ్యామాభిరామాకృతిన్
దవునీరామునియందుఁ బొందెద మహానందంబు నాకుం దృగు
త్సవదుం డౌచుఁ గడుంగడుం గనఁబడుం దద్బ్రహ్మమే యీతఁడో.

వి—[స్వగతముగ] ఇది యుచితము. సకలలోకలోచనానందకరుఁడు సుధాకరుఁడు కపర్దికపర్దకలిత కలానిధియొక్క పరతత్త్వ మగుఁగదా ? [ప్రకాశముగ] రాజర్షీ సౌందర్యాతిశయముయొక్క మహిమ.

శ—ఆ, మిగులరూపరులు సమిద్ధసహజసౌహృ,నులవు వీరియందె దో మదీయుం
లనెడితలఁపుఁ గొందు నలకౌస్తుభామృత, కరులయందువలెను గర మరిదిగ.

జ—[నిర్వర్ణించి]

ఆ. ప్రకృతిసుందరులు స్వభావమిత్రులునైన, యీయిరువురియోగ మో యనఁగన
దేవజీవసన్నిధివలెఁ దోఁచును నాకు, నింతకన్న వింత యేది గలదు.

వి—ఓయి యోగీశ్వరశిష్యుఁడా ! ఇటువంటి యభినవోదంత సుధావేశంతములయందు నీ మనస్సు మజ్జన మొనర్చుచున్నది. మఱి యీ యిరువురి స్వజనభావమునందు మేము సాక్షులము.

జ—ఈ యిరువురు సోదరులా ?

వి—అట్లే.

శ—వంశస్థవృత్తము. స్వవర్ణకాంతిన్ జితచంపకోత్పలుల్
సువర్ణనీలోత్పలసుందరచ్ఛవుల్
తవంగనేత్రోత్సవదానదక్షిణుల్
ప్రవీణు లీలక్ష్మణలక్ష్మణాగ్రజుల్.

జ—ఎవఁడు మఱి యీయిరువురిచేతను బుత్రవంతులలోఁ గిరీటముగాఁ దలఁపఁబడు వాఁడు ?

వి—కు. ఇది శితాంశుమరీచు లాసురనదీహారాళసద్వీచు లా
యివియుం గేదఁగిసూచు లామొచటివి వ్యిందవ్వళ్ళనద్రో చులా
యివి యేమంచుఁ గుతూహలాధికతచే బృందారకస్త్రీలచేఁ
దవఁ బాదంబను చేసికీర్తులు దిశాస్థానంబులం దాడెడున్.

రా—[జనాంతికముగ] వత్సా! యుక్తము. ఇతఁడు సకలగుణవిశదుని తండ్రినిఁగావ
లయు నొనియాడుచున్నాఁడు.

ల—ఔను. మఱి తెలుచుగఁ బొగడుదురుగాక!

వి—ఇంతేకాదు.

శా. వ్యాలోద్యద్భుజదండహింఁడితధనుర్వ్యాపార మేవానికిన్
లీలామాత్రముగా నతఁగ నసురీలీలావతీభూలితల్
పాలోమీకరజక్షతాంకితమునా వాస్తోష్పతిక్షేత్ర మా
కాలంబుదు నసృగ్విపాటలరుచిం గాంచు న్నిరిం గ్రచ్ఛఁబన్.

ఇంతియకాదు.

క. ఇనకులకిరీటకోటీ, కనదరుణోపలముకుళముగఁ దగు నతనికిన్
జనపతికి దశరథుని కీ, సనయులు తనయులు సుధాంశుసమసమవదనుల్.

జ—చ. వడిగల వేనిబాహువులు వైరిసతీతతికజ్జలంబునం
దొడరినకాళిమం బనఁగఁ దోఁచునుదాల్చి ధనుగకిణచ్ఛవిన్
గడిమిని నేని జ్యానినదకాండముచేత నిపీతమయ్యె నా
నడఁగెను నూడుచేడియలయంచితకాంచనకాంచికాధ్వనుల్.

మఱియును,

మ. చెలఁగంగా నెవ్వఁడింద్రశత్రువిజయశ్రీతోడనే యాడ్చిమా
ర్విలతన్ భూవలయంబుతోడనె ధనుర్బింబంబు దోర్దండలిన్
నలిఁ దాల్చె న్మది వేల్పుతేఁ డువిదచంటం గన్నగోర్వంక నే
లలితంబున్నవముగ్ శరాసనముఁ గెలంగాదు పోలుంగదా.

[సహర్షంబుగ] మఱియు,

ఆ. ప్రథితమిత్రవంశరత్నంబనం బొరిం, బొరిఁ బరంగునల్లభూపతికిని
దశరథునకుఁ దగినతనయు లీయిరువురు, రూపవిజితకుసుమచాపు లరయ.

వి—ఇఁక నేమి?

జ—ఆహా! దశరథునిరెండుకనులును పుత్రాలోకనశీతలములు.

శ—దిక్కులును.

వి—దిక్కులని వక్కాణింపం దగు.

జ—అ దేమి ? వే ఱిరువురు కొమరులును దశరథునియొడి నిండించుచున్నారా !

వి—ఔను. రామలక్ష్మణుల ప్రతిబింబములవలె వారిరువురు భరతశత్రుఘ్నులు గదా !

శ—తగుదురు వీరు ఋశ్యశృంగునిచరుభాగధేయములవిలాసములు.

జ—దశరథభాగధేయములయొక్కయం.

వి—ఇది యిట్లే. భాగ్యవంతులలో దశరథరాజ గ్రియుండుగదా ?

వి—ఆవిషయమందు మే మెవ్వరము వాక్రువ్వఁగలవారము ? మీమహిమవిషయమున
మీరే సాక్షులు.

జ—దశరథునియొక్క మహిమ ననుసరించుటకు వారిరాశికిఁ గాసారమువలె నే నెవఁడను!

వి—[విహసించి] రాజర్షీ ! వినయమధురులకు, అధరీకృతాత్మమహిమలు సత్యవిధుర
ములు వాక్కులు శోభిల్లుచునే యున్నవి.

శ—ఇది యిట్లే.

వి—ఆ. కనియె దశరథుండు క్ష్మాపతి యాతండు, రామచంద్రు దృగభిరాముఁరాముఁ
గంటి వీవు సీతఁ గలుపతీవియవంటి, నాతి లోకలోచనాతిరమ్య.

ల—[అపవారించి] అన్నా ! ఇందూత్పలినీదృష్టాంతము చేత భగవంతుఁ డగు విశ్వా
మిత్రునిచే నేమో సంభావింపఁబడిరి.

రా—[సప్రణయకోపంబుగ] అశీకజల్పితము చేఁ జాలు.

జ—[స్వగతంబుగ] ఈ వాక్ప్రణాళిక చే నిమి దిలీప కుల మంగళ మేమో యభిసంధించు
చున్నాఁడు. ఎట్లు? [నిశ్వసించి] సరే. సరభసవచనుండు శంకరశరాసనమును స్మరింప
కున్నాఁడు. కానీ. [ప్రకాశంబుగా] భగవంతుఁడా ! నీయొక్క యీ వక్రకమ
నీయవాగ్విలాసము చేత రెండవ ఖండపరశుకోదండమో యన నొప్పుచున్న కుతూ
హలము గలవాఁడ నగుచున్నాఁడను.

వి—[స్వ.] ఏల యీతఁడు చంద్రశేఖరచాపారోపణ ముద్భావించుచున్నాఁడు !
అవుఁగాక. [ప్ర.] రాజర్షీ ! చక్కఁగా స్మరింపింపఁబడితిని. నామనస్సు భీమ
కార్ముకాలోకనమున మిక్కిలి వేడ్కఁ గలిగియున్నది. కానఁ దదానయమునకై
నియోగుల నియోగింపుము. అటు గాకున్న నన్యులచే నేమి ? రామచంద్రుఁడే నిరూ
పింపఁబడుఁగాక.

జ—భగవానుఁడా ! ఎటుఁగ వేమి ?

మ. ఇదదే యెద్ది సురాద్రిగం బరఁగె విల్లైత్తంగ దుస్సాధ మెం
డొదవె స్నారిగఁ బన్న గేంద్రుఁ డిషువై యొప్పెం డె గోవిందుఁడుగ్

మృడుచే వంపుగ వంపఁబడ్డదియు నై యిష్వాసతత్యున్నతిన్
గదిరెం గ్రాలెఁ బురాంగనాశ్రువులవానన్ శాక్రమైశంబునై.

వి—ఎఱుఁగుదుముగదా !

మ. పరిచర్యాగతసర్వఖేచరకరప్రాంచచ్చలచ్చామరో
త్కరజాతానిలపానపీనగుణభూతవ్యాళపాకర్షిచేఁ
బరమాకర్షణజృంభమాణతుహినప్రాలాప్తిచే దేవనీ
శ్వరుచేత న్వ్రీడువంబడెన్ శ్రమమదే శై లేశసారం బిదా.

జ—ఇట్టుండ నెట్లు ముగ్ధుఁడువోలె దుగ్ధముఖుని రామభద్రుని భీమబాణాసనానయనమునకు న్నిరూపించుచున్నావు ?

వి—కేవల మానయనమునకే కాదు; ఆనమనమునకును. [రాము నుద్దేశించి] వత్సా! సిద్ధపదుము. ఇదియును,

క. మారీచమారిచతురము, క్రూరసుబాహునికి దుష్టఘోట్టాణంబున్
ఘోరము తాటకకుం గొ, ట్టారా విలు లక్ష్మణకరమం దునుపుము మున్.

జ—భగవానుఁడా ! ఇ దేమి, అచుంబిత మనువర్ణించుచున్నావు ?

వి—ఎట్టిది మీ కవిదితము ? ఎందువలన ననఁగా, సీతని చేత.

క. పొంది ధనుర్నిగమము లొగి, మ్రందించి నిశాచరుల శరంబులచేతన్
బొందుగ మఖరక్షయె స్వాకుం దగఁ గావించినాఁడు గురుదక్షిణగాన్.

జ—[సహర్షంబుగ] ఎట్లు వీఁడు వీరావతారుండు కుమారుండు ? [విమర్శించి, మఱి నిట్టూర్పు వుచ్చి], భగవానుఁడా !

క. మారీచాదినిశాచర, వారశిరోమణిమరీచిభాసితపదుఁడున్
మారారిగిరివిచాలన, సారబలుఁడు వీరుఁ డిట నశక్తుం డయ్యెన్.

వి—ఆ ! ఇంతతో నేమి? ఓయీ! అందువల్లనే రామచంద్రుని న్నిరూపించుచున్నాను.

జ—[తనలో,]

మ. సుతకక్ష్మీయపుని స్తమిస్రభువనస్తుత్యంబు ప్రఖ్యాతమే
కృతికాకౌశికుఁ డీమునీశ్వరుఁడు దా నెట్టా ముథోత్కంఠుఁ డ
ప్రతిమం బీశధను స్సనం గమానమా రాముండు బాలుం డెటో
మతి నా డీయెడ నూఁగులాడెడును బల్మా లోలి డోలాగతిన్.

[వసుధ నభిలషించి,] ఓ దేవీ !

ఉ. సుందరి పుష్పబాణసతిచొప్పున నొప్పు జనాళిలోచనా
నందిని నీదునందిని ఘనంబుగ నాఁ గద పుష్పబాణరా

ట్సుందరుఁ డీకుమారుఁడు గడున్సుకుమారుఁడు వీని చేతనిన్
బొందుగఁ బొందెనీధనువు పుష్పమయంబుగ నున్నఁ జెన్నుగన్.

శ—[ప్రణయకోపముతో] రాజా! ఇది యే మని, కర్తవ్యతామూఢుఁడువోలె మాటి మాటికి నాలోచించుచున్నాఁడవు? మునివచనము ననువర్తింపుమయ్యా!

జ—ఇదె యనువర్తించితిని. వత్స! రామభద్ర! గుర్వాజ్ఞ యనుష్ఠింపఁబడుఁగాత.

రా—[పరికరమును బంధించుచున్నాఁడు.]

ప్రతీహారి [ప్రవేశించి] ఒడయఁడీలు విన్నవింపఁబడుచున్నాఁడు. హుంకారము మొగదలఁ బబుపుఁ జూడ వేఁడి యోఁడో యొక పాటుఁ దున్నాఁడు. అందువలనం బ్రవేశపెట్టఁ బడవలసినవాఁడా?

జ—ప్రవేశపెట్టఁబడుఁగాక.

ప్రతీ—[బయలువెడలి బాడబునితోడఁ బ్రవేశించుచున్నాఁడు.]

జ—బ్రాహ్మణుఁడా! ప్రణామ మొనర్చుచున్నాను.

బ్రా—రాజర్షి! సుమతివి గమ్ము.

జ—[స్వ] ఈ యాశీర్వచనవిధ మన్యాదృశముగా నున్న దేమి? కాని. [ప్ర] మహర్షి! ఇందుఁ గూర్చుండవచ్చును.

బ్రా—ఆసన మేల? నేను సందేశహరుఁడనుగదా. కాన వినుము.

శా. క్షత్రస్త్రీకులకజ్జలోరువిషముం జాలంగమున్ గ్రోలి తా
నీత్రైలోక్యముఁ జేసి తెల్లఁగను గీర్తిధ్ఘాట్టహాసద్యుతిన్
గోత్రేశ్వాసునిఁ గొల్చు సిద్ధు డిది నిక్కున్ స్వామ్యధర్మాప్తి నో
ధాత్రీంద్రా భృగురాముఁగొల్లి యదే తాఁ జెల్వు నీ కిక్రియన్.

జ—[స్వ] ఆహా! గర్వాంకురముయొక్క వక్రత! కానీ, విందును. [ప్ర] ఏ మది?

బ్రా—సీ. ఇమ్ము నీకన్నియ నెవ్వనికేనియు నరపతిసుతునకుఁ బోరయము మాయము
వును శివధర్మంబు పొడవార్ప బల్కిన యఘమువలన నస్మదప్రియంబు
వలనను విరమింపు వదలవే నీకొండు పంకసంశ్లేశనోపాయసరణి
గల దది మామకవిలసితధారాంబుపూరావగాహం బుదారముగను
(వీరశైవధర్మంబును వినవ దేమొ, కనినఁ దెలిసెదుగాక నాపనిని నీవు
పదపడి విచారపడినను ఫలము గలదె, సావధానుఁడవై చూడు జనకరాజ.)

జ—అందువలనం దానికి నేను, నీముఖమునఁ బ్రతిసందేశించుచున్నాను.

మ. భృగురామాయంధమైన యోపరశువా యీ వోట నామిత్రమి
ప్పగిదిం జెప్పెద నిప్డు డేఁడు హరచాపం బెక్కుడు న్వానికిన్

దగ నాకన్నియ నిత్తు ని శ్చితిన పంతం బారఁగా నంత నో
ప్పగునాయల్లునిముందఱ న్విడువఁగా నా నీదుధారాంబువున్.

బ్రా—అవుఁగాక. [అని నిష్క్రాంతుఁ డయ్యెను.]

జ—[జనాంతికముగ] అంతవఱకు జామదగ్న్యునిచేత నిజకోపాగ్నియొక్క విస్ఫులింగము వేయఁబడినది.

శ—ఇంతమాత్రాన నేమిభయము? గంభీరభుజసారశ్రీరవారాముఁడు గదా, రాముఁడు.

వి—ఓయీ ! వీ రేరు మణిమండితమకుటులు వేనవే లగపడుచున్నారు ?

జ—ఆ. భవధనుర్నిరస్తబాహుగర్వులు సర్వ, భూమిపతులు వీరు పొలుతురుగద
కొనుచు నాదుపూజఁ గొన్నాళ్లుగా నున్న, వార లిచటఁ గుశికభవమునీంద్ర.

వి—వత్స ! రామా ! వీరి యెదుఁరనే యీ చంద్రశేఖరుని విల్లెక్కిడుటచేత మము సంతోషింపింపుము.

రా—వల్లె [యని, పరిక్రమించి, నిష్క్రాంతుఁ డయ్యెను.]

జ—అంగిరసా ! అపరిశీలితసన్నివేశుఁ డగు రామునికి నీచేత సన్నిహితము గలుఁగుఁగాత. తమ్మిపూదండతోడఁ గూడిన కేలుదామర గల సీతయొక్క స్వయంవరాంగణావతరణమునకుఁ గంచుకి పంపఁబడుఁగాత.

శ—అట్లే. [యని నిష్క్రాంతుఁ డయ్యె ]

కంచుకి—[ప్రవేశించి] ఈనియోగానతి నెఱవేర్పఁబడినది.

వి—రామచంద్రుని యశోవైజయంతీధ్వజదండము హరకోదండ మెట్లు లేదినది ? [వెండియుం సకౌతుకంబుగ,] వత్స లక్ష్మణ ! చూడుచూడు.

క. శిశు వవు రామునిచేతన్, శశిధరధను వాటగా నెసఁగ వంపఁబడెన్
దశదిశల నెందుదవ్వగఁ, బ్రసరించెఁ దదీయగుణమురవ మబ్రముగాన్.

ల—ఇది యిట్లే. ఇప్పుడు గదా ?

శా. ఆయెం బూర్ణము లేదిశల్ శివధనుర్వ్యాజాచలచ్ఛన్నదుర్
ఘ్రేయానేకగుహాగభీరకుహరస్ఫీతప్రతిధ్వానముల్
స్ఫాయజ్జ్యాయితసర్వరాజముఖసంసర్పద్వచోరాజిసం
ధేయారోర్యయుశగప్రశస్తులుఁ బ్రవర్తిల్లంగ మౌర్వీధ్వనుల్.

జ—ఇది యేమి చెప్పచున్నావు ? దిశలు పూర్ణము లని, వీనిచేఁ గదా !

అమృతవాహిని. శ్రీరామాస్ఫాలితేశానో, దారధర్మగుణధ్వనుల్
గూరంగఁ బంతము న్నామ, నోరథం బయ్యెఁ బూర్ణమున్.

ప్రతీహారి—[ప్రవేశించి, కంచుకి నుద్దేశించి,] ఇపుడు చూడు వేడుక, సీతారాములచే వెండియుం ముక్కంటివిల్లెక్కువెట్టుట తుదముట్టింపఁబడుచున్నది.

కం—[సకౌతుకంబుగ, ఎట్లో విలోకించి విమర్శించి విహసించియు,] ఓరీ! తెలిసెను. ఇం దిదిగదా!

మాలిని. కరకిసలయలీలం గాంచుముక్కంటివిల్లా
యుఱక యాకర్షంబుఁ గావింప వంపక్
సరభసరసయుక్తిం జాలఁగాఁ గ్రాలుసీతా
తరుణికుపలయాంచద్దామదృష్టుల్నిగిడ్చెన్.

స—[ససంభ్రమంబుగ] భగవంతుఁడా! అత్యాహిత మత్యాహితము. ఇది గదా!

మ. హరి నిద్రం దొలఁగించి సర్వనృపశౌర్యావార్యగర్వంబు ని
ద్దురఁ బొందించి దిశేభకర్ణములపొత్తుం ద్రుంచి తామేటిమే
టిరహి న్నొంచి యుగాంతకాలఘనకోటీగర్జ నిర్జించి సం
భరితంబయ్యె వికర్షితేశ్వరధనుర్భంగోద్భవధ్వానమే.

ప్రతీహారి—ఇపుడు కడు నబ్బుర మబ్బురము.

ఉ. కొండగవిం గడున్నిదురఁ గూరియు మేల్కని యుల్కి సింగముల్
మెండుగ మ్రోయ మార్సెలఁగ మిక్కిలి త్రొక్కని మఁజ్జగంబుల
న్నిండియుం బమ్మగ్రుడ్డవియ నిగ్గఱ ముమ్మొనవాలుదాల్పువి
ల్దుండులు గాఁగఁ బుట్టి యిది తోఁచును బిట్టులివట్టె సెట్టనన్.

శ—రాజర్షి! తలరుదువో? అలరుదువో? ఇది చూచిన ట్లుపవర్ణించెద.

మ. కను మాకర్ణము గాఁగ జ్యాలతను లాఁగన్ వ్రేల్చి గుభ్లారయం
గనుభ్రూభంగము లేదు రామునికి భగ్నంబయ్యె నీశానువిల్
ఘనకంఠధ్వని లే దహంకృతిజహుంకారంబు జీర్యద్ధను
ర్గుణటంకారము తద్విభంగరవ మొకొ్కం డెల్లెడ న్నిండెడున్.

జ—ఎట్టు లింతవట్టు మేరమీఱి వోవుచు నీవత్సుఁడు నివారింపఁబడ కున్నాఁడు!

శ— ఎట్లు వారింతుము

మ. తనరం గంతుకలాంఛితంబుగమ హైదై వారఁ గెందమ్మిగా
మను కౌసల్య యొసంగుమంగళసరంబుం గల్గునీబిడ్డకే
ల్మానయం గొంచె మదంతలోనె విదళద్భూతేశచాపోచ్చల
త్స్వనవారాశి మునింగె వింతగ నహో త్రైలోక్యమైక్యంబు గన్.

శం—చూడుచూడు. వేడుక.

శా. క్రీడాభగ్నగిరీశచాపవలయుఁ క్షిత్యాత్మజాతార్పిత
శ్రీలీలాంబుజమాలికాప్తహృదయుఁ శృంగారవీరాంచితుఁ
వ్రీడావాంచితవక్త్రు రామునిని మున్వీక్షించు రాజాళికిఁ
జాడం గ్రోధవిషాదవిస్మయసుతుష్టుల్గుంచు నూర్మ్ము ల్మడిన్.

జ—ఈ భగవంతుఁడు, జానకీరామభద్రుల పాణిసంఘటనమునకు నభ్యర్థింపఁబడవలయును.

శ—ఏ మని ?

క. ఇపుడే వేర్పడినది యౌ, విపులారథ ధనువునను సువిదితము గాఁగన్
నృప కూర్పంబడియెఁ గదా, విపులాపుత్రికిని రామవిభునికిఁ గరముల్.

కావునఁ గేవల మూర్మికాలక్షణములకుఁ బాణిగ్రహణార్థ మభ్యర్థనీయుఁడు.

వి—[నవ్వి] ఇదియుం గానీ.

క. జనకునితనయలఁ గైకొను, ననుజులతోఁ గూడ రాముఁ డనువొందఁగన్
మునుసీతాకల్యాణంబును గావించుకొనుఁగాత ముదము దలిర్పన్.

జ—[సహర్షంబుగ] భగవంతుఁ డెట్లు మాండవీశ్రుతకీర్తులతోడఁ గూడ భరతశత్రుఘ్నులను సంబంధ మభిసంధించుచు నిమిత్తమాంగల్య మభిసూచించుచున్నాఁడు. అందువలన భవదాజ్ఞాప్రసూన మిది తాల్పఁబడుచున్నది. కావునఁ గోరిక నెఱవేర్చుకొనుచున్నాము. [అని యందఱు నిష్క్రమించుచున్నారు.]

ఇది తృతీయాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## చతుర్థాంకము.

[తెరలో, పరశురామునిప్రవేశికి పాడఁబడుచున్నది.]

క. మణిమయమంగళదీపము, జనకనృపునిమండపమున జ్వలియించు లలిన్
  జనుదెంచెం జండానిల,మును విఫలాగమముగ నగు మొగి నెట నటకున్.

[మఱియుఁ దెరలో] ఓరీ! క్షత్రియులారా! చూపుఁడు కందక తొలఁగి పొండు. ఇం దితఁడు గదా!

సీ. భానుభానుసటావిపాటలంబగుదృష్టిపాతంబునం బరశ్వధమిపుడును
  క్షత్రకంఠచ్యుతక్షతజసరిత్స్రక్తధారంబుదారంబుగా రచించు
  చలితీవ్రనిశ్శ్వసనాభీలమారుతోద్ధతి చేత వెండియుం క్షితికి క్షతిని
  సూచించుచున్ మార్వ్వి నేది మ్రోయించుచు శార్ఙ్గి యితండె నాశార్ఙ్గహస్తుఁ
  డగుచు ముజ్జగముల గెల్చి పొగడు గనిన, యల్ల జగదేకశూరుండు బల్లిదుండు
  రుద్రశిష్యుండు మాఱటరుద్రుఁడనఁగ, జామదగ్న్యుండువచ్చునిచ్చటికిఁ గనుఁడు.

[అంత, జామదగ్న్యుఁడు ప్రవేశించుచున్నాఁడు. జా. ససంరంభంబుగ.] ఆహా! సీరధ్వజునియొక్క ధృష్టత్వము. అందువల్ల నీతఁడు ముక్కంటివిల్లెక్కిడువానికి గన్యాదానము సేయఁ బూనినాఁడు. [సక్రోధంబుగ పరశువు నెత్తికొని],

క. మహిపతితతిగళపాళీ, బహుళగళద్రుధిరధౌతబహుధార మిదే
  యహిభూషణశిష్యునియది, మహితముపరశువజనకము మహిని నొనర్చున్.

[విమర్శించి, కసికరముతో]

క. కలిగితి వర్జునభుజవని, వెలిఁగితి వుత్తుంగభూమిభృద్వంశములన్
  లలినిమిశులకలమపలా, లలవము నీవంటెదె మరలన్ రోషాగ్ని.

[ఆలోచించి,] అటుండనిమ్ము. కోరఁబడిన యల్లునిచేతి బలిమి గరువమువలన నడరు వీనియొక్క యేడ్తెఱచేతఁ జాలు. వీనిచే సందేశింపఁబడియేఁగదా నాగంత్ర గొడ్డలికి.

'మ. భృగురామాయుధమైనయోపరశువా! యీ వౌట నామిత్రమి
  వ్వగిదిం జెప్పెద నిప్పు డేఁడు హరచాపం బెక్కిడు న్వానికిన్

దగ సాకన్నియ నిత్తు ని త్తఱిన పంతం బారఁగా నంత నో
ప్పుగునాయెల్లునిముందఱ న్విడువఁగా నా నీదుధారాంబువున్."

[అని యీ పద్యముఁ జదివి,]

అహా! వీనిధార్ష్ట్యము! ఏమిచెప్పెను? "విడువఁగానానీదుధారాంబువున్" అని.

మహాస్రగ్ధర. తనరంగన్ దేనిధారన్ దళితపరిపత ద్బాహుశాఖాసహస్రం
బున మద్యద్రక్తధారల్ పొలిచె జితనవాంభోజమిత్రాంశుజాలం
బనఁగం దత్కార్తవీర్యం డమరపురసుదృగ్ఘర్ష దాపుష్పితాశో
కనగంబయ్యెన్ స్వపౌరాంగనల కధికశోకప్రదాశోకమయ్యెన్.

మఱియును.

శా. రేవావాహినిఁ గట్టఁ గట్టువఱిచెన్ రేకెత్తునారావణున్
దేవారాతి నడెద్దియర్జునభుజానీకం బెట స్మున్గరా
ద్దేవీద్బృగ్జలపూర మ స్నెపమునం దీపించు నెద్దానిక్రీ
డావారం బదె యిద్ది నాపరశు వీడన్విడ్చు ధారాంబువున్.

[విలోకించి] ఎట్లు వీఁడు శతానందశిష్యుఁడు తాండ్యాయనుఁ డిచ్చటనే వచ్చి యున్నాఁడు?

తాండ్యాయనుఁడు [ప్రవేశించి] భగవంతుఁడా! అభివాదనము సేయుచున్నాఁడను.

జామ—అయుష్మంతుఁడ వపుము. నీ యుపాధ్యాయుని యజమానునియొక్క త్ర్యక్ష చాపారోపణశ్రద్ధ యెట్లంతవఱకు వదలెను?

తాం—భగవంతుఁడా! ముక్కంటివి ల్లెక్కిడుటతోడనే వదలినది.

జా—ఆ! ముక్కంటివి ల్లెక్కిడుటతోడనే వదలిన దనియా?

తాం—పిమ్మట నేమి?

జా—ఏమి జరిగినది? అంతయుం దెల్లముగం దెలుపుము.

తాం—క. ఎవనికో భగ్నంబయ్యెన్, శివధనువుస్వబాహుదండసిద్ధబలమునన్
శివశిష్యపరశురామా, యవలీలన్ హ స్తికిశువనఁగా నహాహా.

జా—ఎవనికి?

తాం—క. గాధిసుతయజ్ఞఘాతకు, లాదైత్యులుతాటకేయు లై రేనికిహ
స్తాధీనులు,

జా—చాలుఁజాలు. ఎఱుఁగఁబడినాఁడుగదా, దుర్జనాగ్రణి దోషాచరగ్రామణి.

తాం—[తనలో] రావణునిచేత విల్లు విఱిగె నని యీ భగవంతునిచే నెట్లెఱుఁగఁబడియె? అంతవఱకు నిజె కానీ!

జా——[సక్రోధంబుగ, గొడ్డలి చెత్తుకొని,] ఇది యిది,

ఆ. రాజపుత్రకంధరానాళదళనక,లాపకలము నావిగా కఠార
మింకఁ బక్తిముఖుని మిక్కిలిచిక్కని, కుత్తుకలను దవిలి కోయుఁగాక.

[విమర్శించి] అట్లేని,

ఉ. కొండలకొమ్ములం జిదిమి గొప్పతనంబును గాంచి మించునా
ఖండలువాలు సిగ్గినయఁగం గడుసర్జునబాహుశాఖలన్
జెండి పరేతరాజపురిఁ జేరఁగ వాకిలియైన దిద్దినా
చండపరశ్వధంబునకు శ్లాఘయె రావణకంఠఖండనన్.

[మఱియు విచారించి,] అట్లయినను మహాపరాధముగల మానవాదునియెడ నుదాసీన భావముఁ జెందుట యయుక్తము. అందువల్ల నిప్పుడు,

తే. దక్షిణాంభోధిమధ్యమస్థానమునను, గొంకణము నెన్మిదవదానిఁ గొఱలఁ జేసి
లంక కాతంకముచు మిగులంగఁ జేయు, నస్మదంబకభూతాగ్ని యడరుఁగాక.

[అని, పరిక్రమించుచున్నాఁడు.]

తాం——ఇప్పుడు క్షత్రియకులమునకు క్షేమము. [నేపథ్యమందు] నియోగులారా! వివాహమంగళమున నెసంగు జానకీరామచంద్రులకు స్వస్తివాచనికులగు బ్రాహ్మణులఁ బిలువుఁడు.

జా——ఓరి బ్రహ్మబంధూ! ఎట్లు దబ్బఱగా, దశకంఠకీర్తనుఁడవైన నీచే నేను మోసపోతిని? జనకునల్లుఁడు వేఱెవ్వఁడో కాఁబోలు.

తాం——భగవంతుఁడా! నాదుతప్పేది? నేను సగము చెప్పఁగానేకదా, మీరు భ్రాంతులుగ నైతిరి?

జా——అది యంతయుం దెలుపుము.

తాం——క. గాధిసుత యజ్ఞఘాతకు,లాదైత్యులు తాటకేయులై రేనికి హ
స్తాధీనులు తేజోలవ,బాధితులై పరిభవంబుఁ బడసి రరిదిగాన్.

జా——ఓయీ! తాటకేయదమనుఁడు వీఁ డెవఁడు?

తాం——క. మునుఋశ్యశృంగచరువున, జనియించినదశరథసుతసముదయమున నీ
యన పెద్దవాఁడు రామా,ఖ్యానుతుఁడు గాధేయశిష్యుఁ డసదృగ్బలుఁడా.

జా——చ. ఎది విధివోలె వక్రత వహింపఁ ద్రిలోకవసజ్జనాళికిన్
మదమఱఁ జూడఁగూడనిది మానెను బూస్త్రయికాలికూలి యా
యది శివధర్మమాదశరథాత్మజుచేతను భగ్నమయ్యెనే!

శతా—[భయకౌతుకములతోఁ దనలో] ఇతఁ డేమి చెప్పునో ?

జ— ని దలఁపు శస్త్రధారను మునింగెను రాఘవవంశ మంచవా.

శతా—ఈ భగవంతుఁడు సంరంభించినాఁడు. కావున నీవృత్తాంతమును గురువునకు విన్న వింతును. [అని నిష్క్రమించెను.]

జ—[విలోకించి] అభినవవివాహమంగళ వేషమ్మువలనం దమ్మునితోడఁ గూడుకొని యున్న రఘురాముఁడు వీఁడే యని యూహించుచున్నాను.

[అంతట, రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.]

లక్ష్మణుఁడు—[చూచి, తనలో,]

మ. విలునారిన్మయియిద్ది మౌంజిని సదాత్తిం దాల్చుఁ దీక్ష్ణాగ్రముల్
విలసిల్లున్ ములుకుల్ గుశల్ గరమునన్ విద్యోతధారంబుసూ
జ్వలమౌ గొడ్డలియుం గమండలువు నిచ్చ స్వీరశాంతంబు లె
ట్లెలమిం గూడెను జూడ నీట్టులొకఁ డున్నే యబ్ర మెందేనియున్.

ల—అన్నా! ఇదియేమి? ముందఱ, బ్రహ్మక్షత్రవర్ణమయమయినది (రూపము) చిత్రము వలెఁ జూడఁబడుచున్నది ?

రా—తమ్ముఁడా ! భగవంతుఁడైన భార్గవునిని నీ వెట్టెఱుఁగకున్నావు ? ఇతఁడు గదా!

కవిరాజవిరాజితవృత్తము.

ఎవనికి భేద్యము క్రౌంచమహీధర - మెవ్వని కేయిలదేయము మం
స్నెవనికి నూతనభూస్థలిఁ గైకొన - నెంతయు సద్ధివిధేయుఁడు దా
నెవనికి జేయుఁడు తారకజేతయు - నే నిదియా పెనుగొడ్డలికిన్
సువిదితహైహయబాహువనం బనిఁ - జూడఁగ ఛేద్యమునయ్యె నవా.

ల—ఐన నీతఁ డచ్చెరువందం దగిన సచ్చరిత్రుఁడు.

రా—విస్మయనీయశీలురకు శిఖామణి యని చెప్పనొప్పు. ఇతఁడుగదా !

ఉ. బంగరుకొండయొండె గలపంటవలంతిని దీని హైమవా
శృంగ మొకండె యుండు పసిచెల్వునఁ గశ్యపమౌని కిచ్చె దా
నాంగముగం గిరీశతనయాధికశక్తియుఁ దూఁటువేయలే
మిం గని కొంచగుబ్బలిని మించి సురంధ్రముఁ జేసె ముల్కిచేన్.

జ—[విలోకించి,] వీఁడర్థముగ్ధుఁడుగదా ? ఎందువలన ననన్ వీనిఁ గామ యని చెప్పుట యందు రాముఁ డని పలుకుచున్నాఁడు. [విమర్శించి] మఱియొకతెఱఁగున నేనే

మూఢుఁడను. ఎట్లన, క్రిందుపఱుపఁబడిన కామసౌందర్యసంపదఁగలవానిన్, [illegible] సమీకరణమువలనఁ గ్రిందుపఱుపఁ గోరుచున్నాను. సవరించి

ఉ. చక్కదనంబు మిక్కిలిగఁ జాటునుగా మునికన్నమిన్నయం
చెక్కువయైనకైబలిమి యీశ్వరు శ్రీశ్వరుఁ జేయఁ గ్రిందుగన్
మిక్కిలికంటిమాళిశశిమేలిమిఁ గాంచును మార్ధ్య మన్న నీ
చక్కనిమూర్తి యెట్టులు రసత్రయనిర్మితమయ్యె నియ్యెడన్.

రా—[సమీపించి] భగవానుఁడా! సానుజుఁడనైన నా నమస్కార మిదిగో, పరమోన్నతిరమణీయపరిణామము.

జా—వత్సా! కలహవిజయివి కమ్ము.

రా—భృగుకులశిరశ్శిఖండుండా! అనుగృహీతుఁడ నైతిని.

జా—[విమర్శించి స్వగతంబుగ,]

శా. ఏలాసద్వినయాప్తుఁడున్ శిశువునౌ నీరాముఁడం దీరసం, బు
[స్మరించి, సక్రోధంబుగ]
ఔలే శూలిశరాస మించుగడగాహా వీఁడె ఖండించెఁ గా
[విచారించి, సకరుణంబుగ]
బాలారత్నము సీత నాశరమునన్ వైధవ్యముం బొందరా, దు
[మఱియుం సదర్పంబుగ]
ఏలాశాంతమవుం బరశ్వధము నాదీ రేణుకావైరియున్.

[ప్రకాశంబుగ]
ఓయి దాశరథీ! నీయెడ నాది యీయాశీర్వాదసరణి, సదాచారానుసారిణి, వాగ్వృత్తియే చుమీ.

రా—[చిఱునవ్వునవ్వి] భగవంతుఁడా! చిత్తవృత్తి యన నెటువంటిది?

క. ముక్కంటివింటి విఱుచుట, మిక్కుటమగుగర్వముఁ గని మెఱసెదుఁ గడు నీ
యొక్కభుజంబులు వీనియు,నృక్కనఁ బరశువున నేను దృత్తియొనర్తున్.

రా—నీ నిగ్రహానుగ్రహములకు స్వజనుఁడు వీఁడు. కోపకారణ మెఱుఁగఁ గోరుచున్నాఁడ.

జా—ఆహా! గర్వాంధకారము. నీవు చేసినదియుం నేను జెప్పినదియు దుర్వినయమున జ్ఞప్తిఁ గనకున్నావుగా! వినరా!

క. ఎది యిపుడను త్రిపురాసుర,సుదతీవిరహవ్రతంబుఁ జొప్పుడఁ జెప్పన్

విదితముగా నున్నది యది, విదితము శివధర్మమయ్యె విదితము నీచేన్.

రా—భగవంతుఁడా! అలీకలోకవార్తచేత నిరపరాధుఁడనైన నాయం దిట్లేల యెన్ను చున్నావు?

జా—ఐన నీశాసనశరాసనమునకు యథాస్థితియా?

రా—కాదుకాదు.

జా—ఐన నీ వెట్లు నిరపరాధుఁడవు?

రా—క. తాఁకంబడియెనో నాచేఁ, దాఁకంబడలేదొ శివునిధనువు తనంతన్
బ్రేఁకలువిఱిగె మహాత్మా, శ్రీకంఠసుశిష్య యేమిసేయుదు నెఱుఁగన్.

జా—చందనదిగ్ధముఖంబగు శిలీముఖంబును నాటి నాయుల్లమును జల్లఁజేయుచున్నావు.

[కుఠారమెత్తికొని]

ఆ. ఓరిరామ కామవైరికార్ముకమర్మ,ఘాతజాతపాతకా కఠోర
ధారమీకుఠారమార సీతాకర,గ్రహణ మఱఁగ నీదు గళముఁ ద్రెంచు.

కావున నీవు వీరుఁడ వవుము.

రా—ఉ. ఘోరమొ నీకుఠారమొ మనోమహ యుండెడుమాకు గుత్తుకన్
సారులకన్నుల న్నెగడు నల్వ్వగఁ గజ్జలమో జలంబొ చె
ల్వారఁగ వేసుఖంబొ పితృభర్తముఖంబొకొ కందుమేదొకొ
నీరసయందు విప్రతతి నెప్డుఁ బ్రవీరుల మేము గామయా.

జా—ఆ! నన్ను నమస్కారమునకర్హుఁడైన బ్రాహ్మణసామాన్యునిఁగా నెన్నుచున్నావుగా?

[సాక్షేపంబుగ]

చ. ఎఱుఁగుదె జామదగ్నిగుహుఁ డేపునఁ జేసి నియుద్ధమూని నా
నెఱకయిబల్మిఁ బోకడఁపనేరక క్రోధముతోడఁ జూచె ను
క్కఱియును గాలకంధరకరాంచితకాంచనగర్భమస్తకం
బుఱు నని యాస్యవైఖరినొహో కనెదే బలమున్మదీయమున్.

[ససంరంభంబుగ] ఏమిచెప్పితేమిచెప్పితివిరా! "రసయందు విప్రతతి నెప్డుఁ బ్రవీరుల మేము గామయా" యని; ఎట్లు రాచకొలపు గరువమున నేలవేలుపు వంగడమును గఱకపరకవలెఁ దలఁచుచున్నావు? అందువలన నిపుడు మనయొక్క వర్ణములలో నేది గొప్పదో దానిని గలహాతులయే నిర్ణయింపఁ గలదు. కాఁబట్టి కలనికిం గట్టాయి తమ్ముఁగఁ గమ్ము.

రా—శా. నీతోఁబోటనుమాట యంటయుఁను జన్నే మాకు విప్రోత్తమా,

ఖ్యాతుల్మీరలు సద్బలాఢ్యులరు మే. మాచుందుమద్యమ్ము లే
ల—సత్యమే యిది.

నీతం జేకగుణంబు మాకు విలుపూన్కిన్ జేందక్కు స్మీకనన్
ఖ్యాతంబౌ నవమాగుణంబు బలమై యజ్ఞోపవీతం బిలన్.

రా—అబ్బాయీ! మాననీయుఁడైన మునియెడ దుర్వినయమై దర్పము దగదు.

జా—వీని కేమిదోషము?

రా—భగవంతుఁడా! ఇపు డీశ్రీరకంఠునియెడఁ గఠినమయిన కోపముఁ గావింపఁదగదు.

జా—ఎట్లు వీఁడు శ్రీరకంఠుఁడు? విషకంఠుఁడుగదా వీఁడు.

ల—విషకంఠశిష్యుఁడా! అట్లయినన్, మిక్కిలి క్షమింపవలయును.

జా—ఆ! విషకంఠనామసామ్యమువలన భగవంతుఁడయిన శ్రీకంఠునివలె నీవును గురువా
నాకు?

ల—[విహసించి] ఎట్లన్యథాజ్ఞానము నిన్ను వ్యథపెట్టుచున్నది? నావిన్నపము వేఁగా నే
చుమీ. అ దెట్లన్నన్

క. చూడాగ్ర మెక్కినేనియు, బాలప్రాలేయపదుఁడు భవునిమనమునన్
గ్రాలు నె కోపం బెపు డే, నేలాగున నేని లీలకైనయుం గాదే.

అందుచేతం దదంతేవాసి యగు నీవును నాయెడ క్షమింపఁదగుదు వని.

జా—[స్వ.] ఆహా! ఈరాచకుఱ్ఱనిమాటనేర్పు! కానీ. [ప్ర.] నాయోర్పును.

రా—[స్వ.] జామదగ్న్యుండును క్షత్రియజాతియందు క్షేమముఁ గనుచున్నాఁ డని
నాకుఁ గౌతుకమును.

జా—ప్రకృతికఠోరమైన యీనాకుఠారమైనన్ క్షమింపదు.

తే. తనదుధారను క్షత్రవధం బొనర్చి, నెత్తురెమ్మలు నెఱులెందు నెరయరెంట
నేయది త్రివర్ణ యంతను గాఁ బృథివిఁ జేసె, నట్టి యీగొడ్డలివిశిల మెట్టెఱుఁగవు.

[వెండియు ససంరంభంబుగ] ఇంతేకాదు. ఎట్లీజామదగ్న్యునిగండ్రగొడ్డలి బాలుఁ డని
తలఁచును?

మ. తొడరన్సంగరమందు దేనిదియ యీదుర్వారధారాహతిన్
గడునీరేణుకయయ్యె క్షత్రశిశురక్తవ్యాప్తిచే ధాత్రి య
క్కడఁ దద్బాలకుల న్వరించు సుమనఃకన్యాళిలీలాంబుజో
జ్జ్వలదామంబులదౌపరాగమున నాస్వర్గంబు రేణూత్కమున్.

ల—నీకుఠారధారచే ధారణి నీరేణుక యయ్యెనన్నందున నిందాఁక సత్యము.

జా—[తనలో] వీఁడు రేణుకావృత్తాంతముచేత నేతీరున మదిఁ దాఁక నాడుచున్నాఁడు? [ప్రకాశముగా,] ఓరీ! నిరపరాధుఁడవైన, నీవిషయమునఁ దాలిమి చాలును. కటువులైన మాట లాడిన నీకంఠము గండ్రగొడ్డటి వ్రేటుచేతఁ దెగఁగొట్టఁబడును.

[తెరలో] జామదగ్న్య! జామదగ్న్య! ఏల ప్రేలుచున్నావు? అందువల్ల నిన్నుం దండింప విల్లందుకొనుచున్నాఁడను.

జా—[స్వ.] ఆ! అల్లునియెడఁ బొడమిన యుర్మిళివల్ల వెలువడినవాఁడు వీఁడు. ఆలోచింపనేల? [బిగ్గరగా] ఓయి! యోగీశ్వరశిష్యుఁడా! నీకు శరాసన మేల? పద్మాసన మవలంబింపుము. [మఱియు సోపహాసముగా.]

శా. ఓరుద్రాక్షసరోజ్జ్వలద్గళులుగండో శ్రోత్రియక్షత్రియుల్
ఘోరాజిం బొనరింప శక్తి యెది మీకుం గోర్కి వష్మేయవున్
వా. రన్యుల్గద పంచశాఖకలితప్రాంచత్కృపాణోరుధా
రారాద్ధూతరిపుద్విపాస్తమదపంకాళుల్ ప్రవీరుల్ వరుల్.

కావున నీవలనఁ గాఁదగిన దేదియు లేదు. ఈ రాచమిడుఁగురులజత రూపుమాపెద.

[తెరలో] జామదగ్న్యుఁడ! జామదగ్న్యుఁడా! అట్టిశాంతినిధియైన జమదగ్నికిఁ బట్టిగఁ బుట్టిన నీ వేటి కిట్లు శమధనహీనుఁడ వైనాఁడవు?

జా—శతానందుఁడు వీఁ డేల వచ్చె? [ఉచ్చైస్స్వరతో.] ఓయీ! అహల్యానందన! గౌతమునివలననా, గోత్రధ్వంసివలననా, ఏతండ్రివలన శమాభిధాన మిది నీకు సంప్రాప్తించెను?

[తెరలో] జామదగ్న్యుండ! జామదగ్న్యుండా! ఆ! పాపా! క్షత్రియాపుత్రా! కన్నతల్లికుత్తుక న్నఱికిన గండ్రగొడ్డలి గలవాఁడా! కులమున కనలమైనవాఁడా! తపస్తుంగమైన యాంగిరసకులముం గూడ నెట్లు కళంకితముగం గావించుచున్నావు?

జా—కులపాంసనా! పాంసులాసూనూ! సమగ్రతపోగ్రగణ్యంబగు భృగువంశముం గూడ నెట్టాడుచున్నాఁడవు?

రా—భగవానుఁడా! భృగ్వంగిరుల తపస్సు భువనవిఖ్యాతము. విశేషముగా భర్గశిష్యునికి విజ్ఞాపనము సేయుచున్నాను.

చ. మునులగు మీకు నౌఁ దపము ముఖ్యముగాఁగను శాంతచిత్తమున్
వినుతజపాక్షమాలికయు విశ్రుతదర్భలు గుండ గోలయున్
వనమున నుండు నే నుటజవాసము గాని యిదొప్ప దుగ్రభా
షణమును భూరివిధంగమును జాపము రోషమునుం గుఠారమున్.

ఇంతియకాదు. ఈవే విచారింపుము.

ఉ. ఎక్కడఁ ఖ్యాత మా తను వి దెక్కడ నీకు నసత్వరశ్వథం
బెక్కడఁ జారుశీల మిది యెక్కడ ఘోరతరోరుకార్ముకం
బెక్కడఁ బర్ణశాల యిది యెక్కడ నుద్ధతయుద్ధసాధనం
బక్కట కాండకాండమరయ న్విషమం బిదియే యవుంగదా.

జా—ఎట్లు పెఱతపసిఁబోలె నన్నును నెన్నుచున్నావు ? నేను జామదగ్న్యుఁడను.

శా. ఛిన్నక్షత్రియకంధరాక్షతభవాక్షీణాపగాస్నాతుఁడు
న్నన్నారాతిశిరోజము ల్గుశలుగానుం జేసి మేల్గన్నవాఁ
డున్నా నేఁడిదరక్తతర్పణము లప్పూర్గాంచెఁ బిత్రాళిసం
పన్నంబంచును సంతసంబునను నేవన్నెమ్మినవ్వెక్కులన్.

కాన నేను,

స్రగ్ధర. ముయ్యేడౌ మాఱులున్న - న్బొనరిచితి నని - భూపనిర్వాపణంబుల్
గయ్యంబుం జేసి యుంకం - గడఁక నొనరుతుం - గాక యట్లేనుమాఱుల్
అయ్యేయుద్ధంబులందున్ - హతనృపతిశిరో - ఘూర్తిఁ గాపాలికంబై
తియ్యంబౌనక్షమాలన్ - దివిరియిడుదు వం - దింతుఁదర్త్రైత్రపాలున్.

రా—అంజలింజేసి,

మ. కొనుచున్నీవు ప్రసన్నభావమును వాగ్దోషంబునా దెన్న కిం
కెనయించెన్మదిఁ గిన్కనుం బలుమఱున్ హేరాళఘుంగా యశం
బనువిత్తంబును జిత్తముం గితవు నట్లత్యంతముం బాపు నీ
ఘనతన్మిన్నక పల్కకుండుము జగత్ఖ్యాతుండయో భార్గవా.

జా—ఎట్లు పలుకుదును ?

ఆ. వాగ్వివాదంబనైక వైదుష్యులైనమీ,యెదను బ్రచురవాణి యేమిటి కిటఁ
బరులయసురుగొనెడు శరముల నా వాని, సైఁపుఁ దీర లెల్ల సైరణమెయి.]

రా—[కొంచెము విహసించి,] అన్యులతో నేమి ? నేనే నీబాణపరంపరను, ఖండపరశు
చాపారోపణద్విగుణితసితాశయకిసలయోపవీత మహోత్పలమాలికాలోలరోలంబ
గానయశగపరిమళమిళితం బగు నురస్థ్సలమున స్సహింతును.

జా—శా. ఉగ్రత్యక్తపురాణధర్మదళనప్రోద్భూతగర్వోన్నతి
వ్యగ్రుం డీవన నెంతవాఁడవు మదీయాస్త్రాళికిందాళఁతే

దుగ్రామేయతపోమహత్త్వమున మున్నొందె న్వరంబుం దగన్
వాగ్రామాధిపువల్లనీగురుఁడు విశ్వామిత్రుఁడే బ్రాహ్మ్యమున్.

రా—[తనలో] ఎట్లితఁడు పూజనీయుండైన విశ్వామిత్రునిఁగూడ నధిక్షేపించుచున్నాఁడు ! ఇంక సహింపను. [ప్రకాశముగా=వెల్లడిగా]

శా. ఉగ్రక్ష్యక్షత్రపురాణధర్మదళనప్రోద్భూతగర్వోన్నతి
వ్యగ్రుం డేనన కొంతవాఁడను ద్వదీయాస్త్రాళికిం దాళలే
దుగ్రామేయతపోమహత్త్వమున మున్నొందెన్వరంబుం దగన్
వాగ్రామాధిపువల్ల నాగురుఁడు విశ్వామిత్రుఁడే బ్రాహ్మ్యమున్.

[మఱియు సకౌతుకసంరంభంబుగ]

చ. కులిశకఠోరమైనవిలుకోలది భగ్నమె భగ్నమయ్యె నా
వలనను నీహృదిన్ శరమువై ఖరిమగ్నమె మగ్నమయ్యె నే
మొలయును శైవమైన మఱియు న్విలువైష్ణవ మైననేమి నా
బలుపగుదోర్విలాసము ధ్రువంబు గణింపదు దేని నేనియున్.

జా—బాగురా ! బాహుజబాలకా! మిడుఁగురుఁబురువా ! బాగుబాగు. ఎట్లనఁగా, జామదగ్న్యనామకుఁడైన ధామనిధి మ్రోలఁ గ్రాలుచున్నావు. [వెండియు సాటోపంబుగ] ఏమంటివిరా ! ఏమంటివి ! [కులిశకఠోరమైన విలుకోలది యనుపద్యమును జదువుచున్నాఁడు.]

రా—ఓయి, ఇదే పలుమాఱు చెప్పెదను [అదే పఠించుచున్నాఁడు.]

జా—చక్కఁగా జ్ఞప్తియైనది.

రా—ఏ మది ?

జా—ఉ. దేనిదినారి మ్రోఁత హరిదివ్యకరాహతిఁ గల్గి యంతటన్
వానిసుదామభృంగములధ్వానముచే ద్విగుణంబ యౌను ర
క్షోనళినేక్షణాక్షయసుశోకరవశ్రుతిపాఠకాళికిన్
బ్రణవముభంగినౌనదిది వైష్ణవకార్ముకరత్నమే సుమీ.

రా—[సకౌతుకంబుగ]

ఆ. శార్ఙ్గి కేలుదమ్మిఁ జలుపు లీలల నేది

జా— శార్ఙ్గ మద్ది యిద్ది చాపరత్న

మిడుకొనంగ విలంబింపేని నైకొను మిడు
కొనఁగఁ జాలవేనియును విడువుము.

రా—[కైకొనుచున్నాఁడు.]

జా—చేకొన్నావు కావున, కన్నీళ్లు గారుచున్న నీచుట్టములచే దట్టమైన యీచోటు దాటి, జగడమున కనువగుచెడకుఁ జనెదము. [అని రాములు నిష్క్రమించిరి.]

ల—[విలోకించి, సకౌతుకహర్ష విస్మయంబుగ,]

ఉ. పొందుగ శైవమైనవిలుపోలిక నిద్దియు భంగమ న్మతిన్
మందచలద్భుజుం డయిన మారఘురాముని చేత నీతఱిన్
బొందుగఁ జక్రమట్లోనరఁ బూర్ణముగాఁగను వంపఁబడ్డదై
యందమునైన వైష్ణవశరాసన మియ్యది వింత యెంతయున్.

[తెరలో] ఆహా! కుతూహలము. కుతూహలము.

మహాస్రగ్ధర.

పొడమెన్ శ్రీరామబాణంబు మొదట విలసత్పూర్ణ బాణాసనానన్
గడిమి న్మిన్నంటె నంతం గలఁచె భృగుసుతఖ్యాతనాకాధ్వమున్వే
తెలిపుర్గా నాఁగ నొప్పెం ద్రిదివసుదయువతీదివ్యపుష్పాంచితంబై
గడుఁ గీర్తిం గాంచి వచ్చెం గదిసి పొది కలంకారముం జేయుఁజాలన్.

[అంతట రామజామదగ్న్యులు ప్రవేశించుచున్నారు.]

జా—[రాముని విలోకించి నిర్వర్ణించి.]

ఉ. శోకిత్రిలోకియిద్ది యొసఁగుం గని మోదము నేది తోఁచినన్
బ్రాకటమా వికాసమున భాసిలు మానిమనోంబుజౌఘముమ్
శ్రీకువలాభుఁ డేఁ డితఁడు చెల్వగుబాలుఁడు సన్మనోహరుం
డేకరణిం దదుజ్జ్వలమతీద్ధము జ్యోతి జనించె నిట్లహా.

[వెండియుం దన డెందమునందుం దలపోసి,]

క. పురవైరిశరాసనమున, శరముగ నేఁడయ్యోవాఁ డెసఁగ బాలుండై
యరిదిగ నీవి ల్లెక్కిడ, నరు దెంచెఁ బురాణపురుషుఁ డని మదిఁ దలఁతున్.

[శ్రీరాముంగూర్చి,] ఓరఘుకులశిరోరత్నమా! ఇటు చూడుము.

రా—[సిగ్గుతోఁ దలవంచుకొని నిలుచున్నాఁడు.]

జా—[ముందుకు జరిగి, రామునిగడ్డము నెత్తి,] ఇది లజ్జాస్థాన మేమోయి!

తే. కమలలోచన నీచేతఁ గన్నవాఁడ, నధరభావంబు నీమహిమాతిశయము
చేత నిఁక నీవు దేవతాశ్రేణిమాళి, మణుల నధరీకృతములఁగా మనుపలేవె

రా—[కేలుమోడ్పుతో] చాలునింతతో, దుర్వినయపంకపంకిలుఁడనైన నన్ను భవదంఘ్రి నఖరకిరణతరంగిణీజలమునఁ గడుగుకొనుచున్నాను.

తే. చండతేజమె యుండు మార్తాండునకును, సౌమ్యతేజమెయొప్పుఁ జందురునకుఁ
జండసౌమ్యంబుతేజంబయుండు నీకు, నట్టినీదిట్టుతేజాన కమరుతు నతి.

[అని పాదములకుఁ బ్రణమిల్లుచున్నాఁడు].

భా—[లేపి,] ఓయి ప్రకృతికల్యాణనిధీ ! ఆశీరుక్తి కూడ నీవిషయమునఁ బునరుక్తియే. అట్లైనను ఇట్లాశీర్వదించుచున్నాము.

కవిరాజవిరాజితము.

వెలయఁగఁ జేయుము దవ్వుగఁ గీర్తిని వేడ్కను గంగ యనంగఁ గడుం
లలనలకన్నులనిద్దురచీఁకటులం బెడవాపెడు వెన్నెలనా
నలరుత మిద్ది జగత్త్రయిత్వద్విశిఖార్దితరావణమూర్ధచయ
ప్రలుఠనహృష్టభుజంగనరామరరాజివిరాజితమాజిభవా.

నిజాశ్రమగమనమునకు నిఁక నా కనుజ్ఞనిమ్ము.

[అని నిష్క్రమించుచున్నాఁడు.]

భగవంతుఁ డగు భార్గవుఁడు కంటికగపడక యెట్లు నిష్క్రాంతుఁడ యయ్యెను ? వత్స ! లక్ష్మణా ! రమ్ము. జామదగ్న్యవియోగఖిన్నమైన మానసమును జుట్టములఁ జూచుటచేత సంతోషపెట్టుకొందము. [అని, యందఱు న్నిష్క్రమించుచున్నారు.]

ఇది శ్రీమత్ప్రసన్నరాఘవనాటకమునఁ జతుర్థాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## పంచమాంకము

[అంతట గంగాయమునలు ప్రవేశించుచున్నారు.]

సఖి—కాళిందీ ! ఏల కుందుచున్నావు ?

యమున—భాగీరథీ ! కతము గలదు.

గంగ—అది యెటువంటిది ?

య—ఒక కారణ మేమనఁగా, నా సైదోదు సుగ్రీవుఁ డనువాఁడు గలఁడు.

గం—[సకౌతుకంబుగ నాత్మగతంబుగ] ఆ ! కోఁతిజాతియందుఁ బుట్టినట్టి సుగ్రీవునిం దోఁబుట్టువని యెట్లు వ్యపదేశించుచున్నది. [విమర్శించి] ఈ యిరువురికిం దండ్రి సూర్యుఁడొకండే కదా. [ప్రకాశంబుగ,] అతని కేమి ?

య—ఆ యాతఁడు వాలి యని పేరొందిన బల్లిదుండైన పెద్దకోఁతిచేత నోడఁగొట్టఁబడినవాఁడై కొంత కోఁతిగుంపుతోడఁ గూడుకొని యొండు కొండనె యుండగొని యున్నాఁడు.

గం—ఏమీ ? ఈ యిరువురు సోదరులా ? అట్లయినను వీరి కిటువంటిది వైరమా ? అటుగాక కౌతుకమా ? ఏకామిషాభిలాషయే వైరశాఖికి మూల మని యిద్ది ప్రసిద్ధము. ఇందుచేఁ జాలు. రెండవకారణ మంతయుం దెలుపుము.

య—ఒకానొకనాఁడు తపసితనమును గైకొన్నవారు వలఁతిఁడామనులవంటివా రిరువురు ప్రాయపువారు జడదారులును ఖిన్నమచందురునిఁబోలిన నెమ్మొగమ్ముగల యొక కొమ్మయుం దాముఁ గెల్వొగిచి దక్షిణపుదరి దాటి పోవుటకుఁ గడఁగిరి.

గం—తరువాతఁ దరువాత.

య—అంతఁ గొంతసేపటికి నాపె కేలుదోయి గీలించి నన్నుఁగూర్చి యిట్లు విన్నవించెను. ఓ దేవీ ! ప్రొద్దుముద్దుగూఁతురా ! వెండియుం నీకుటుంబమునకు చూడ్కి మేలు గలిగింపు మని.

గం—అది నీ వెట్లు తలంచుచున్నావు ?

య—[గంగచెవిలో] నీ తెఱంగుననే.

గం—ఇది యూహింపఁగూడనిది. సుడివడుపునఁ దిరుగుడుపడిన మదిఁ గలదానవై

నిజముగా నిదే యేమొ లేనిదానినే యనుభవించితివి. [విమర్శించి] అటుగాదు దైవముయొక్క సంవిధానచాతుర్యము నెవఁ డెఱుఁగును ?

య—పూజనీయురాలవైన నీవు నదేమియు నెఱుఁగవా ?

గం—ఇది యనుపయుక్తము. బ్రహ్మలోకమునుండి వచ్చిన సరస్వతియొక్క వాక్కులయందు నెక్కొన్న నెమ్మనమ్మున నున్నదానను. అందువలన రమ్ము. తత్పట్టణవాస్తవ్యుడైన యేనివలననేని వృత్తాంతమును విని నిరూపింతము. [అని పరిక్రమించుచున్నారు.]

ఇది మిశ్రవిష్కంభము.

---

సరయువు—[ప్రవేశించి] దేవులయిన మీకిరువురకు న్నమస్కారము.

ఇద్దఱు—అవిరళమంగళవు గమ్ము.

గం—[సరయువు చేయిపట్టుకొని,] యేలా? యీలాగునఁ దాపమున మునిఁగియున్నావు?

స—దేవీ ! ప్రతికూలాలాప మాడుచున్నావు. ఈశరీరసంతాపమేగదా, లజ్జాపంకమున మునిగియున్న నాకు సగ మవలంబనము గలది ?

గం—అదియంతయు స్పష్టముగాఁ జెప్పుము. ఎట్లు నీకర్ధావలంబనము ?

స—ఇప్పుడు గదా.

మాలిని. దశరథపురపౌరోదారకాంతాశ్రుధారల్
భృశగళితములుం దాషేద్ధము ల్మత్స్యపాళిక్
గుళము నుడుకఁజేయం గొంచుఁ బెంపొందు మేనే
నసురుసురనిసిగ్గో యంబకాంతుం ద్యజింతున్.

గం—[సాతంకంబుగ] మఱి వీరి బాష్పవృష్టికిం గారణ మేమి ?

స—[గంగచెవియందు నిటువలెనే]

గం—హా ! ఇందుమతీనందనా ! హా ! కోదండపండితా ! హా ! శతమఖసఖా ! హా ! అనేకమఖావభృథపవిత్రీకృతగాత్రా ! హా ! నిజతనుజనిర్విశేషపరిపాలితాశేషజనా ! హా ! రామచంద్రైకజీవితా !

స—[తనలో] వీనివలని విలాప మిది.

గం—హా ! మహారాజా ! దశరథా ! [అని మూర్ఛిల్లుచున్నది].

య—[పైఁటకొంగున వీచుచున్నది.] అక్కా ! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఎల్లగొనములచే వగచుటకుఁ దగినవాఁ డాఱేఁడు.

గం—[ఊఱడిల్లి] సఖీ ! సరయూ ! నీకొకతెకే కాదు. సర్వజనసాధారణముగదా యీ తాపము ? కావున రామచ్ఛత్రచ్ఛాయచేఁ బోఁగొట్టుకొందము.

స—[నిట్టూర్చి] అక్కా! ఎడబాటులేని సీతకలిమిగలిగియుఁ గమలకేదార మేరీతిఁ బరిశోష మొనయుచున్నది?

గం—వ్యక్తముగా నంతయుం జెప్పుము.

స—[మోవి యదరుట నటించుచున్నది].

గం—చాలుఁజాలు. దావానలపరిశోషితమైన మ్రానికొమ్మయందు గొడ్డలివేయుటకు నిచ్ఛగించుచున్నావు. [విమర్శించి] అటు గాకున్న నంతయుం జెప్పుము. ఏమి వృత్తాంతము?

స—[తనలో]

ఆ. సుజనుఁడైనయట్టి స్వజనునియందుఁ గల్గినది బెడదవోసమును గనినని
తగ దెఱుంగనాడఁ దడవఁ జూడఁగను, గలదె యింతకంటెఁ గష్టపాటు.

[ప్రకాశంబుగ] రామభద్రు నభిషేకించుటకుఁ గోరికి గలిగిన దశరథునిఁ జేరి మొదట నిట్టె వాకొన్నది కైకేయి.

ఆ. తనదు ప్రతిన నెఱపి తనరుట ప్రజఁ బరిపాలనం బొనర్చి వాసిఁగనుట
యనెడు నిదియె నృపుల కహహా! స్వర్గద్వార, మదియనర్గళముగ నగపడియెడి.

గం—[తనలో] ఇందు చేతనే యందాకం, దురాశచే నమంగళము సూచింపఁబడినది. [ప్రకాశముగ] తుద దేమి?

స—ఇది.

మ. మును నీవిచ్చినదౌ వరద్వయము నిష్టున్నాకు నీరాముఁడే
వనవాసంబున కేగుతన్ భరతుఁడే పాలించుత న్భూమి నం
చనఁ గైకేయిదిమాట వించు జనకున్ వ్యగ్రాత్మునిన్ మ్రొక్కి వీ
డ్కొని సంతృప్తిని రాముఁ డేగెను మహాఘోరాటవీవాటికిన్.

గం—హా! రఘుకులకుటుంబకంబా! చెడితివి.

య—ఒక రఘువంగడమె గాదు. మఱి మొగములు తబసులు కోటివేల్పులుదక్కఁ దక్కిన జగమంతయు రాముమోము నెలచల్లనిచూపు లేమిని మిగుల వగవఁగఁ దగినది.

స—ఇది యిట్టే.

క. చలువలఱేఁ డరుగంగన్, విలాతికిం జుట్టఱికము నెట్టనఁ గనుటన్
గలువలె జిగిచెడవు జగంబులుగా చీఁకటిని మునుఁగుఁ బోఁడిమివీడన్.

గం—హా దశరథ! సకలగుణభాజనమవై యె ట్లీదైవముచే వంచితుఁడవైతివి!

య—[సాభ్యసూయంబుగ] ఎవనిచే నటువంటికొడుకు గఱికపరకవలె విడువఁబడెనో, యటువంటితని మీరేల వెండియుం గొండాడుచున్నారరు!

స—పాపము శాంతము. పాపము శాంతము.

శా. కైకేయీవచనంబులన్ దశరథక్ష్మాభర్త యొక్కింతసే
పే కాంచెం బహుమోహముం గ్రుధ నిరూపింపంగఁ జోరార్ధితుం
డౌ కార్పణ్యధురంధరుండు కరగంబౌరత్నముంబోలె దూ
ర్వాకాండంబులఁబోలెఁ దావిడిచె హా ప్రాణంబులన్వేండియున్.

గం—మఱి యిప్పుడు రామచంద్రునియందు సీతాలక్ష్మణులవృత్తి యెటువంటిది ?

స—నడురేయి చందురునందుఁ జంద్రికాప్రసాదములది యెట్టిదియో యట్టిదే.

గం—[స్వ] రామునితోఁడఁగూడ వెలువడి రన నుడువఁబడుచున్నది. [ప్ర] సఖీ! ఇంచుక సేదదేఱుచున్నాను. అంతవఱకు నీవచనామృతము చేత. క్షణమయినను రామచంద్ర వియోగము ననుభవించుటకు సైఁపనోపనిది మాజానకి.

స—ఇది యిట్లే. ఓసీ! సీతా! నాతల్లులను గొలుచుచుఁ గొన్నిదినములు గడపుము. ఇట్లని రామచంద్రునిచేఁ జెప్పఁబడినదియై జానకి మూర్ఛిల్లెను. ఎట్లనఁగా, బంధుజనులచేతఁ దేఁబడిన చల్లని నీటిబొట్లచేతఁ దడుపఁబడినదైనను దెప్పిరిల్లదయ్యె.

య—మఱెందుచేత మూర్ఛఁదేఱెను ?

స—అమృతవాహిని. వనంబునకు నాతోఁడఁ, జనుదేరవె రామరో
యనుసీరామవాక్యంబె, నినుతొమృత మాటచేన్.

య—మఱి రామలక్ష్మణులకు నేమేని సమాలాపము జరిగెనా ?

స—జరిగెను. రామునిచేఁ జెప్పఁబడినదిగదా !

ఆ. కడపుమీవు కన్నుగవ మూసికొంచును, గొన్నియేండ్లు బంధుసన్నిధాన
నన్నుఁబోలె శిలసన్నుతుభరతునిఁ గొలుచుచుండు మీవు గుణభరితుని.
లక్ష్మణునిచేతనుం జెప్పఁబడినది.

క. సీతోఁడఁగూడ నాకొఁ, బ్రీతిన్నాలుగురయుగములు వెస నలుజాముల్
సీతోఁడఁగూడకున్ననొ, యాతన్మన్వంతరంబు లన్నియె యేండ్లున్.

మఱియును.

క. నీసంగతి సుఖనగునా, కొసంవత్సరసమంబు లాకల్పంబుల్
నీసంగతిఁ గన కఱునా, కొ సమలేకల్పసమము లాలోచింపన్.

గం—మఱి కౌసల్యచే రామభద్రుఁ డేమైన శిక్షితుఁడయ్యెనా ?

స—అయ్యెను. ఆమె, వత్స ! రామభద్ర ! జానకి నని యర్ధోక్తి చెప్పఁగానే, కన్నీరును డగ్గుత్తికయుఁ గలది యగుచు నిట్లు చెప్పినది. జానకినిఁ జూచుటకే యిట్టు లుండ, లక్ష్మణుం జూచుటకు నీ వెట్టివాఁడవు ? కాఁబట్టి యిదే నిన్నుఁ గోరుచున్నదానను.

క. అగుమీదుగ్ధముఖుఁడెడన్, సుగుణుఁడెడన్ లక్ష్మణుఁడెడ సుదయుండ వరయం
దగు రాజ్యసుఖముకంటెన్, మిగులఁగ నీవధికుఁడ వని మెలఁగెదు నితఁడే.

రాముఁడు చెప్పెను. ఓయమ్మా! నాకుం బ్రాణపదుఁడైన వీనియందునుం దక్షిణుండ వవు మని శిక్షింపఁదగు.

గం—అదిమొదలుగ రామభద్రునకు సహజసౌందర్యమే యాభరణమా?

స—వేఱొకటిగూడ. రామభద్రుఁడు సర్వాభరణములను వదలుచును గౌసల్యచే నిట్లు గోరఁబడియెను.

క. మైథిలిమంగళలక్ష్మికి, నాదటహస్తావలంబనార్థముగా నీ
శ్రీదమురతనపుటుంగర, మేదకు మోవత్స రామ హితమిది గనుమా.

[వెండియు సఖేదంబుగ] వేఱొండును నీకుఁ జెప్పెద ధీరురాలవగుచు వినుము.

గం—ఇంతవఱకు వినుచున్నదాననైన నన్ను నధీరురా లని యేల శంకించుచున్నావు?

స—చ. ప్రముదితవక్త్రశోభ కలరామునికిం జడలల్లె లక్ష్మణుం
డమరఁగ మల్లెమొగ్గ లన నగ్గలమైన నిజాశ్రుబిందులన్
శ్రమమునఁ దడ్పి లోకమె భృశంబుగ శోకముఁ దాల్చినట్లుగా
సమయకచెల్ల యేమనుచు నాదట నాడెద పీడెఁబోఁడుముల్.

య—తరువాతఁ దరువాత.

స—అంతట సప్రణయంబుగం బంధుజనులచే రామభద్రుం డిట్లు తెలుపంబడియె.

ఆ. సీత చాలబాల చిఱుతవారలు మీరు, దక్షిణంపుదిక్కు దైత్యనిలయ
మందువలనఁ జెపుదుమయ్య వత్సలతచేఁ, జనకు మీవవాచికి నిఁక రామ.

అంతటం దద్దిశంగూర్చియే.

క. పురజననయనార్పితమా, వరకువలయదామమూని వడిఁ జనె రాముం
డురుసురమురజద్విగుణిత, గురుగుణరవఘుష్టశార్ఙ్గకోదండుండై.

య—వెండియుం వేలుపుమద్దెలసద్దునకుఁ గత మెద్ది?

స—సఖీ! గంభీరముగా మ్రోయు సురమృదంగంబులచేత గంభీరమైన విషయమే సూచింపఁబడుచున్నది.

య—చుట్టములచేత జానకి యేమైనను బోధింపఁబడినదా?

స—అమ్మా! తత్ప్రతీపమ్మిది.

క. వనవాసోత్కంఠుండగు, తనపతితోఁ గూడఁ జనుచు ధరణీసుతయే
తనుమంజులమంజీర, స్వనమున బంధులకు దెలిపె సాధుచరితమున్.

ఇంతవఱకు జరిగెను.

చ. మనుజనునాథు వెన్కఁ బోరిఁ బూనిక వేగముగాను యేగునా
జనకజయం ఘ్నులం గిసలవచ్ఛవులం గనుబాంధవాత్ములన్
గొనబయి శాకరాలెఁ గడు గొప్పగ నత్తులు శీతలోష్ణముల్
గనుబెనుము త్తియంబు లనఁగా నటు లేల ఘటిల్లెనో కనన్.

గం—హర్ష విషాదములవిలసిత మిది. [వెండియుం సకౌతుకంబుగ] యుక్తము. అప్పుడు సుఖభోగమును సుమిత్రయుఁ జిన్నవాఁడైన లక్ష్మణునిచే నపేక్షింపఁబడలేదా ?

స—కోరఁబడినవే.

ఆ. పెద్దయన్న వెంటఁ బృథుశక్తిఁ జనువాని, కయ్యయోధ్య యయ్యె నడవి మఱియుం
భోగ మెల్ల రామభూమీశ్వరుండె సుమిత్ర సత్పవిత్ర ధాత్రిపుత్రి.

య—సులక్షణుఁడైన లక్ష్మణున కిది దగియున్నది.

గం—సఖీ ! కైకేయీవచన మిదే భరతునకు ననుమతమా ?

స—మేనమామయింటినుండివచ్చిన భరతునకుం గైకకును సమాలాపమే యిట స్ఫుటమయిన యుత్తరము.

య—మఱి యది యెట్టిది ?

శా. అమ్మా యెక్కడి కేగెఁ దండ్రి సుత యింద్రాస్థాని కేలా వియో
గమ్ముం గల్గఁగ నాత్మపుత్రు నిది పోఁగా నేల యాతం డర
ణ్యమ్ముంగూర్చి నృపోక్తి నాతఁ డెటు లన్యాయంబుగం బల్కె వా
క్యమ్మే బంధముగాఁగ నాడిఫలమే మా నీకు రాజ్యం బయో.

గం—మఱి యిప్పు డిక్కడ రాజ్యధరుఁ డెవ్వఁడు ?

స—క. కమలాలంకృతములు మణి, రమణీయంబులు నఖిలనరప్రణుతంబుల్
విమలములు రాజ్యధరములు,

గం—అదేమి, (రాజ్యధరులు) భరతశత్రుఘ్నులా ?

స—పాపము శాంతము, పాపము శాంతము.

గం—మఱి యవి యెవి ?

స— క్రమముగ శ్రీరామపాదుకారత్నంబుల్.

గం—బిడ్డఁడా ! భరతుఁడా! స్వీయశీలసలిలముచేత నీతల్లియొక్కయు నకీర్తిపంకమును గడిగినవాఁడవు.

య—అంతట నంతట.

స—అటుపిమ్మటనో, తద్వృత్తాంత నిరూపణముకొఱకు నిజకమలవనవాసి కలహంసము నాచేతఁ బంపఁబడెను.

హంసము—[ప్రవేశించి] ఆర్యలారా! ఇదె సాప్రణామము.

అందఱు, కోమలకంఠా! మంగళమందిరుండ వగుము.

గం—నాబిడ్డలయొక్క సంచార చరితములను మొదటినుండి తుదవఱకుఁ జెప్పుము.

హం—మ. తనువెన్నంటినపౌరులం బరువడిన్ దామాన్చి విఘ్నాల నాన్
మునుము న్నేగి విరాగిసద్గుణుండు రాముం డొక్కఁ డొక్కమ్మడిన్
జనియెన్ సీతయుఁ దద్విభూతి యనఁగా సంతుష్టయై వెన్క వే
డ్కను బోయెన్ బిదప న్సుమిత్రసుతుఁడున్ గాఢప్రమోదాప్తి నాన్.

అంతటఁ బథికజనులచేత వత్సవర్గము ప్రణయమధురముగఁ జెప్పఁబడియెను.

చ. సికతిల మున్నమంబు నయి చెన్నలరారెను దారి మార్దవ
ప్రకటసుశాద్వలం బిలయు వాహిని ప్రబ్బలి గల్గి చల్లనై
నికటమునందు ముం దలరు నీరజినీకుముదిన్యుపేతమై
వికటముసై మరాళరవవిభ్రమ మైనసరస్సు లెస్సగన్.

మఱియును,

ర. కనుఁగొను మిదె శీతచ్ఛాయంబున్ ఝరనురుమధుశీకరముకుటం
బు నిదియె యమిశస్వచ్ఛ స్వల్పస్ఫురితలహరివాహినిబాగోఁ
బెనుపొందినయది వెండియుఁ దుమ్మెదపిందు లులియువలపుల కిమ్మై
యనఁ దామరతంపర గలదీకొల నహహా తామరతంపరగాన్.

గం—ఆహా! తెరువునడక బడలిక నుడుపునవి తెరువరులపలుకులు.

య—తరువాతఁ దరువాత.

హం—తర్వాతఁ బ్రాణనాథునివెనువెంట జానకి చనుచున్నది.

మ. హరిణంబుం గని భీతనుం గురుదయాయత్తాత్మ యై తిన్నఁగా
హరిణాక్షీమణి సీత స్వాంశుకముచే నాత్మేశ్వరేష్వాసమున్
వరలీలాప్తి మఱుంగిడెన్ వరిమడిన్ స్వశ్రోత్రభూషాయిత
స్ఫురితం బౌ వరిమొల్కఁ గైకొని యిడెన్ సొంపొందఁగా నింపుగన్.

గం—ఈవిధమునఁ గనికరింపఁదగినది నాదుముద్దుబిడ్డ.

హం—ఇంకను,

మ. ప్రియమారంగ సరస్తటంబున నదీప్రాంతైకతంబందునుం
బ్రియుం నొక్కింతయుఁ బాయఁజాలనిది యా శ్రీచక్రవాకాంగనం

దయివారం గని దారి వారక ప్రమోదంబుం గనెన్ రామస
ద్దయితారత్నము సీతయాత్మగుణయుంక్త ప్రీతియుం క్రంబె కా.

గం—అంతవఱకు నాబిడ్డలనడవడులు, నడకబడలిక నుడువునవియా?

హం—మఱి ప్రయాణక్రమ మెట్టిది?

స—చ. అలఁతిగ నెండ యుండఁగనె యాఁ బయనం బదియైన మెండుగా
నిలుకడ గల్గుచుండెడును నీరజబంధునిడాలు డీల్పడన్
వెలయుఁ బ్రయాణము న్మఱి రవిం గనలేమినిఁ గన్నుమూయఁగా
జలజిని వీడుపట్టుగను జక్కఁగ నెక్కును టౌను వక్కఁడన్.

హం—నిచ్చలు నడచు తెరువరులకు నిది నియతము గాదు.

గం—[సాతంకంబుగ] జానకీసుకుమారావయవములు బీరెండతాఁకుడుం గూడ నెట్లై
ఱుంగ కున్నవి!

హం—వెఱపు వలదు.

తే. ఎండమెండైనఁ దాపంబు నెనయకుండు, మార్గమునయందు సీత క్షమాతనూజ
నల్లగల్వలదండడా ల్నల్వ్వమీఱు, రాము తెప్పార్పకయె చూచు నామె గాన.

గం—[సహర్షంబుగ] సఖి సరయూ! ప్రియతమస్నేహశీతల యయిన సీతయే కా దామె
చేత మనమును మనుచున్నాము.

స—ప్రోవఁబడుచునున్నాము.

హం—మఱియును.

తే. నేల బీరెండ మెండుగఁ గాలుచుండఁ, గర్కశాంగుల కేనియుఁ గానిదారి
స్నేహసంభృతయాటచే క్షితిజపలిప,దాంకితక్ష్మాతలము శీత మనుచుఁ దలఁచె.

య—ఓతంద్రీ! జగముచుట్టమా! నీవంగడమునందును గనికరములేనివాఁడవుగా నవు
చున్నావు.

స—ఓదేవి! క్షమా! నీకూఁతునందును నిర్దయ వగుచున్నావు.

గం—ఈ యిరువుర యుపాలంభముచేఁ జాలు. స్నేహానుగుణ ప్రవృత్తులు మహాభూత
వృత్తులుగావుగా?

హం—శా. శ్రాంత శ్రాంతయుం నయ్యు సీత పతికిన్ సంసేవ సేసెం గడున్
వింత ల్గాఁగను వల్కలాంచలమున స్విన్నంగ వీచోపుగా
నంతన్ రాముఁడు విశ్రమాంబుముఖుఁడై యాజానకీహ స్తిచే
శ్రాంత శ్రాంతుఁడ యయ్యె వెండియుఁ బథిశ్రాంతిం గనం డేమియున్.

గం—అహో! వినయముయొక్క మనోజ్ఞత!

స—తరువాతఁ దర్వాత.

హం—ఉ. చేరువ రాఁగ మన్కి మును జెచ్చెరఁ గొన్నియొ యజ్జ లేగి త
చ్చారుకరంబునుండి కొని చాపము దస్సినప్రాణకాంతునిన్
ధీరసహోదరాన్వితునిఁ దిన్నగఁ గెంజిగురాకులం దగం
గా రహిఁ వీచు సీత విధికార్యసమంచితవై జయంతి నాన్.

ఇదియంతేమో సరసము నీకు విన్నవించుచున్నాను.

చ. క్షితిసుతచేత వీవఁబడు కెంజిగురాకులచల్లగాలి త
త్క్షితిపతిపుత్రయుగ్మకము చెంపలఁ జెమ్మటఁ బాప నోపెఁ గా
ని తగఁ దదీయశోకభవనిర్గతనేత్రజలంబు మాన్ప దా
కతమున నద్ది సౌఖ్యజనకంబుగ నయ్యెను దుఃఖదంబె కా.

ఇంతియ కాదు.

శా. ప్రత్యావాసమునందు లక్ష్మణుఁడు సర్వస్తుత్యశిశ్రూషచే
నత్యంతంబు భజింప నింపుమెయిఁ ద్యక్తాయాసుఁడౌ రాముఁడా
నత్యస్థుం డని మేషబాష్పయుతవీక్షం గాంచ సౌమిత్రి త్య
క్తాత్యాయాసుఁడు శీతలాత్మకుఁడై యై కన్పట్టు నెప్పట్టునన్.

గం—రఘుకులీనులయొక్క సమంచితప్రణయపేశలత చెప్పఁబడ నేల? బిడ్డలచేత రఘు
రాష్ట్ర మెన్నిదినములు గడవ దాటఁబడెను.

హం—రాఘవుల యాధిపత్య మెట్లెఱుఁగనిదాన వవుచున్నావు?

శా. వీరగ్లాస్వరసావనమ్రవరపృథ్వీపాలమౌళ్యుజ్జ్వల
శ్రీరత్నస్ఫురదంశుమాంసలపదప్రేంఖన్నఖప్రాంకితుల్
దూరోన్ముక్తచతుస్సముద్రలహరీతోయోత్థశుక్తిస్థల
ద్రారాజద్వరశుక్తిభూవలయముక్ దాల్తుర్ ధరామండలిన్.

ఉత్తరకోసలముల మూడునాలుగునాళ్లలో దాటిరి.

స—తరువాతఁ దర్వాత.

హం—అంతటం ద్రిపురదమనమౌళిమాలతీమాలిక న్మందాకినిం ద్వరితంబుగఁ గళిందగిరి
కరిప్రకాండగండమదధారోదారం గాళిందినిం దాటిరి.

గం—[జనాంతికముగ] సఖీ! కాళిందీ! నీవు నా కేది తెలిపితివో యది యిది.

స—పిదపఁ బిదప.

హం—అంతట, వ్యాధయూధ విదళిత వింధ్యాద్రి కుంభికుంభస్థల గళితములైన ముత్తెముల మొత్తములే మొగ్గలుగాఁ గల తీఁగలఁగల కాఱడవులే వలువలుగాఁ గలిగిన నర్మదను దాటి, చంచలకర్ణాంచల సురభిళ శుండాల గండ చలిత సహచర సమాగమమువలన సమ్మోద మైనసిన యాఁడుదుమ్మెదల యిమ్మయిన ఝుంకారమ్ముచే రమ్యమైన గోదావరీసవిధమునకుఁ జనిరి.

య—అయ్యో! అయ్యో! అయ్యొడఁగద, లంకయొడయుని చెల్లెలు క్రొవ్వినది చుప్పనాతి యను నొక్కరక్కసి చెరలాడుచున్నది.

హం—మిక్కిలి క్రొవ్విన దని వక్కాణింపందగు. ఇపుడుగదా యది లక్ష్మణకౌక్షేయకమ్ముచేఁ గోయఁబడిన తనముక్కుయొక్క నల్ల యను కల్లు నానినది.

య—[సహర్షంబుగ] దాని సబామునకు నిది దగినదే.

గం—[స్వ.] ఇది యేదో యనర్థాంకురముగాఁదగినది. [ప్ర.] దానిని విని జనస్థాననివాసులైన రాక్షసులసమూహ మేమి సేసెను ?

హం—కత్తుల విండ్లం గైకొని రామభద్రుని కభిముఖముగఁ గదలెను.

గం—[స్వ.] విమ్మటఁ బిమ్మట.

హం—అటుపిమ్మట, సౌమిత్రిచే రామభద్రుఁడు విన్నవింపఁబడెను. ఆర్యా !

క. రక్కసుచెలియలిమెత్తని, ముక్కుఁ దఱిగి నల్లయందు మునిఁగి పదునుతో
మిక్కిలి మెఱసెడు నాయది, యిక్కత్తి నిశాటఝాటహింసకుఁ దివురున్.

రామభద్రునిచేఁ జెప్పఁబడెను. వత్సా! అబలాజనము ప్రకృతిభీరువుగదా! అందుచేత సీతతోడఁగూడిన పర్ణశాలనే నీవు కత్తినెత్తికొని కాపాడుచుండుము. "నేను శీఘ్రముగా," అని యర్థోక్తియందే, మానవాదసమూహమ్ము సమ్ముఖమ్ముగఁ జనుదెంచెను.

క. అంతట మహామాత్రమాత్రన, నెంతయుం జయలీలచే రహిం బిల్వఁబడెఁ
గాంతుఁడు లక్ష్మణుఁడు,

స—[సహర్షంబుగ] రామభద్రునిచేతనా ?

హం—కాదు కాదు.

స—భగవతి భాగీరథీ! నన్నుఁ గాపాడు కాపాడుము. రాక్షససమూహము చేననిచెప్పునో?

హం— అరితతి, గంతుకొనఁగ నులియుంరామకార్ముకమణిచేన్.

గం—ప్రథమక్షణమున నగపఱుపఁబడిన బీరెండగల దిది యమృతవృష్టి గాదు.

య—తర్వాతఁ దర్వాత.

హం—అంతట సంతుష్టులైన సంయములచేఁ బలుకఁబడిన సాధువాదములను విను వినోదముచేఁ గొన్నాళ్లు గడచెను.

చ. వరకురువిందనేత్రము ప్రవాళవిషాణము మౌక్తికోల్లస
ద్గురుతరచిత్రమండనము కోమలహాటకకాయమై యహో
హారిణము గర్గె నొండదవి నంతట భూరిమనోహరంబు సం
చరదమరాగమో యనఁగ జంగమరోహణశైలమో యనన్.

గం—తరువాతఁ దరువాత.

హం—తర్వాత.

తే. భూరిజితాసమశరచాపము గనుఁ జాప, విజితయువతీవరభ్రూసువిభ్రమముగ
సీతకడకంటిచూడ్కి దాఁ జేరె దాని, రాముఁడును నసితోత్పలశ్యాముఁడు మఱి.

గం—తర్వాతఁ దర్వాత.

హం—శా. భీతార్తం బయి యార్చు నామృగముతో వేగంబె యేగంగ శ్రీ
సీతాకాంతదిస్వాంతమాతురతతో శ్రీలక్ష్మణుండుం ధను
స్స్ఫీతుండై చ నియోం దదాశ్రమము రక్షింపంగ నందుండక
ప్రీతిం బ్రీతిని వచ్చె నచ్చటి కహో భిక్షుం డొకం డెవ్వఁడో.

గం—[తనలో] అందువలన నిది యనర్థనాటకమునకుఁ బూర్వరంగకల్పనమువలె నని భావించుచున్నాను. [ప్ర] అంత నంత.

హం—అంత.

ఉ. అకడ రాముఁ డుజ్ఝితదయన్ హరిణాంగమునందు బాణమున్
వీఁకను వేసె లక్ష్మణుఁడు వేగనె వచ్చె సధర్ముఁ డన్నపైఁ
బ్రాకటభక్తి సీత యిడె భైక్షము భిక్షువుకేల లీల నే
నాకసమందునుండి యొకయప్పుడె కంటిని దీని నంతయున్.

స—[ఔత్సుక్యమును వ్యక్తీకరించుచున్నది.] అంతట నంతట.

హం—మఱియును నేను,

చ. కనకమృగంబుగాత్రమున గ్రద్దరిమం ల్కిదిపాటుఁ గాంచుటన్
గనికర మొందు డెందమునఁ గానఁగనేరక చూపుఁ ద్రిప్పికొం
చును నిలిపృత్తము న్నృపలిసోమునివృత్తము నీకుఁ దెల్ప గొ
బ్బున నిటసీతటి స్దిగిలెఁ బుణ్యాదయోసరయూ సరస్వతీ.

కావున మీరు ఈ దివ్యవారియందు వాల సాకనుజ్ఞ నిండు. అలసినదానను.

గం—క. తిరముగ నలరుము శుచిజల, మరవిందవికాసముగలయంచితసరసీ
బురతరుణీచరణరణ, ద్వరనూపురకూజితోత్కటక్ హంసకమా.

హం—[నమస్కరించి నిష్క్రమించెను.]

స—భాగీరథీ! ఈ నూపురోద్దేశముచేఁ జెప్పఁబడిన వృత్తాంతముచేత దానిచే మఱవఁ బడిన దేమో యొకటి నాచేతఁ దలఁపఁబడుచున్నది.

గం—అది యెటువంటిది?

స—ఎటువంటి దనఁగా, అడవికి వెడలునపుడు, పతివ్రతాశిరోమణియైన యరుంధతి యందెలజోడు చేతఁ బట్టుకొని పుత్రమిపట్టితో సాదరంబుగ నీమాటఁ జెప్పెను.

చ. హరిణదృగంగనామణి యుదంచితము ల్గద యివ్వి యందియల్
వరమణిమండితంబులు వలన్మృదుకస్వనము ల్ధరింపుమీ
విరహముఁ గాంచ రెప్డుఁ బతి ప్రీతికె పాత్రము లౌదు రింతులీ
స్ఫురదురునూపురప్రవరము ల్ధరియించిన వీనిశక్తిచేన్.

సీత, అరీతినే చేసినది.

గం—బ్రతికితిని. నాయనుంగుఁజెలికత్తె వసిష్ఠసహధర్మిణి సత్యవాదిని. కాఁబట్టి యీ వృత్తాంతమంతయును రఘుకులవత్సలుఁడైన సాగరునకు విన్నవింపఁబోదము. [అని పరిక్రమించుచున్నారు.]

గం—[సవిస్మయంబుగ] ఓసీ! ప్రవాహజవాతిశయముచేతఁ, దూరముగఁ జెచ్చెర వచ్చి నారము. ఇఁడుగో గోదావరీసహచరుం డగుచు సాగరుం డేమో మాటాడు చున్నాఁడు. మనము వేలాతమాతనుమాటునుండి తద్వృత్తాంతము నాలకింతము.

[అంతట, గోదావరీసాగరులు ప్రవేశించుచున్నారు.]

సాగరుఁడు—తరువాతఁ దరువాత.

స—తద్వృత్తాంత మిటను నేల చెప్పఁబడుచున్నది?

య—అంచచేతఁ జెలుపఁబడనియది యెదో యదే యగుఁ గాఁబోలు.

గో—శా. రామోన్ముక్తశరప్రభిన్నతనునిర్యద్రక్తసంసిక్తమై
హేమాంగం బగునాకు రంగ మపు డాయె న్బోఁకుమారీచుఁడే
యామస్కర్యథముండు రావణుఁడుగా నయ్యెం దశాస్యుండు సు
శ్రీమత్కుండలమండితుండును మదోద్రేకాతిరేకుండు నై.

గం—హా! హతలమైతిమి. [విమర్శించి,] ఐన నేమి? అందెలదోయి గలదు.

సా—[ససంభ్రమంబుగ] అంతవఱకు మాచిన్నది నిశాచరునిచేతఁ దాఁకఁబడ కున్నదా?

గో—అట్లేకదా!

చ. దనుజుని కేలు దాఁకమికిఁ దా ననసూయయొసంగినట్టి స
ద్వసుతతరాంగరాగమున వెల్వడి వెల్గాకఁడంటరాని వే

ల్పనఁగ వెలుంగుచుం గువలయచ్ఛదళీతముగానె యై తనం
తటి వెస సీతఁ గ్రమ్మెను ఘనమ్ము దటిత్తు ననంగ నత్తఱిన్.

సా—[సహర్షంబుగ] అంత నంత.

గో—అంతట, వరుణమంత్ర చింతనముచేత సమానీతమైన నూతన జలదశకలముచే నిచోళితహాస్తం డగుచు నంటకయే,

శా. హా నాథా రఘునాథ సాధుజనరక్షా దుష్టసంశిక్షకా
ప్రాణేశా జగదేకవీర కరుణాపాథోధి శ్రీరామ నీ
దాని న్నన్ను నుపేక్ష సేయఁదగునే ధర్మజ్ఞ యంచుం బోరిం
దీనత్వంబునఁ బల్కు సీతఁ గని పక్షిగ్రీవుఁ డేగె న్దివిన్.

స—[సవిషాదంబుగ] భాగీరథీ! మనయభాగ్యమువలన నరుంధతివాక్కులు గూడ మృషగాఁ గలవు.

గం—కావు కావు.

సా—[సవిషాదంబుగ] అంత నంత.

గో—అంత నత్యంతోన్నత శిఖరి శిఖరనిశాంతుఁడును, శకుంతరాజును నగు జటాయువు దారి నడ్డగించి సాటోపంబుగ దశాస్యు నుద్దేశించి యిట్లు వచించెను.

శా. ఓరీ పాపుఁడ నేఁ గనుంగొనఁగ రామోర్వీశరామన్ హరిం
తేరా చౌర్యముచే గిరీశ్వరశిరస్థేందూల్లసద్రేఖ నాన్
ఘోరాస్యన్నఖరాళి నీతలల నేఁ గ్రోధోద్ధతిం ద్రుంచి ని
న్నేరా చంపెదఁ దత్పుపర్ణుఁ డమృతాస్వీతోరగంబుంబలెన్.

గం—ఇది నూపురప్రభావము.

సా—[సహర్షంబుగ] విస్మటఁ బిమ్మట.

గో—తే. అజ్జటాయువుతన్నుల నంతరావణునకు రక్తసిక్తంబయి తనువు ప్రిదిలె
రథము హేమాభరణము ధరాసుతాప్తి, జనితవితతమనోరథమును గ్రమమున.

సా—అంతట నంతట.

గో—అంతట, నిశితనఖనిస్త్రింశనిపాతభీకరమైన సమరసంరంభంబున విజృంభమాణుండగు రావణునియొక్క యొక్కకేల సంభ్రమాతులయై యున్న యాకెది.

తే. క్షణము లేదుగదా జనకజదియందె
క్రందనము సేయుచుం జిలఁ బడెఁ గరుణముగను

గం—అయ్యో! ఇపు డపనీతాళుల మైలిమి,

గో—నిలునిలుము చచ్చితివి నీవు ఖలయనుచును
ఖడ్గహతుఁడై జటాయువుర్వి కెమను బడియె.

సా—హా! బిడ్డా! సీతా! ఇప్పుడు దానవునిచేఁ గొనిపోఁబడుచున్నదానవా? [అని, మూర్ఛిల్లుచున్నాఁడు].

గం—[చెచ్చెర వచ్చి పీచీపటాంచలముచే వీచుచు] దేవా! ఊరడిల్లు మూరడిల్లుము.

సా—[ఊరడిల్లి,] ఎట్లీకడం గంగయుం గాళిందియు సరయువును? అందువలన నన్నం దఱుం బట్టుకొనుండు. వంతవఱచే నేను గొట్టుకొనిపోవుచున్నాను.

గం—భయంపడ నేల?

తే. సంపదలును దురాత్ముల కింపునిడవు, తుదకు నాపదల యిడి తొలఁగుఁ గాన
నాపదలును మహాత్ముల కడలు నిడవు, తుదకు సంపద లిడుటచే నిది తగుఁగద.

సా—గోదావరీ! రామభద్రునివృత్తాంత మెటువంటిది?

గో—రామభద్రుఁడో,

వసంతతిలక. హాతన్వి హావిధుసమాననయంచు దుఃఖా
పేతుండనై పలుకు చేదుపు దోఁప సౌమి
త్రీతుండెయ్యెనడక యే పెదలంగ నెట్టో
సీతేశుఁ డేగెఁ గలశీసుతదిఙ్ముఖుండై.

స—సఖి గోదావరీ! ఆ నూపురముయొక్క వృత్తాంతము నెఱుఁగుదువా?

గో—దానిని దీసికొని యేదో యొకకోఁతి ఋశ్యమూకపర్వతాభిముఖముగ నరిగిన దని వనదేవతాముఖమున నేను వింటిని. [నేపథ్యమందు,] సఖి కాళిందీ! వర్ధిల్లుచున్నావు.

య—మఱి యిట్లు సూచీశలాకాశల్యక్షతములైన నాగోళ్లను లత్తుక రసముచేఁ దడుపుచున్నవా రెవరు?

తుంగభద్ర—[ప్రవేశించి, విలోకించి,] కాంతాజనపరివృతుఁ డగుచు సాగరుఁ డిట నెటు లున్నాఁడు? [ముందఱికి వచ్చి,] దేవుఁడు సర్వోత్కృష్టుఁ డవుత.

సా—తుంగభద్రా! కాళిందీవర్ధనము నంతయుం జెప్పుము చెప్పుము.

తుం—సోదరుఁడైన సుగ్రీవునియొక్క వానరరాజ్యలాభముచేత.

య—ఇపుడు బీరెండతోడను, గందముతోడను గూడుకొన్న రెండుప్రక్కలు గలదాన నగుచున్నాను.

సా—వాలిచేఁ బాలింపఁబడు రాజ్యలక్ష్మి యెట్లు సుగ్రీవునిఁ బొందెను?

తుం—ఏల వాలికథ యిప్పుడు? సీతాపదగళితమాఖర రత్ననూపురప్రదానమ్మున నమ్మిక

కొమ్మది రామభద్రుం డుండ, భర్తయైన తనున్ సుగ్రీవునిని సమర్పించిన హాను మంతుఁ దప్పుగిది యత్నించెను. ఎట్లన, ఆయమ్మ నుడువలన

శా. లీలామాత్రముచే వధించి మును వాలిన్ మైఁడి లేడింబలెన్
శ్రీరాముండు వలీముఖేశపదవిం జెందించి సుగ్రీవునిన్
శూరత్వంబున మిత్రశత్రు నతిమాను న్నాకమొందించె స
ద్ధీరత్వంబున నాత్మగోత్రపతి నందించెన్ హరి న్మోదమున్.

సా.—అంత న్సుగ్రీవుఁడు ప్రత్యుపకార మేమి సేసెను ?

తుం.—అంత నతఁడును.

చ. వసమతి కంది కుంది కడువాడినచంపకమాలవోలెఁ బో
ల్పెసఁగక యుండుసీతను మహి న్వెదకుం డెటనేని మాన కం
చు సముచితాధ్వముం దెలిపి శూరుల నీలనలాంగదాదులన్
వెసఁ జనుదేరుఁ డంచుఁ బనిపెన్ హనుమన్ముఖు లేగి రాకపుల్.

సా.—ఇపుడు బ్రదికితిని.

గో.—ఈ వొకఁడవా? ఈసకలలోకమును.

సా.—ఇది యిట్లే. సకలజన కుముదానందకరుఁడుగదా, రామచంద్రుఁడు. ఇంచే యం తయుం దిలకింపుము.

ఉ. ఉండెడు సీఘగిరథజయు స్రవిజాసరయూసరిద్వరల్
మెండగుకూర్మిఁగూడుకొని మిక్కిలి న న్నలరించువారు నీ
రొండనె నేను సాగరుఁడ యుక్తముగా రఘువంశపక్షమే
యుండినమాకు రామునిశుభోదయభావ మెసంగు టబ్రమే.

[మీఁదు సూచి, సాశ్చర్యంబుగ,]

మ. పవిధారాదితపక్షను ల్గద గిరుల్ భావింపఁగా నన్నియున్
భువి మైనాకుఁ డొకండు నాపయసునన్ బో మున్గియుండుం గదా
యెవఁడో నీఁ డిట్టు నన్ను దాఁటెడుఁ గరం జేపొంది గుర్వంగుఁడై
యివపుంగొండయొ వింజపున్మలయొ యూహింపంగ రాదేమియున్.

కావున నీఁ డెవఁడో యంతయు నిరూపింతము రండు [అని, యందఱున్నిష్క్రమింతు చున్నారు.

ఇది, పంచమాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## షష్ఠాంకము.

[అంతట, రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.]

రాముఁడు—శా. సౌమిత్రీ ద్రుతలంబు నీరవలయంబుం జండాంశుఁ డేచుం గదన్

లక్ష్మణుఁడు— రామా రాతిరిప్రొద్దు సుద్దియెది రేరా జీతఁడే రాజిలున్

రా— సోముం డీతఁ డటంచు నెట్లెఱిఁగితో ?

ల—[సప్రత్యభిజ్ఞంబుగ] చూపట్టుటం జింక యుందు,

రా—[సానుస్మరణంబుగ, సకరుణంబుగ,]

ఓ మత్ప్రేయసి! హామృగాక్షీ! యెట నుండో గ్లానముఖీ! జానకీ.

[వెండియు నవలోకించి,] అయ్యో! అతికసంతాపముచేత మోసపోతిని. ఆకాశముపైకి నెక్కుచున్న రోహిణీహృదయచందనుఁడు చంద్రుఁడావీఁడు? [చందురుం దిలకించి,]

చ. అమృతకరుండ నీకరము లారయఁ గైరవబాంధవంబులౌ
నమరెడు జాగరూకములె యై భువనాళివిశిష్టచేష్టలన్
సముమతిఁ జెప్పవేల యది శ్యామ మదీయ వసించు నెక్కడన్

[విమర్శించి]నమృగుఁడ వౌదు వీ విఁక నిశాచరుఁ డౌదువు చందమామవే.

ల—[తనలో] కట్టా! వనటయల నెట్టిదూననీయంబి మానసంబునుం బొరలించుచున్నది? అటులవుటవలన, వేఱువిషయముమీఁదికి నరుగఁ జేయుదును [ప్రకాశంబుగ] అన్నా! ఇటఁ గాంచుము. ఇదె, చంచలచంచూపుటముచేఁ ద్రావఁబడుచున్న యమృతకరకర నికరము గలది, వెన్నెల పులుఁగు.

రా—[విలోకించి]

మ. మును నీచేడియతోడఁ గూడుకొని సోము స్నాని యేధ్యానిచ
క్కనిచెక్కిళ్లదిడాలు గ్రోలితివి వేడ్కం జాడ్కికిం బందువై
తనరంగా నలసీత నెమ్మొగముఁ జెంతన్నారుఁ గాన్పించి ధ
న్యునిఁజేయంగదె నన్ను నన్నద్విజమాజ్యోత్స్నాప్రియోత్తంసమా.

ల—అన్నా! ఈకడ నాలోకింపుము. ఇదే శరత్కృశయు, సుధాకరకరకరంబిత తరంగయు నగు తరంగిణి.

రా—[కనుంగొని,]

క. కల్లోలిని నీవలెనె, యల్లలన కురంగనయనయందుం గృశతన్
సల్లలితవు సహజసుశీ,లోల్లసితవు సీత దాప మొందు న్మఱియున్.

ల—ఇక్కడఁ జూడుము. సగము విచ్చిన నల్లగలువ మొగ్గనడుమ నడఁగియున్న దిదిగో
గండుఁదుమ్మెద.

రా—[చూచి,]

మ. వికసల్లోచనరోచిరాళిఁబహురీఁపీతంబు లామోదమా
త్రకము ల్గాఁదగుకర్ణపూరముల నాస్థన్నిల్పి కించి ద్రుతిన్
బ్రకటింతీవుగదా మదంగనకు మిత్రత్వంబు సంధించి యా
యక మోమెందుఁ గనందగుం దెలుపుమయ్యా యన్న పుష్పంధయా.

ల—[తనలో] అన్న యిందాఁకం దీని నాలోకింప కున్నాఁడా ?

రా—తమ్ముఁడా ! ఇది యెట్టి పిట్ట !

క. ఇది కుంకుమరుచి వెలుపలఁ, బొదలించును గాంచి లోనఁ బొరిరాగంబున్
నదితటమున నేడ్చెడు తన, ముదితను గనుఁ గాని కదియ మొనయదు కరుణన్.

[నిరూపించి] అగుఁగద, యిది సహచరీ విరహవిదారిత హృదయము. పరాకము చక్రవా
కము. [నిశ్శ్వసించి] ఇది యొకఁడే తుల్యదుఃఖము చేత నాకున్ననూనశీలము. కానిచో
నాకును దీనికిని సమానశీలత యేలాగున నగు ?

ఉ. ఈయదిచక్ర మిందు పుదయింపఁగనుం బ్రియవిప్రయోగమున్
జాయ మగండు రా మఱియుఁ సంగమసౌఖ్యముఁబొందుఁ బొందుగన్
జాయను బాసి గాసిపడు నాకన సెన్నొకొ యయ్యె నయ్యయో
యోయనదుఃఖదంబులు విధూష్ణకరోదయముల్ గ్రమంబుగన్.

ల—అన్నా ! ఈకడ నాలోకింపుము. ముకుళిత నళినీపరిసరానుసారి కలహంసకము.

రా—[కని] కనికరమున,

మ. గిలిగింత ల్పచరించి నన్నఖములం గీలించినం గోరకం
బులు రోజంబులు బాగుఱన్ మధుకరంబు ల్పాడమిం బద్మినిం
గరుణాహీనని శేనపాదహాతి భంగన్మార్చి తాంగం గటా
కలహంసంబు గనుంగొనుం బలుమఱున్ గ్లాంతంబు క్లాంతంబుసై.

[విమర్శించి, వెండియుఁ సవిషాదంబుగ] ఇటువంటివానికి సహచరీజనానుకంపా కోమలము
మానసము మేలు. స్వభావకఠినుఁడైన రామునికో కాదు.

ల—[తనలో,] ఎట్టిప్పుడును, అన్నమనమున జానకీమయ మింద్రజాలమున్మీలించుచున్నది?

[తెరలో,] సఖా ! రత్నశేఖరా ! చిరకాలమున కగపడితివి.

ల—[ఆకర్ణించి,] ఇదియేమి? [మఱియుం దెరలో] చెలికాఁడా! చంపకాపీడా! ఇది యిట్లు. నేనింతకాలమువఱకు నఖిలమాయానిధియు, మాయావిదులలో నగ్రేసరుండును నైన మయుండను దానవునియొక్క కూఁతురును, తనతోఁడఁబుట్టువు, నవు నామె ననుస రించుటకు లంకయందు నునికిఁగొనియున్న చిత్రరూపుఁ డను దానవునివలన, సకల మయిన యింద్రజాలకలనఁ దెలిసికొనుచుంటిని.

ల—అవు నిది యెవరో యిరువురు విద్యాధరుల సంవాదము.

[తెరలో] సఖా! రత్నశేఖరా! ఆహా! ఏన నదియేమో, నిజకళాదర్శనమును గావింపుము.

[తెరలో] చెలికాఁడా ! చంపకాపీడా !

క. నరులకు సురాసురులకుం, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులకున్
గర మరిది యైనచిత్రము, వెరవారఁగఁ జూపు మెవనివృత్త మొనరేడున్.

అటుగానియెడ, వేఱేల? లంకననుసరించినదే యేదేని నవీనమును, సరసరమణీయము నైన చరిత్రమును నీకుఁ గనఁబఱిచెద.

ల—అన్నా! ఇక్కడ నిడఁబడు నీయది యయతోప్నపసీకము ప్రేక్షణీయము ప్రేక్షణికము.

రా—వినకయే.

గీ. నీసురతవపుటం జెలనినదము విని, కలఁగి కలహంసములు కలకలముసేయ
లక్ష్మణపదాబ్జములజాడ లలితములవు, గౌతమీసైకతములను గనుము సీత.

ల—అన్నా ! ఎక్కడ? మఱి యిక్కడ గోదావరియు వైదేహియు?

రా—ఎట్లు ప్రతారితుఁడనైతి మతిభ్రమముచేత? కానేని, కృతార్థీకృతుఁడ నైనాను. దీనిచేఁగదా ?

ఆ. సీత లక్ష్మణుండు గౌతమీతీరతపోవనములఁ బార్శ్వములను బరఁగఁ
గడపినాఁడ నిమిషకలన నెయ్యవి యట్టిదినము, లింక ముందు నొనరుపడెడు.

[మఱి ప్రత్యాశతోను,] కానీ !

క. ఇది వేనితోడఁ జూపెన్, ముదమున గోదావరియల మొత్తములసిరుల్
ముదితవియవి వచనసుధల్, గుదురుగఁ జెవి చేరలఁ జవిఁగొందునో మఱలన్.

[తెరలో]

క. గోదావరి యో సొబగుఁడ, తాఁ దాల్పుం జేతను వెలిదామరగొడుగున్
బ్రోదిగనల వెలిసీవ్వరు, నేదకయే పీచు నీకు నిని యరుదుగదా.

రా—[సహర్షంబుగ] ఆహా ! అదే యిది, ప్రేయసీసమాలాపము. అలాగున నే.

చ. పరిమిత మాట హృద్యమగువాగ్విభవంబొ సుకోమలంబయా
సరసము మాధురీధురిఁ బ్రశంసిత మింకను నేమనం జనున్
స్వరమున వీణియం దనరుపంచమముం బురణించుదీనికిన్
వరకలకంఠకంఠరుతి పన్నదె శున్ శ్రుతివాదభూమియై.

[విలోకించి] ప్రియురాలు మఱి యెక్కడ? ఎట్టిది యస్పష్టచంద్రరేఖయుం చంద్రాతపము? [అంతట పర్ణశాలఁ బసఁగల ప్రకారముగా జానకి ప్రవేశించుచున్నది.]

రా——[సావేగంబుగ] ప్రేయసీ! ఎట్టిప్పటి కిచ్చటికి వచ్చితివి? [అని. కౌఁగిలింపఁ గోరుచున్నాఁడు.]

ల——అన్నా! ఏమిది యింద్రజాలమును నిన్నుం గలంచుచున్నది.

రా——[నిర్వర్ణించి,] ఆహా! ఏమిది సన్నివేశవిశేషము! ఎట్లన్న

మ. ఒకకేలం గయికోఁబడెం దగ నశోకోర్వీజసచ్ఛాఖ వే
రొకకేలం దినచంద్రమస్సరుచి యయ్యుం జెంప యింపొందెడున్
సుకచంబున్ లులితంబునై పిఱుఁదుపై సొంపేదడుం బొర్లుచున్
బ్రకటంబౌఁగద పక్ష్మలేఖవిగళద్బాష్పోరుపుష్పాప్తమై.

[వెండియుం విభావించి,] తగు నిది యశోకశాఖను సఖినింబోలె నవలంబించి నిదురఁ బొందినది. దీనికా?

చ. వికసితనీలనీరజసువిభ్రమనుం గనఁ గన్నదోయి ప్రా
యికసుమకోమలాంగము వహించు నహా శిథిలత్వ మెంతయేన్

[వెండియుం విమర్శించి,] తగు నిది మనస్సంతోషమునకు, స్వప్నమందుం దీనిచే నెవఁడో చూడఁబడినాఁడు. ఐన, దీనికి,

ఇఁకఁ బలుకం గడంగనవు డెన్నఁ బ్రవాళసుశోభఁ జెన్నగున్
బ్రకటముగా ముదశుకణవారము వహా కికరాశి నాఁ దగున్.

సీత——[కనులు దెఱచి] అయ్యో! ఏమి! ప్రాణిలోకము వేఱువిధముగా నున్నది? గోదావరిజక్కర యెక్కడ? ఎక్కడ నల్లగలువవలెఁ జామనిచాయవాఁడు రాముఁడు? లంకాపురి యెక్కడ? ఎక్కడ రాముఁడే మనుగడగాఁగల సీత? [అని మూర్ఛిల్లిపడుచున్నది.]

రా——[భూమినిఁ గూర్చి,]

ఉ. దేనిని దాల్చి గర్భమున దివ్యసతీమణిరత్నగర్భనాఁ
గా నుతవైతి సార్థకముగాఁగను గాంచితి నామధేయమా
మానినిసీత నీపయిఁ గ్లమంబునఁ బొర్లఁగఁ గాంచి యించుకే
మానుపవేల ధాత్రిమతిమాలితొ సర్వసహాఖ్య నీవె కా.

కావున దీనిఁ దేర్ప నిన్నే బ్రార్థించుచున్నాను. [విమర్శించి] కానిచో నీప్రార్థన చే నేమి ?

క. తనకూఁతురైన సీతకు, జనవు మెయిన్ నీవుఁ దేర్ప సమకట్టవిదా ఘనకఠిన ప్రకృతికయో, తనదుబిడ్డయందు నేని దయ యెటు లొదవున్.

అటు లవుటవలన దీనినె యభ్యర్థించుచున్నాను. [అశోకశాఖం గూర్చి]

మ. చెలికాఁడై నయశోకమా నిజసఖున్ శీఘ్రంబుగాఁ దేర్పు మి
ల్లలనం బల్లవహస్తశీకరము లల్లల్లల్లుచుం జల్లఁగన్
వెలయంగం దనకంటెనీటి నిది మున్నీ పాదునం బోసి ని
న్నలరించెంగద ప్రత్యహంబును దయాయత్తైకచిత్తంబునన్.

[సవిషాదంబుగ,] ఏమి వినిపించుకొనకయే నిరాకరించినది యిది అహో! పలాశి కకృతజ్ఞత, [చింతించి,] సఖీ! జానకీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

సీత—[ఊఱడిల్లి,] ఎట్లు నాయొక్క నేస్తకత్తె త్రిజట యిక్కడ నున్నది?

త్రి—చెలీ! అకాలమనోహరమయిన యీ నీముఖరేఖచే నూహించుచున్నాను మనోజ్ఞమైనదాని దేనినో చూచినదాన వని.

సీత—చెలీ! ఇది యిట్లే. నే నిప్పుడు కలలో గోదావరిచే కేలఁ గైకొనఁబడిన యలతుం పురుసీవురు చేతను, వెల్లదామరయెల్లి చేతను, గొలువఁబడు నామగనిఁ గనుఁగొంటిని.

త్రి—[సహర్షంబుగ] సఖీ! వర్ధిల్లెదవు. సుస్వప్నముగద యిది ?

సీ—[నిట్టూర్చి] చెలీ! అతనియందే యంనుపఁబడిన వగపు గలదానవైన నాకుఁ గల యందు నమ్మిక యెటువంటిది?

త్రి—చెప్పుము. ఎట్లు చింతాస్వప్న మని యెన్నుచున్నావు ?

సీ—అట్లే.

త్రి—కాదు కాదు. అచుంబితముగదా యిది.

సీ—మఱి యేమి యెలపడనిది ?

త్రి—ఏది తలఁపఁబడనిదో ?

సీ—ఏది తలఁపఁబడనిదో, అదియుం నీజగమునఁ గలదుగదా ? రాముమోముచందురుం జూడసిదగుచును జనకునికూఁతురు మనుచున్నది. అందువల్ల నేల యీ నా యంసుఱ నా తెనిమిటిచే నొప్పరికింపఁబడినదానను.

రా—ప్రియురాలా ! నాచిత్తమందు నున్నదాన వయ్యును, ఎత్తెఱఁగున నాచిత్త మెఱుఁ గని దాన వవుచున్నావు?

సీ—కావున్నఁ, ఏమని జేసికంటి బొమిడికపుఁ జందమామయందుఁ గందు సెలకొలుపుదు? ఇప్పటికిని నా పెనిమిటి నాజాడ నెఱుఁగకున్నాఁ డని తలఁచుచున్నాను.

రా—ప్రియురాలా! ఇపుడు బాగుగ నాలోచించుచున్నావు.

సీ—క. మొరసెడు నందియయేనిన్, దొర కెఱిఁగించదు నను మఱిదొలఁగ న్దానే
పౌరసెనొ మూఁగతనం బది, యొరుల ననఁగ నేల దయ్యమొత్తిడి యిడఁగన్.

[తెరలో] ఓ లంకావాసులారా! సావధానుల రగుచుఁ జక్కఁగా నుండుండు.

క. ఎవఁడో వీఁ డొకకీశ ప్రవరుండు మహాబలుండు ప్రాకారంబున్
నవలీల దాఁటి లంకం, బ్రవేశముం జేసె మోఁతఁ బడనిపిడుగనన్.

[ఇరువురు వెఱపు నటించుచున్నారు.]

[తెరలో మఱియును.] ఓరోరి లంకావాసులారా! చాలుం ద్రాసము చేతను. రాక్షస రాజకుమారుఁ డక్షుఁడు వీఁ డలికుపితుఁ డగుచుఁ దానే తదభిముఖముగ ముఖరథను ర్ధరుం డగుచు నరుగుచున్నాఁడు.

సీ.—[సత్రాసంబుగ] చెలీ! మఱియుం నేల యీయశోకవనము వణఁకుచున్నది!

త్రి—[సవితర్కంబుగ,]

ఉ. వెన్నెల యెచ్చనెచ్చ వెడవిల్తునియేపున కోపఁజాల కా
పన్నుఁడుత్యక్తలజ్జుఁ డయివచ్చెడు రావణుఁ డమ్మచెల్లనిన్
పన్నతసూర్యవంశసతి సాధ్విని రామనిషణ్ణమానసన్
దిన్నఁగ బుజ్జగించి మది నెక్కొలుప న్విపినాభిముఖ్యుఁడై.

[అంతట రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సీ—[వెఱపుతోఁ బెడమో మిడుకొని కూర్చున్నది.]

రావ—ఓసీ! సీతా!

శా. ప్రద్యుమ్నజ్వరవేదనాపరిపతద్బాష్పస్రుతిక్షాళ్యమా
ణద్యుస్త్రీకుచకుంభకుంకుమరజోన్యస్తాపరాధోజ్జ్వలం
బుద్యద్దిగ్గజదంతిదంతశిఖరప్రోల్లేఖవిఖ్యాపిత
ప్రద్యోతోరుజగజ్జయం బిదియె నావక్షంబు నిన్గోరెడున్.

సీ.—[వినమిచేత]మఱియును రామచంద్రుని మోముచందురునిచే నాకన్దోయినిఁ జల్లఁజేయఁగలనఁటే?

త్రి—[జానకింగుఱించి జనాంతికంబుగ] ఓసీతా! ఈప్రకారముగాఁ బ్రలాపించుచున్న వాని లంకానాథునిని వాడుచే నందాఁక నాదరింపవే.

రా—ఓత్రిజటా! ప్రలాపించుచున్నవాని నని వచించితివి. బాగు.

రావ—ఉ. సఖులకుఁగొనంగ మున్ను మఱినాతల లుద్భవమొంది మ్రొక్క నక్కఱిమెడవానికేని నతికైదళమం బెది వంగ దద్ది నా
సఖితల యిద్ది మ్రొక్కుచును నీకమలాంఘ్రుల కోసి జానకీ
కొఱలఁగనిన్నుఁగోరుఁ గదుఁ గూర్మిని గొప్పతనంబుఁగాంచవే.

సీ—[సంస్కృతము నాశ్రయించి,]

శ్లో. నిజే పాణౌ కృత్వా వకుళలతికా బాలముకుళం
యయో శ్చక్రే గుంజన్మధుపమవతంసం రఘుపతిః
అపీ మాకర్ణామే వచనమిదమాకర్ణ్య నకథం
విశీర్ణాయుక్తం వాం చరితమిదమంతః కుటిలయోః.

చ. మును దనచేత గుంజదళిపుంజలసద్వకుళోరుకుట్మలం
బునిచె వతంసమై తగభృగూద్వహజైత్రుఁడు వేనియం దవే
వినియును నాదువీను లిట వీనిదురుక్తిని వీఁల వేల యె
ప్పునుగుటిలాంతరంగముల పుట్టుచరిత్రమి దౌను యుక్తమే.

రావ—ఓవైదేహీ! విలోకనమాత్రమునసైన నంతపఱకు నన్ను సంభావింపవే.

సీ—తే. అపుడు నినుఁ గాంచులంకేశు నవనితనయ

రావ—[సహర్షంబుగ] వే ఱెదో కాల మేఁటికి వేఁడె దీవు
దానిఁ దెలుపుము వీఁ డెడియేనిఁజేయు

వసంతతిలకవృత్తము.

మందోదరిన్సతిని మానునురాజ్య మన్నన్, బొందించు నీదుపదమున్ బరమాదరానన్
జంద్రాననా బహువచస్సు లిఁకేల నీకై, చెందుం దశాననుఁడు స్వీయశిరస్కహానిన్.

సీత—చెలఁగునేని ఖద్యోతరుచిని జలజిని.

రావ—[సక్రోధంబుగ] హా! దోసకారీ! ప్రొద్దు మెఱుఁగుడుఁబురుగులకు నెంత యంత రువో, యంత యంతరమా రామ రావణులకు? [కత్తి దూసికొని] కావున నీ విపుడు చంపఁబడుదువు.

రా—[సకరుణంబుగ]

శా. హా సీతా యిపు డేక్రియ న్మనెదవే యయ్యో యయో యయ్యయో!
[సగర్హంబుగ]
ఛీ సీ దయ్యము నీదుచేత పొరిదుశ్చింత్యంబు క్రూరంబు
[సక్రోధంబుగ]
రా, కాసీపాపుఁడ యోతులాధముఁడ నిక్కంబోకు నేఁ డ్రుంతు నిన్

[ససంభ్రమంబుగ]

హాసౌమిత్రి యొసంగు విల్విలు మదీయంబీయ దే దిప్పహా.

ల—ఇది యింద్రజాలభ్రాంతి చేత.

రావ—ఈచంద్రహాసాసి సామాన్యముగాదు. మహోగ్రకరవాలము. కాలవ్యాళము. కావున నీవడిగెనే వడినే నీవు రావణభుజాశ్లేషభేషజమును గ్రహింపుము.

సీ—శా. ఓరీరాక్షస మానుమాను ముఱికీరోజంగడుం బ్రేలెదే
మారా నాదగుకంఠసీమ నెవఁడే నంటం దొరుం డెప్పుడున్
శ్రీరామోరుభుజాసితోత్పల సుమశ్రీధామదామంబునన్
గ్రూరాత్ముండగు నీకృపాణమున నేఁ గోల్పోందు మందేటికిన్.

[చంద్రహాసముంగూర్చి]

తే. చంద్రహాసమ శ్రీరామచంద్ర విరహ, హరిభవాస్మత్తపూత్తాపమార్పు మీవు
కాంతిజితశుక్తిభవమార్జకమవుదాల్తు, ధారచేతను శీతలవారి నార.

రావ—ఇఁకఁ గాలక్షేప మేల? అందువల్ల దీని కుత్తుక నెత్తుటిచేతఁ గాళికను దృప్తినొందింతును.

రా—అహాహా!

శా. కఱచుం గట్టడిసైంహికేయుఁడు శశిం గ్రౌర్యంబునం గోఱలన్
నెఱమంటన్ దవవహ్ని గాల్చెడును జన్నెగంధపుం జెట్టునున్
మొఱకౌపీఱిఁడి త్రెంచు నుత్పలసరంబు న్సౌరభోపేతమున్
బెఱుకుంబద్మిని మత్తహస్తి పరహానిం జేయు దుష్టుం డహా.

రావ—[వాలంకించుచు,] ఎవఁడు? ఎవఁడురా యిక్కడ? నాచేతియందుఁ గపాలపాత్ర మిడవలయును. దేన దీని కత్తుక నెత్తురు గోరుచున్నానో? [అని, అశోకవిటపివిటపంబునం గేలుసాచుచున్నాఁడు.]

రా—చ. కువలయదామశోభ నిదిగో విచరించుఁ గృపాణ మియ్యలా
భవగళమందు నిందునను బ్రబ్బెడుఁ జీఁకటి నల్లఁ జాడఁ గాఁ
దవదను కైవడిన్ జలధిఁ దాను మునింగి యుగంబు సర్వమున్
నవ చెడి దిర్దిరం దిరుగు సంస్మృతిదప్పెడు నిప్డు నాకహా.

రావ—[విలోకించి, చమత్కారంబుగ] ఆహా! ఎట్టిది యెవనిదో శస్త్రచ్ఛిన్నమయిన తలయే నాయఱచేత నిడఁబడినది. [సవితర్కంబుగ] మఱి యిది యెవని దవును!

[నిరూపించి] అయ్యో ! చచ్చితి. ఇది యక్షకుమారునియొక్క శిరస్సుగదా ! హృదయమున నునిచికొని,] హా ! వత్సా ! [అని మూర్ఛిల్లి పడుచున్నాఁడు.]

త్రి—దేవా ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

రా—[ఊఱడిలి,] ఎవని కిటు లిది వెండియుఁ గావలసినది ? [మిగుల వగచి] సరే ! ఆదుండగపు మల్లునకు. అందువల్ల ముందుగం దానినే మ్రందింతును. [అని నిమ్మఁ మించుచున్నాఁడు.]

రా—[సహర్షంబుగ,] అహా ! విషమే యమృతత్వము నందినది.

ల—అహా ! సంవిధానవిశేషముయొక్క చమత్కారము !

త్రి—[సీతను కౌఁగిలించుకొని,] చెలీ ! పుణ్యముచే జీవించుచున్నావు.

సీ—పుణ్యము గానిదానిచే నని చెప్పందగినది.

త్రి—ఎందు కని ?

సీ—ఎట్లు మఱినాకు నపుణ్యముగాదు ! ఎందువలన, రామచంద్రు నెడబాటువలనఁ గొడమిన వేఁకినిఁ బోకడ వెట్టుటకై కోరునట్టి నేను జంద్రహాసము వాదరచేతఁ దొలఁగింపఁబడనయితినో ?

త్రి—చెలీ ! ఇట్లు చెప్ప నొప్పదు. "జీవన్ భద్రాణి పశ్యతి" "బ్రదికియుండిన సుఖములఁ బడయవచ్చు" అని, వాక్రుచ్చెదరుగద ?

సీ—దీనిచే నేమి ! ఈ నామేనిని జల్లఁగఁ జేసికొనుటకై నిప్పుం దెమ్ము.

త్రి—పాప ముపశమిల్లుత. ఇ ఏమిది యపుణ్యము నుదాహరించుచున్నావు ?

క. హిమకరరుచియుత మరకత, సుమణిమయ మనోజ్ఞపట్టసుందరముందున్
సమలయజరసమునందున్, రమణునియెదయం దణఁతు విరహతాపంబున్.

సీ—ఆసాప లిడు నీనుడికారముచే నేమి? నీ వొక నిప్పురవ్వఁ దెమ్ము. దానిచే నీచెట్టుక్రింద రాలియున్న చిగురులమంటఁబెట్టి నాకోర్కినిఁ గొనసాగించుకొందును.

త్రి—[పోయి తిరిగివచ్చి] చెచ్చెలీ ! ఇచ్చోటు చిచ్చుదొరకనిది.

రా—బాగు. త్రిజట చతురురాలు.

సీ—[అశోకమును విలోకించి, సంస్కృతముతో.]

శ్లో. కురుసకరుణంచేతః శ్రీమన్నశోకవనస్పతే
ధవాధకతికానూకాం వామేపురగప్రకటీకురు,

వనువిరహిణాం సంతాపాయస్ఫుటీ కురుతేభవాన్
నవకిసలయశ్రేణీ వ్యాజాత్కృశానుశిఖావళిమ్.

ఉ. శ్రీమదశోకమా కరుణఁజెందినదానిఁగఁ జేయుచేతముల్
నామునుముందటన్ శిఖకణంబొకఁడేనియుఁనంపు మింపుగన్
బ్రామిడివెల్లడింతుగదపల్లవపాళికెపంబునం బొరిన్
భీమమహాగ్నికీలతతివేఁగవియోగిను లెల్ల మల్లడిన్.

ఇప్పుడీ ప్రాఁకుయొక్క శోష్మ యను చేలిచేత నిప్పుతునుక యిడఁబడియెడి.

రా—[సవిషాదంబుగ.]

తే. అయ్యొయయ్యొ యశోకమిదయ్యునయ్యెఁ
గా సశోకంబు నాదుభాగ్యంబుకతన

ల—చాలుఁజాలు భీతిచేత. ఇది తలఁపఁ దగనిదిగద? చెట్టింగలము నొసంగుచున్నదఁట ఇది యెట్టిమాట?

రా— రామవిధివైధురియు నఁట యేమి యూహ
సేయఁగా నీదుదైవము చెయిదికడిఁది.

సీ—[ముందు పోయి కైకొనఁ గోరుచున్నది.]

రా—చ. హరిహరికంజకోమలము కైకనరారెడు సీతచేలిలో
స్ఫురదరుణోత్పలంబు దగుమొగ్గ యనంగ నొసంగుటొప్ప నీ
కరయఁగ సచ్చరిత్రమది యబ్బెడు నేక్రియఁగృష్ణవర్ష్మనా
ధరణిఁబ్రసిద్ధిఁజెందితికదా సకలాశనయాత్రయాతుఁడా.

సీ—[చేతఁ దాఁకి సవిషాదంబుగ] అక్కటా! నాయొక్క యపుణ్యపరిణామము! దాననే యగ్గియుం జల్లఁగానయ్యె. అయ్యో! ఇయ్యది యింగలపుఁ దునుకగాదు. మఱి మానికమా?

త్రి—ఎట్టు భాగ్యవంతుల కగ్నియుఁను రత్నమగుచున్నదన్న ప్రవాదము సత్యమే యయ్యెను?

సీ—[కైకొని,] ఓసీ! ఇది, స్వామియైన రామభద్రుని ముద్రిక. [దానిగుఱించి కన్నీరు నించి సంస్కృతములో.]

శ్లో. యాత్రైకవాదధిమనోరమ రామచంద్ర
హస్తాంగుళిప్రణయినీ సుభగా సువృత్తా,

అక్ష్యేవసా జనకరాజసుతా కథన్ను
లంకాముపాగతవతీ మణిముద్రికేత్వమ్.

ఆ. చిన్ననాఁటనుండి శ్రీరామచంద్రుని
కేలిప్రేలుపట్టి క్రాలె దీవు
వేయు సీత యనఁగ వినుతవై ట్లీలంకఁ
బొందినావు రత్నముద్రికయహ.

[మఱియుం గరాంగుళికిసలయముచే లాలించుచు]

ఓసీ! రతనపు ముద్దుటుంగరమా! కుశలమా, లక్ష్మణునితోడఁ గూడుకొనియుండు శ్రీరామచరణములకు?

హనుమంతుఁడు—[తెరచీరఁ దొలఁగఁ దీసికొని ప్రవేశించి,] కుశలము. దేవీ! కుశలము.

సీ—అమృతముఖా! ఎవఁడవు నీవు?

మ. విను తారాపతి కేను సేవకుఁడ భావింపంగ శ్రీరామభ
ద్రునికి న్దూతను బ్రాణదేవునికిఁ బుత్రుండన్ హనూమంతుఁ డం
డ్రు నను న్లోకులు నిన్నుఁ జెందు దశకంఠుం డేగుదేరంగఁ ద
ఘ్ను హాసంబునఁ దత్సుతాక్షశిరముం దార్కొల్పితిం డిన్నఁగన్.

రా—ఆహా! ఎట్టిది హనుమన్నామధేయము నా భాగధేయముయొక్క చెల్వు!

ల—ఆహా! సంవిధానముయొక్క చమత్కారము!

సీ—ఓయి భద్రముఖా! మఱి యేతఁడీ తారాపతి?

హ—తే. శౌర్యనిధియైనవాలికి శాత్రవుండు
లోకబాంధవుఁడైనసూర్యునికి సుతుఁడు
రామపాదాబ్జములకు వరానువర్తి
సమలిసుగ్రీవుఁడను కపిచక్రవర్తి.

సీ—మఱి యెవనిచేత మానుసులకుఁ గోఁతులకు నిటువంటి చెలిమి కావింపఁబడినది?

హ—రామబాణముచేతనే.

తే. వాలి కిడఁబడె స్వర్లోకబహుళవైభ
వంబు మొదటను బిమ్మట వాలిదైన
తారతోడుతఁ దన్మహోదారరత్న
మకుట మర్పిత మితనికి మహితచరిత.

సీ—మందభాగ్యురాలనైన నానిమిత్తమునం దుర్బలుఁడై నాఁడా యేమి యిప్పుడు రఘునాథుఁడు ? అదంతయుం జెప్పుము.

హ—అది యేమన నేమని చెప్పుదును ? ఇప్పుడే.

క. ఒగి బహుళపక్షశశివలె, రఘునాథుఁడు కృశతఁ గాంచుఁ బ్రతిదినమందున్

సీ—అయ్యో ! అయ్యో !

హ— తగునని కువలయదృష్టి, యనఘాత్మునమభావము క్రియనెఱిఁ దెలుపుగన్.

సీ—ఇపుడే మో తేలుకొనుచున్నాను.

హ—ఓదేవి ! దేవునిచేత నీకుఁ దెలుపు మని పంపఁబడిన సందేశమంతయుం వినుము.

చ. అమృతకరుండు చండకరుఁ డంబుధరుండు దవానలుండు స
ద్విమలసరిత్సమీరణము భీమఫణిశ్వసనానిలంబు గా
నమరెడువల్లి బల్లెముగ నాఁ గువలాటవి యీఁటెకూటువో
సుముఖిరో నీవియోగమునఁ జొప్పడె నాకు జగంబు వింతగన్.

మఱియును,

చ. ఎవనికిఁ జెప్పి యిప్పాలము నే నెడఁబాయుదు నెంజెలిం జెలీ
యెవఁ డెఱుఁగఁగలండు మనయిద్దఱయొద్దిక చెల్మి బల్మిఁదా
నవ నెఱుఁగున్న దాత్మయె యగా నిను నంటియె యుంట నీమనం
బవ్వఁగదె నామనంబుపలె నక్కట యొక్కెద నేసు సేయుదున్.

సీ—[సిగ్గు నభినయించుచున్నది.]

త్రి—సఖీ ! నీవును రఘుపతికి నేదేని సందేశమును గుఱుతును అందింపుము.

సీ—ఇదే నాప్రతిసందేశము. వారక కారుచున్న కన్నీటి సెలయేటిచేఁ గలిగిన దయ్యను నాచూడ్కి నీయొక్క నెమ్మొగమ్ము నోయఁగ మ్మను నీ రానఁగోరుచున్నది. [చూడామణిఁ దీసికొని హనుమంతుని చేతియందు నిడుచున్నది.] ఓతలమానికమా !

క. రక్కసునిచూడ్కి దగులుట, మిక్కిలిమఱికియయినట్టి మేనిఁ గడిగికొ
మ్మక్కఱరాముని వయి తగు, చక్కనికాల్గొనిడాలు జక్కరనీటన్.

హ—దేవీ ! సెలవిమ్ము. రామచంద్రచరణ సందర్శనోత్కంఠ నన్నుం ద్వరపెట్టుచున్నది.

సీ—[కన్నీటితోఁ దను, డగ్గుత్తికతోను.] ఓయీ ! నెపములేని యనుఁగువగు నీవు పోవ, మఱియును నాకు నెవఁడు తెలుపఁగలఁడు రాఘవుని సుద్ది ?

హ—దేవేరీ ! దైవముచే సంస్మృతిఁ జెందినవాఁడనైతిని. దేవునిచేత దేవికి సందిష్ట మయ్యెఁ గద !

వసంతతిలకావృత్తము.

చింతిల్ల కుల్లసిలు సీతరొ మత్ప్రవృత్తిన్
సంతోష మొందఁగను జక్కఁగఁ దెల్పు నీకున్
స్వాంతాప్తలక్ష్మణునిద్వ్యసనము ల్పురద్వి
ట్కాంతాళియేడ్పులును గ్రందుగఁ గల్గితోడ్తోన్.

[తెరలో,] ఆ. ఎట్లొ రాజపుత్రు హింసించి యక్షుని
వానరాపశదుఁడ వాఁడె దటకు
నిన్ను మన్నిగొనఁగ నెన్నురావణునాజ్ఞ
నింద్రజిత్తు కార్ముకేంద్ర మూని.

హ—దేవేరీ! కృతకృత్యుఁడనైతిని. ఇఁక నన్ను దాఁచుకొనక ప్రకటించుకొనియెదను. కావున నిదిగో నమస్కరించుచున్నాను. సెలవు దీసికొనుచున్నాను.

సీ—ఓయీ! ఊర్పువేల్పుకొడుకా! బడలికలేకయే యీచెడురాకాసిస్సంద్రముం దాటుము.

హ—దేవియొక్క యీప్రసాద మాదలఁ దాల్చుచున్నాను. [అని నిష్క్రమించుచున్నాఁడు.]

సీ—చెలీ! ముజ్జడా! నింగిద్రిమ్మరివై వీనినడవడియంతయుం గనుంగొనుము.

త్రి—ఇట్లగుఁగాక. [అని నిష్క్రమించెను.]

[తెరలో,]

శా. వీరుం డీతఁడు మేఘనాదప్రహితస్ఫీతాస్త్రముల్ మ్రింగెడున్

[అందఱును హర్షమును బ్రకటీకరించుచున్నారు.]

[మఱి తెరలో]

ఘోరేంద్రారికిఁ జిక్కి బద్ధుఁడయియుండుం దోఁకఁ గాల్పంబడెన్

[అందఱు న్విషాదమును వ్యక్తీకరించుచున్నారు.]

[మఱియుఁ దెరలో,]

భూరిజ్వాలలచేతఁ గాల్చు నహహా పాల్పేదఁగా లంక వీడు

[అందఱు హర్షవిషాదముల నభినయించుచున్నారు.]

[మఱియును దెరలో,]

ఔరా సీఁ దలయందు వార్ధిజలమం దార్చెన్ స్వవాలాగ్నినిన్.

[అందఱును మహానంద మొందుచున్నారు.]

[మఱిం దెరలో]

ఆహా! ఆహా! ఆహాహా! ఆశ్చర్యమాశ్చర్యము!!!

మ. పొదపుంగుబ్బలినుండి సూర్యుఁడు నభంబుం దాఁటున ట్లిప్పుడి
క్కడ వేలాగమునుండి దాఁటెడు నహా గంభీరమంభోనిధిన్
గడువేగంబునఁ బుట్టు గాలివలనం గాండంబు లిట్టట్టువో
నడుచక్కిం గనుపట్టుఁ బాపదొర యెన్నం బొల్చు సామీరియున్.

సీ—[తెరవంకఁ జూచి] చెలీ! త్రిజటా! పుడమిని డిగితివి. కాన మేలు దలపుదాన
వైన నీమేనిం గౌఁగిలించుకొందున్నాను. [అని, నిష్క్రమించెను.]

రా—ప్రియురాలా! నన్నుం దిలకింపుమీ.

ల—ఏమిది? లంకావృత్తాంతము ననుకరించినదియై విద్యాధరవిరచితమైన మహేంద్ర
జాలమునందు, మఱిమఱి భ్రమించుచున్నావు.

రా—భాగ్యముచేత మనచేత స్వవిక్రమ కథన విముఖుండయిన హనుమంతుని చరిత్ర
రహస్య మెఱుఁగఁబడినది.

[తెరలో] ఓరఘునాథా! ఇతఁడుసుమీ,

తే. అతిమదోద్ధతు దశకంఠు నదలఁ జేసి
మధువనంబున బహుఫలమధువు లాని
వచ్చుచున్నాఁడు త్వత్పదపద్మములను
గనఁగ నంగదముఖులతో మనహనుమయు.

రా—వింటివా? అబ్బాయీ! లక్ష్మణా! కావున నీవు రమ్ము. కృతకృత్యుఁడయిన హను
మంతుని నెదుర్కొందము.

[అని యందఱు నిష్క్రమించుచున్నారు.]

ఇది, ఆంధ్రీకృత ప్రసన్నరాఘవ నాటకమునందు, షష్ఠాంకము.

# ఆంధ్ర ప్రసన్నరాఘవ నాటకము

## స ప్త మాం క ము

[అంతఁ బులస్త్యశిష్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

[చుట్టుఁజూచి] సన్నివేశమరయనివాఁడనైతిని. అతనియి ల్లెదియని యెవని నడుగుదును? [వెండియుఁ విలోకించి] వీఁడేల లంకేశమాతామహుఁడును, మహామంత్రియునగు మాల్యవంతుని పరిచారకుఁడు కరాళకుఁ డీడనే యున్నాఁడు? [బిగ్గరగా,] సఖుఁడా! కరాళకుఁడా! [ఇటఁ బ్రవేశించి,]

**కరాళకుఁడు**—మునీ! నమస్కరించుచున్నాను.

**ముని**—ఇష్టసిద్ధిఁ జెందుము. విభీషణభవనమును నాకుఁ దెలుపుము.

**కరా**—అందేమి?

**ముని**—ఏదో యొకసందేశము విభీషణుని కందింప భగవంతుఁడైన పులస్త్యునిచే నేనాజ్ఞాపింపఁబడినాను.

**కరా**—ఇప్పు డిక్కడ విభీషణుఁడు లేఁడు.

**ముని**—ఎందువల్ల?

**కరా**—ఒకప్పుడు మ్రొక్కుచున్న విభీషణునియొక్క చేతినుండి, వ్రాయఁబడిన యొక పత్రమును లంకేశ్వరుఁడు సకౌతుకంబుగాఁ గైకొని వినోదంబుగాఁ జదివెను.

తే. అభ్యుదయసిద్ధిఁ దమకొప్పు నర్థిఁ గోరు
సుజను లనురాగమున నెందుఁ జూడరుగద
చవితినాఁటి శశాంకలేఖవలెఁ దలఁచి
పరసతీఫాలపట్టికఁ బరఁగినఁ గడు.

**ముని**—ఆహా! ప్రభువగు విభీషణునియొక్క విజ్ఞాపనాచాతురి. తరువాతఁ దర్వాత.

**కరా**—అటుపిమ్మట లంకేశ్వరునిచేత సహాసంబుగఁ జెప్పఁబడియెను. సరే, ఎవఁడో యొక పిఱికివాఁడు చెప్పిన దిది. ఇది ప్రసిద్ధమేగదా?

ఆ. కొఱలు పరవనితల కుచకుంభములయందు
ఘోరవైరి కుంభికుంభములను
బడవు రక్తిశక్తిఁ బరమభీరువు లవి
దృష్టులును బృషత్కపృష్టులు మఱి.

ముని—అహా ! లోకముయొక్క నిజచిత్తవృత్తి భూమికానుసారములు వాక్చిత్రములు ! తరువాత.

కరా—అంతట, సప్రణయకోపవిహాసుం డగుచు విభీషణుండు లంకేశ్వరునికిఁ జెప్పుచున్నాఁడు.

చ. శివునిశిఖాస్రజం బయిన సింధువును న్నిరసించులీలమై
సెవడినకీర్తి యెవ్వనిదియే కడుగుం డెస లన్ని గోడలన్
దవిలితి వట్టివాఁడ వెటు ధాత్రితనూభవమై నయో యిదే
యవును బులస్త్యసంతతి యశోబ్జునికిం దగనట్టి కం దిఁకన్.

ముని—విస్మటఁ బిస్మట.

కరా—విస్మట.

తే. రోషభీషణపాటలలోలదృష్టి, గర్వమున నెత్తఁబడినట్టి ఖడ్గముష్టిఁ
బొనరురావణుచే వంశభూషణుండు, బెగడ కెదఁ దన్నఁబడెను విభీషణుండు.

ముని—[విహసించి,]

తే. అరయఁ గ్రోధాంధుఁడైన దశాస్యుచేత, సనయకవచుం డయిన విభీషణుఁడు గాఁడు
పాదతాడితుఁ డాత్మీయభద్రమూర్తి, తన్నఁబడె నంచుఁ దలఁచుట దగును మిగుల.

అది చెప్పుము. మఱి యిప్పుడు విభీషణుఁ డెక్కడ నున్నాఁడు ?

కరా—సరే. రామునినే యాశ్రయించి యున్నాఁడు.

ముని—[తనలో] ఐనన్, పులస్త్యసందేశరహస్యమును విభీషణుఁడు ముందే యనుష్ఠించె.
[ప్రకాశముగ] మఱి యిపుడు నీ వేమి యొనరించుటకుఁ బ్రయత్నించుచున్నావు ?

కరా—జానకీవిరహవిహ్వలుండగు లంకానాథుని మనోవినోదముకొఱకు నెవఁడో యొక చిత్రకారుఁడు రచియించినది యీ చిత్రపటము తద్గోచరముగాఁ గావింప సమర్థుఁ డగు నొకానొకనిచేత నియ్యవలసిన దిచ్చిత్రపట మని, మాల్యవంతునిచే నాజ్ఞాపింపఁ బడితిని.

ముని—[సకౌతుకంబుగ] శత్రువు సమీపించియుండ, మహామంత్రియగు మాల్యవంతుని దిదట్టిదియుపచారము ! సరే. ప్రకృతోచితమే. ఇది యేదో కాఁగలదు. [తెరలో]

శా. ఓరీ నూఱుము చంద్రమశ్శిలపయిన్ బ్రోత్సాహివై చందనం
బోరీ కూర్పుము చామరంబుఁ గడు నే ర్పొప్పంగఁ జంద్రాంశులన్
సారోదారమృణాళతంతుతతిచే జానొందఁ బద్మచ్ఛద
స్ఫారాబ్బిందువులన్ రచింపు సుమణిస్రగ్వర్యమోరీ వెసన్.

ముని—[సోపహాసంబుగ, తనలో] లంకేశ్వరున కీశీతోపచారము కర్కశముగాఁ గాఁదల

దని శంకించుచున్నాను. విరహసంతప్తుఁడైన లంకేశ్వరునికి శీతోపచారార్థముగా నిశా
చరు లేల నియోగింపఁబడుచున్నారు ?

కరా—ఖేచరులును. ఇప్పుడు గదా !

మ. అమృతాంశుండు కరంబులం బులిమెదుర్ హర్షంబుగం గంధముం
గొమరొందంగను దాళవృంతకలనం గూర్చు న్వసంతానిలుం
డమరం గంజదళాళిఁ దల్పమును నొయ్యం జల్పునద్దేవుఁ డీ
క్రమమారం గొలువంబడు న్సురలచే లంకేశ్వరుం డివ్వడిన్.

ముని—ఔరా ! వదరుఁబోతులయొక్క వాగాడంబరసారస్యము !

కరా—[తెరదిక్కు జూచి,] ప్రహస్తుఁ డేల రాజద్వారమును జేరుచున్నాఁడు ? అందు
వలనం జిత్రపట మీతనిచేతి కిత్తును. నీవును పొమ్ము. [అని నిష్క్రాంతులైరి.]

ఇద్ది శుద్ధవిష్కంభము.

---

[అంతట రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు. చిత్రపటహస్తుఁడయిన ప్రహస్తుఁడును.]

రావ—[తనలో]

తే. అకట రాజల్లలాటఫలకసుముఖర, కాంచికాగుణకేశపక్షయుం నగుచును
మారనారాచయష్టి నామానసమునఁ, దూఱినది యది నేఁ జేయుందు నిఁక నేమి ?
[విమర్శించి,] అహా ! ఎట్లిపుడు మలినవేషమును బొందినదయ్యును, జనస్థానమందు
నున్నదానివలె జానకిని సముంచితరూపఁగానే కాంచుచున్నాను ?
[విమర్శించి,] కానిదేనియుం,

ఆ. మ్రింగి యొల్లరుచుల మించిమించినయిన, కాంతు లెంతయేని గ్రమ్మియున్న
జానుమీఱుకున్నె శశిలేఖ ధూసర, యయ్యు వేడ్కఁజూడ్కి నాఁచికొనదె.

ప్రహస్తుఁడు—[చిత్రపటమును విప్పి] దేవా ! ఈ చిత్రపటమును వినోదార్థముగా
విలోకింపుము.

రావ—ఏ మిందు వ్రాయఁబడినది ?

ప్ర—ఇంతవఱ కిది, తిమితిమింగిల వాలాహతి కుపిత సలిలకలభ కోలాహ లోన్నిద్రము
సముద్రము.

రావ—ఇది యేమి ? రత్నాకరమున కుత్తరమున తాపించపండాఖండలధనుస్సహస్రము
ననుసరించి, గగనమును గపిశముగఁ గావించుచున్నది ?

ప్ర—ఇది, యాసుగ్రీవపాలితము కపిబలము.

రావ—[నవ్వి,] ఓయి ! వాలిపాలిత మని వాకొనఁదగినది. దీన నేమి గాఁగలదు? మఱి
ప్రకృతి లలితులైన యీయిరువు రెవరు జడదారులు ?

ప్ర—ఈయిరువు రారామలక్ష్మణులు. ఈయిర్వురలో నగ్రజునిచేత సుగ్రీవాధీనముగా నొనరింపఁబడినది వానరబలము.

రావ—[వినకయే] ఓయీ! వీఁ డేఁడు, చిలుకుటచేఁ గలిగిన యలలచాలుచే దవ్వుగఁ ద్రోయఁబడి కపర్దికపర్దారోహ కుతూహలుండగు చందురునిచందంబున మిక్కిలి చిక్కినమేను గలిగినవాఁ డగుచుఁ దీరముచేరువ నత్తి యత్తమిల్లియున్నాఁడు?

ప్ర—వీఁడు దర్భశయనుండు, లంకాగమనకౌతుకి, నిజకులగురుని సాగరుని నుపచరించుచున్నాఁడు రాముఁడు.

రావ—ఎట్లు వీఁ డీవిధమున నే, జానకీలాభకౌతుకి, నన్నును నుపచరింపఁగలఁడు?

ప్ర—ఈకడ విలోకింపవలయు. వీఁడు, క్రుద్ధరాఘవకోదండ ముక్త కాండ పాత కాతర తరళ తిమి మకర పరివారుండు పారావారుండు.

రావ—ఓయీ! వీరు వీరిరువురు కృతాంజలులు వానరభటులచేత సాదరంబుగ బెద్దముని యొద్దికిఁ గొనిపోఁబడుచున్నారు?

ప్ర—వీఁ డింతవఱకు సముద్రుఁడు. ఇతఁడో, దేవరయొక్క తమ్ముఁడు, [అని యర్ధోక్తి చెప్పఁబడఁగ,] బాంధవవిరోధియైన వీనియొక్క పేరు వక్కాణింప నేల? [అని, మిన్నకున్నాఁడు.]

రావ—వీఁ డేమి విభీషణుఁడా? నావిరోధముచే రాము నాశ్రయించుచున్నాఁడు. కానీ!

క. సకలనిశాచరమాళి, ప్రకటమణిప్రపూజితాంఘ్రిపద్ముండగు నే
నిఁక రావణసందర్శన, మకుటిలముగఁ జేయ నర్హుఁ డగునే వీఁడున్.

ప్ర—[స్వగతంబుగ] ఇది సత్యమే.

రావ—[సకౌతుకంబుగ] మఱి యిది యేమి యక్షరావళిద్వంద్వము?

ప్ర—సముద్రవిభీషణులంగూర్చి లక్ష్మణునియొక్క వాక్యద్వయ మిదిగద.

రావ—ఇందొకటి చదువుము.

ప్ర—[చదువుచున్నాఁడు.]

మ. విడుమీ త్రాసము నోసముద్రుఁడ కడున్ వేరాము క్రోధాగ్నిద్రా
వెడుబందీకృతదేవసుందరుల వై వెంపొందుకన్నీళ్ల నే
యడరు న్నీమకరీగణం బితనివౌ నమ్ము ల్దశాస్యాంగనా
జ్జ్వలగండస్థలపత్త్రభంగమకరీసంహారమే చేసెదున్.

రావ—అన్యముం జదువుము.

ప్ర—[చదువుచున్నాఁడు.]

మ. ఆదరం జేయుటచే శిరోనతిని రక్షాపేక్షచేఁ జేరుటన్
గడునాన్రృణ్యముగా విభీషణుని లంకన్ రాజుగాఁ జేయం రా
ముఁ డితం డిప్పుడె యీనరేశునిభుజంబుల్ ప్రాతిభావ్యాఢ్యముల్
పుడమిన్ సూర్యజరాజ్యదంబు లిట మేము న్సాక్షులై యుందు మా.

రావ—[వినకయే] కానీ. మఱియేమిది యబ్ధిమధ్యమునఁ గానఁబడుచున్నది ?

ప్ర—శ్రీరామయశఃప్రశస్తిరచనా ప్రబంధము, సేతుబంధము.

రావ—అహా ! చిత్రకారుని చాతురి. ఎందువలన నిది యసత్యమయ్యును సత్యమువలెఁ జూపెను.

ప్ర—[స్వ] ఎట్లిపుడును స్వామి కళీకసంభావన ? [తెరయందుఁ గలకలము.]

రావ—ఓయీ ! ఇదేమి కోలాహలము ?

ప్ర—క. ఇది రామచమూచరులగు, సుదర్పకపికుంజరులది సొరిదిగ నవనీ
రదములగర్జనమువలెన్, గదిరెడుగోలాహలంబు గడుబెడిదముగన్.

అందువలన శంకింపం దగినది. మఱి మాఱుసేఁత సేయందగినది.

రావ—ఆ ! ఏమి యిట శంకితవ్యము ? ప్రతీకారము సేయఁదగినది ఇందుచేఁ గద ?

తే. కపులకోలాహలంబుచేఁ గాంచునాదు, మది ముదంబునె యెంతయుం మాననీయ
యైనమందోదరిసునూపురాప్తమణుల, శింజితముచేవలెం జాల మంజులముగ.

మందోదరి—[ప్రవేశించి,] అయ్యపుత్తునకు జేజే.

రావ—ఓసి ప్రియా ! ఇట నిట.

మం—[ముందు వచ్చి, యథోచితముగఁ గూర్చుండి,] క్రిందు చూచుచున్నది.

రావ—తే. వెలయం భుగ్నాలకము స్మితవిజితచంద్ర, లోకమాలోకమాత్రవశీకృతకువ
లయము నీమొగ మిది సురలకు నవీక్ష్య, మింతి ననుఁబోలె నూరక వంతు వేల?

ప్ర—దేవరా! వానరసేనాకలకలమును జింతించుచున్నదివోలె దేవేరి యధరీకృతముఖిగా నగుచున్న దని యెన్నుచున్నాను.

రావ—అహ ! ఇది యేమి చింతావిషయము ? ఓసి ప్రియురాలా !

రత్నావళి. ఇది యంగదభుజలసనీలాలక - యిద్ధ లసత్తారకుముదహా
సదయితచారునయనతారాపతి - సన్ముఖివానరసేనయగున్
ముదితవలెన్నా ముందట దర్పము - మొనయింపన్వలఁతిగ నెటులోఁ
గదియించుచునున్నదియైన నిటం - గందర్పునిదర్పము నాకున్.

మం—వేఱుకతమును గలదు. ఇపుడుగద, దేవరకు సకినముఁ జూడఁ గొండసిగరమున నెల కొనియుండు బోయపల్లెకు నాపనికత్తె నాచేఁ బనుపఁబడియెను. అదియు నక్కడ

నొక్క గుడిసెదండ నుండు సింగపుఁగొదమను బుజ్జగించుచున్న యొకబోయతయొక్క యీపలుకు విన్నది.

రావ—ఏమది ?

మం—క. నాగపతిపరిభవంబున, నేగాకుమఖర్వగర్వనిర్వ్యూఢుఁడ వీ
చోఁ గదిసె శరభనందనుఁ, డీగిరినికటంబునను మృగేంద్రుఁడ వినుమా.

[శ్లేష మనుసరించి, మఱి ఛాయ.]

క. నాకపతిపరిభవంబున, నేకాకుమఖర్వగర్వనిర్వ్యూఢుఁడ వీ
వీకడ దశరథనందనుఁ, డీకుధరనికటమునందు నేఁచు న్వినుమా.

రావ—ఇందిది యేమి విషాదస్థానము ? ఇది మావిషయమం దుదాసీనము.

ప్ర—దేవా ! ఇది వేఱువిధమున నెఱుఁగఁబడినదే.

రావ—ఆ ! ఇది యేమి, దశకంఠునియందును శకునవిచారగోచరత.

[తెరలో,]

శా. స్ఫారాస్ఫాలితరామలక్ష్మణధనుర్జ్యావల్లరీఝల్లరీ
ప్రారబ్ధధ్వనితప్రరూఢపులకప్రాగ్భారనీరంధ్రితుల్
స్వైరప్రోత్పతదిద్ధకీశకదళీచంచత్కృపాణాంచలో
దారస్ఫూర్జితదోర్బలైకచపలు ల్దర్పింతు రాత్రించరుల్.

రావ—ఇప్పుడు నిశాచరవిజయోత్తరము, సమరము.

[మఱియుఁ దెరలో] ఇది.

తే. రఘుపతికి మ్రోల నున్నమర్కటసువీర, సేనయొ ముసిండిపండుడా ల్నా నెఱుపగు
మొగమొనరఁ ద్రాగురాకాసిమొనలపిండు, బ్రాతరాదిత్యరుచితమోవ్రాతము నన.

రావ—ఆ ! మర్కటములచే నెట్టుత్కంఠితము ? ఎవఁడురా ఇక్కడ ?

చ. ఒనరిచి మున్విని౦ద్రుని బలోద్ధతు వీరునిఁ గుంభకర్ణునిన్
బనుపవలెన్మహాద్భుతసుభండనముం బచరింప రాముతో
ననుపవలెం జితేంద్రుని మహామహుశూరుని మేఘనాథునిన్
ఘనకదనంబు సల్పఁగను గ్రచ్చఱ లక్ష్మణుతోడఁ జెచ్చెరన్.

[తెరలో] దేవరా ! భవదభిప్రాయాభిజ్ఞుఁడైన మాల్యవన్మంత్రిచేత ముందే యిది సమకూర్పంబడియెను. ఇప్పుడు గద !

క. రామునితో దుర్ధరసం,గ్రామం బొనరించుఁ గుంభకర్ణుఁడు కడిమిన్
సౌమిత్రితోడఁ బోరెడు, ధీమంతుం డింద్రజిత్తు దివ్యులు బెగడన్.

[వెండియుఁ దెరలో]

మ. తనదంష్ట్రాశను లన్నహాకపులు కుద్ధప్రాయులే రూపఱన్
దనసారాచసువృష్టి మర్కటమహాదావాగ్ను లే యాఱఁగన్
ఘనవీరుం డగుకుంభకర్ణుఁడును మేఘధ్వానుఁడౌ నింద్రజి
త్తును దగ్దాశరథిద్వయాస్త్రశిఖియందు న్మిడ్తలై రక్కటా.

[మందోదరీరావణులు మూర్ఛిల్లిరి.]

ప్ర—దేవా ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

రావ—[ఊఱడిల్లి.] దేవీ ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

మం—[ఊఱడిల్లి,] అయ్యపుత్త్రుఁడు కాపాడవలెను. నేనెవ్వగచీఁకటి న్మునిఁగియున్నాను. కాన నన్ను లేవనెత్తవలయు నయ్యపుత్త్రుఁడు.

రావ—చాలుఁ గాతరతచేత, ఈచంద్రహాసచంద్రుఁడే నిన్ను న్నెంజెలిచీఁకటినుండి లేవనెత్తుచున్నాఁడుగా ? [కత్తి దూసికొని] నాయ దీయది గద ?

తే. ఛిన్నభిన్నంబులౌ మరుత్సింధురోరు, కుంభమాక్తికవిచకిలగుణమనోజ్ఞ
మాహవోత్కంఠితాభ్రచరాత్ములకును, జంద్రహాసముస్మీలనసన్మద మిడు.

[అని, ప్రహస్తునితోఁడఁగూడ నిష్క్రమించెను.]

మం—అందువలననే యేమో, పోరిపేరిమి యబ్బురమున నిబ్బరమయిన కనులుగలిగిన విజ్జాదరులజంట, యేమేమో మంతనమాడుచుఁ జూడఁబడియెడి. అందుచే నేదో పెనుగలని పెనుపు వెలయుచున్న దని యెన్నెద. కాననే, అయ్యపుత్త్రునకు గెలుపు గలుగ నాయిలువేల్పులఁ గొలువ నరిగెదను. [అని, నిష్క్రమించెను.]

[అంతట, విద్యాధర మిథునము ప్రవేశించుచున్నది.]

విద్యాధరుఁడు—ప్రియురాలా ! ఆలోకింపుము.

మ. రణముక్తాసువులైనరాక్షసులు వీరశ్రీయుతు ల్సాదృ్యనం
దును బెంపొందఁగ జొత్తు రంబుజమునందుం దుష్మెద ల్పంజనాఁ
గ నిఁక స్వీరలచేత భిన్నమయి యాకాశోరుకుంజంబునం
దును భిన్నంబయినట్టి తెట్టియ యనం దోఁచుం దినేడ్బింబమున్.

విద్యాధరి—ప్రియుఁడా! వీఁ డేఁడు కలను జలుపు వేడుకఁబొడమిన గగ్గురుమొగ్గలఁగల వాఁడు, పండినఋజముపిండదవివాఁడు. కొమ్మద్రిమ్మరి దండున కెదురుగ నరుగు దెంచుచున్నాఁడు ?

వి...రుఁడు—వీఁడు, బంధువధామర్షదుర్ధరుండు, దశకంధరుండు.

వి...రి—మఱి వీఁ డెవఁడు? ఇపుడు కాటుకకొండవలె నుండువాఁడు? గరుడిమానికము వంటివాఁడు, వీని కెదురుపడుచున్నాఁడు ?

వి...రుఁడు—ప్రియా ! విచిత్రజన్యశీలుఁడు, వీఁడు నీలుఁడు. మఱి యచ్చెరియముగ, చూడు చూడు.

ఆ. నీలుఁ డేసినట్టి నీలాద్రిశిఖరంబు, దవుల వక్షమునను దశముఖుండు
తలఁచుఁ దరుణి వేయఁ దనరు నీలోత్పలం, బనుచుఁ దద్బలంబు నగునె యెంచ.

[మఱి సకౌతుకంబుగ,] చూడుచూడు.

శా. నీలుం డీతఁడు పంక్తివక్త్రకరసన్నిరేభవాంకంబునన్
రోలంబంబువిధంబునం బరఁగెడున్ బోల్చన్మఱొక్కం డహో
నీలుండుం దశకంఠమౌళులపయిన్నీలాశ్మలీలాఢ్యుఁడై
పోలుంగా తిమికిం దిమింగిల మనం బుట్టెం గదుం జిట్టలున్.

వి...రి—చూడుచూడు. వీఁడెవఁడో, రాకాసిఱేని కెదురుగవచ్చుచున్నాఁడు.

వి...రుఁడు—వీఁడు స్వామిపక్షపాతి, విభీషణుఁడు. [మఱి సవిషాదంబుగ] అహాహా !

క. ఏయది విభీషణునిపై, నాయెఁ బ్రయుక్తంబుశక్తి యద్దశముఖుచే

వి...రి—పిమ్మట నేమి ?

వి...రుఁడు—ఆయది ప్రియవలె నెదపై, నోయనలక్ష్మణునిచేత నొగిఁ దాల్పఁబడెన్.

వి...రి—హా ! హాతనైతి. దైవముచేత.

వి...రుఁడు—[సవిషాదహర్షంబుగ] అయ్యో !

మ. పొరి వర్షించి మహాశుగంబులను దృప్తుండౌ దశగ్రీవుపైఁ
దరువాతం బహుశాస్త్రులంకగతసంత్యక్తాత్తసౌమిత్రిపై
పరహర్షోరుశుగాత్ములం గపులఁ దోఁపంజేసి రాముండు శ్రీ
హరి శ్యామాంగుఁడు పొల్చు వీరకరుణవ్యామిశ్రుఁడై చూడుమా.

వి...రి—[సహర్షంబుగ,] చూడుచూడు. రామునారసములగములచేఁ జీల్పఁబడు వాఁడగుచు పోవుచున్నాఁడు, పదిమొగముల రక్కసుఁడు.

[తెరలో]

తే. వత్స లక్ష్మణ యంబకాబ్జములఁ దెఱవు, మయ్య యువ్వెత్తుగ సమస్తమస్తమయ్యె
భాగ్యమర్కకులమునకు బ్రదిమి రాము,నకును నయనాంజనం బూర్మిళకును నకట.

వి...రుఁడు—సోదరశోకకాతరుఁడగు రామచంద్రుని విలాప మిది. [మఱి తెరలో] ఓ స్వామీ ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

వి...రి—ఎట్లు ప్రొద్దుకొమరునిచే రామచంద్రుఁ డూఱడింపఁబడుచున్నాఁడు? అందువల్ల నేమి యిపుడు నుడువఁగలఁడు ?

[తెరలో] చెలికాఁడా ! సుగ్రీవుఁడా ! నే నెట్లూఱడిల్లుదు ?

క. ఓరాఘవులారా యను, సారవచస్సుధను ద్రాగి సంయమితలిచే
నోరాఘవ యనుపదవిమ, మేరీతిఁ రామహతకుఁ డింకం ద్రావున్.

ఇంతేకాదు.

ఉ. మాపినతల్లికాళ్లకు నమస్కరణంబు నొనర్చునప్డు నే
నైఁపుదు నెట్లు నా కెలన జాగెడునిష్ఫలదృష్టి నయ్యయో
పాపము శాంతమాత మనవాంఛయుఁ గల్గినఁ గర్కశాత్ముఁడే
నీపినతమ్మునిం దొఱఁగి యేగఁ డయోధ్యకు రాముఁ డెప్పుడున్.

వి...రుఁడు—అహహ ! కరుణైకార్ణవము క్రమ్ముచున్నది. [ఎంతయుఁ జింతిల్లి] ఏన నేమాయె ఇక్కడ నేమో యొక్క ప్రతికార మగును. అటుగానియెడఁ బ్రతీకార మేది ? అట్లేని ? విధి విపరీతము.

వి...రి—హా ! హా ! మిగుల బెగడుఁగొలుపుపని చూడుచూడు. ఈ క్రోతియును బది తలల రక్కసునిచేఁ జేయఁబడిన సంధానము గొండసిగరముం గైకొనుచు రాముని కెదురుగ వచ్చుచున్నది.

వి...రుఁడు—చెవులు మూసికొని, పాపము శమించుత. పాపము శమించుత. వీఁడు,

తే. కడఁకమై గంధమాదనఖ్యాతమగు మ,హౌషధమహామహీధర మమరఁ దెచ్చి
చేయసౌమిత్రి నిపుడె సంజీవితునిఁగ, వచ్చుచున్నాఁడు వడి జగత్ప్రాణభవుఁడు.

వి...రి—బ్రదికితిని.

వి...రుఁడు—[సహర్షంబుగ] చూడు చూడు.

ఆ. అమ్మహౌషధులది యాగంధమునను సౌ,మిత్రి కనులఁ దెఱచె మించె మఱియుఁ
శౌర్యధుర్యుఁడగుచుఁ జక్రీకృతశరాసుఁ, డై యొనర్చురాముఁ బ్రాప్తకాము.

[వెండియుఁ సకౌతుకంబుగ,] చూడుచూడు. రాఘవానందకందళితవానరకుల కోలాహలాంకురిత క్రోధకళంకితముఖుండు రావణుండు వెండియు రామసమ్ముఖమ్ముగ వచ్చుచున్నాఁడు. కావున, సావధానముగఁ గాంచవలయును. ఈరామరావణాహవము వీర శ్రితులాధిరోహము గదా ?

వి...రి—పలువురు బల్లిదులచే గెలువఁబడిన పదితలలరాకాసితో సరిగ, నెల్లజగము లందును వాఁడిమగల మేలుబంతియైన రాగవునికి జగడపువేడుక, వాఁడిసిరికిఁ దరాజు కొక్కుట యొక్కరణి నగును ?

వి...రుఁడు—సత్యము. సకలలోకైకవీరుఁడే రాముఁడు. కానీ. ఈరావణుఁ డేమి సామాన్యుఁడా ! ఈరావణుఁడు దక్క వేఱెవఁ డిక్కయివడి నేచె ?

శా. నాకస్త్రీకుచకుంభకుంకుమలసన్నానావిధస్థాసక
శ్రీకాండంబు స్పృశింపకే చెఱుప నేర్చెన్ వాల్గలాఁడేఁ డీఁకన్
పీఁక న్వారిత దివ్యవారణశిరోనిర్యన్మణివ్యక్తహా
సైకం బెవ్వని చేత వాసవయశోహచ్చంద్రహాసం బగున్.

మఱియును.

శా. పోలం బల్కఁడు మెట్టు లీదశముఖుం బోరన్ బడన్ వజ్రఘా
తాళు ల్నవ్వేదువాఁడు వీఁ డహా విహాయస్స్వారకాసార స
ల్లీల నీవ్వనివి పాణిపద్మములు మే ల్మే లా ననంగం గడుం
కైలాసంబును జంద్రమౌళియుతముం గావించె రాయంచగాన్.

వి...రి—మఱి యె ట్లరదమున నున్నబంతి మోములరాకాసితో సరిగ నేలపై నున్న రామునికిని బెనకువ గనఁబడియెడి?

వి...రుఁడు—ప్రియురాలా! వెఱ పేల? ఇదిగో వచ్చెఁ గదా, కృతాంజలియైన మాతలి తోడఁగూడఁ బురుహూతరథము! వినయారాముఁడైన రాముచే నెక్కఁబడినది.

[తెరలో,]

శా. హేలోన్మూలితశూలిశైలములు దత్తైలాదిలోకార్తులున్
శ్రీలంకాభయదంబు లింద్రనగరస్త్రీబృందబందీకర
శ్రీలంబుల్ జనకాత్మజాకుచలసచ్ఛ్రీకుంకుమార్థంబు లే
మాలోకింతుము పంక్తికంఠజయదోర్వ్యాపారము ల్గ్రాలెడున్.

[మఱియును దెరలో,]

శా. హేలోన్మూలితశూలిచాపములు దత్తైలాదిలోకాభయ
శ్రీలున్ లంకకు భీతిదంబులును స్వస్త్రీబృందబందీహర
శ్రీలంబుల్ జనకాత్మజాకుచలసచ్ఛ్రీకుంకుమాప్తంబు లే
మాలోకింతుము రామరాజజయదోర్వ్యాపారము ల్గ్రాలెడున్.

వి...రుఁడు—తగునిది రక్షోమర్కటులయొక్క స్వస్వామి వర్ణనానుసారమును బ్రాజ్ఞజన మనోహారమునగు వ్యాహారము.

[తెరలో,]

ఓయి దశకంఠుఁడా!

తే. అకట సౌజన్యముక్తుఁడ వవుచునీవు, ఖరుఁడు మారీచుఁడును వాలి యరిగినట్టి
తొంటిదారినె యరుగంగఁ గొంటివీవా, నంధువునఁ బడుసంధానుగాంధుని వలె

వి...రుఁడు—రామ వాక్సాయకముచే హృదయమునఁ గొట్టఁబడినట్టి వాఁడు పంక్తి కంఠుఁడు సాహంకారముగ నిపు డేమి పలుకఁగలఁడో వినదము.

[తెరలో,]

చ. ఖరుఁ డన నెంత వాలి యనఁగం గపి మారిచుఁ డన్న జింక త
త్ఖరముఖజంతులం దునిమి కాంచెద వేటి కఖర్వగర్వమీ
వరయము వచ్చి పీఁ డిట దశాస్యుఁడు స్వగపురవారణౌఘముక్
వరసమరంబునం గెలిచి భాసిలు కేసరి వాసిఁ గాంచెదున్.

అటుగాకున్న ;

శా. కేలీకేసరికేసరాంచితసటాక్షిప్తోల్లసన్మంజుల
శ్రీడాచామరకోమలానిలలవశ్రీపీతఘర్మాంబువౌ
శ్రీలుం డీతఁడు పంక్తివక్త్రుఁడు జయశ్రీఁ గాంచుఁ బంచాస్యస
ల్లీలాలాపముచే నపహ్నుతయశోలిప్సుం డెవండౌ ననిన్.

వి...రుఁడు—ఏల, యీరావణ వాక్యముచే లక్ష్మణుఁడు కనలినవాఁడువోలెఁ గానఁబడుచున్నాఁడు ? కాన, నే మని పలుకఁగలఁడో ?

[తెరలో,] దశాననత్వముచే నొండెం బంచాననత్వముచే నొండె, నీ కేమి? ఇప్పుడా!

మ. మదముం బోనిడి యీవిభీషణువలె న్శ్రీరాముపాదాబ్జమం
దుఁ దగం జేరుటఁ గమ్ము తుష్మెదగ సంతోషమ్ముఁ గాం తెంక నే
నిది కర్తవ్యము గానిచో మిదుతగానే కమ్ము దుష్టాత్మ దు
ర్మదుఁడై కూలినకుంభకర్ణువలె రామస్ఫీతబాణాగ్నిలోన్.

వి...రి—ఎటు లిటీవల నదవెఱపిలేక వాలమ్ముల చిమ్మచీఁకటి న్నెఱపుచున్న పదితలరక్కసుఁడు రేమొగమువలె నగుచున్నాఁడు.

వి...రుఁడు—కాని మ్మింతట మార్గణకిరణములచే దానినే దవ్వుగఁ జోపుచున్న రామచంద్రుఁడు చంద్రునివలె నగుచున్నాఁడు. [వెండియు, సకౌతుకంబుగ] ఓసీ! అనేకాస్త్రవిద్యానిరస్తదివ్యాస్త్రుండును, నాపహేలఖండిత కోదండుండును, కుంఠితుండు నగు దశకంఠుంగుఱించి రాముఁ డేమో పలుకవేఁడువాఁడువోలెఁ గానఁబడుచున్నాఁడు.

[తెరలో]

తే. అయ్యో ఖండితమిష్వాస మనుచు వగవ, కూనరా యింక నేదేని యుఱుతరాయుధంబుఁ గడఁగుము మఱియు యుద్ధంబున కిపు, డీవు నాతోడఁ బోరాడ నెంచితేని.

వి...రి—విందు మంతయు నేమని యిపుడు నుడువునో రావణుఁడు ?

[తెరలో]

చ. ఎది తనసామసామ్యమున కెంతయుస్నేఁపక కోపమూని యే
పొదవఁగఁ ద్రావెఁ బల్మఱు స్వరుత్పలదృష్టిముఖచంద్రహాస మ
య్యది విన వేమి యియ్యెడ దశాననబాహుపటీరశానసా
స్పదఫణిచంద్రహాసము విభాజితపార్వణచంద్రహాసమున్.

వి...రుఁడు——[సకౌతుకంబుగ] సావహేలదళిత చంద్రహాసుండును, సోత్సాహసహాసుండును నైన రామచంద్రుఁ డిపు డేమి చెప్పుచున్నాఁడు ? [తెరలో] అంతలో నా రావణుఁ డిపుడు ఖేదించుచున్నాఁడా ?

వి...రి——ఇప్పు డేమి చెప్పఁగలఁడు రావణుఁడు ?

[తెరలో]

ఆ ! ఎట్టిపుడే లంకేశ్వరుఁడు ఖేదించుచున్నాఁడురా ? ఓరీ !

మ. పదియాబాహులచేతనే దశదిశల్ ప్రధ్వంసముం బొంద వే
ర్పది యా బాహులు భారమాత్రములుగా బల్పొందు రుద్రుం డగుం
గద యారాధ్యుఁడు కేశవుండు జడధిం గా గూర్కు-నెల్లప్పు నిం
కెది కర్తవ్య మటంచు నెంచుచును లంకేశుండు ఖేదించెడున్.

వి...రుఁడు——చూడు చూడు.

మ. ధనువుల్ఖడ్గము లోనుగాఁ గలుగుశస్త్రంబు ల్సెడం గ్రుద్ధుఁడై
తనర న్రావణుఁ డార రామశరకృత్తస్వీయమూర్ధంబులం
గని యుద్వృత్తుగ నింగి నొక్కటనె కైకొంచు వే ర్సేతుల
బొనరం బై కెగయించుచుం దనభుజంబు ల్సేయు సార్థంబులన్.

[మఱియుం సవిస్మయంబుగ]

చ. ఎటు లెటు రామబాణములఁ గృత్తములై యెగురుం దశాననో
ద్భటశిరము ల్నభంబున దివస్పతి దా పులకాంకురాళితో
నటు లటు లేచుఁ బెంపుగఁ బ్రహర్ష తరంగము లిందు జేని క
న్కుటిలనిశాటమూర్ధచయకుర్దనకృత్యవినోదనాదృతుల్.

వి...రి——అయ్యో! ఇపుడును రాకాసిజేనిచేఁ జెఱనిడఁబడిన వేలుపువెలఁదులఁ జూచుట నా కేల యరిదిగా నున్నది ? నఱుకఁబడినన్ వీనితలలు వెండియుఁ బొడముచున్నందుననో ?

వి...రుఁడు——విషాద మేల ? ఇందుచే రామచంద్రుఁడు కేవలము వినోదించుచున్నాఁడు. ఇపుడును గోపించినవాఁడు కాఁడు. చూడు చూడు.

ఉ. ఉల్లమున న్వసించుశివుయొక్క శిరస్సున నున్నచంద్రరే
ఖోల్లసితామృతోరుప్రవదోఘమహత్త్వముచేతఁబోలె ని
ష్ఫల్లవె రామబాణములనైనను గృత్తము లుత్తమాంగముల్
బల్లిదుఁ డౌదశాస్యునికిఁ బల్మఱు మేల్పిగిఁ గల్గుఁ బెన్దలల్.

అహో ! ఇపుడును దుర్వాసనాపిశాచి నిశాచరేశ్వరుని శివమాడించుచున్నది.

ఉ. ఈతఁడు రాముఁ డేవఱకు నేపునఁ దున్మ శిరంబుల న్దశా
స్యాతతహృద్వ్యథం జలుపఁ డావఱ కెంతయు సంతసంబునే
యీతఁడు రావణుం డెనయు హృత్సరసీరుహమందునుం ధరా
జాత నిరంతరంబుగను జక్కఁగ నెక్కొనియుంటచేఁ గదా.

[తెరలో] ఓ రామా !

క. చెండాడె దేల యీతల, పండులఁ గ్రీడావినోదపరత నిఁకే నీ
వొందుములికిచేతనె యిట, నిండింపుము మాకుఁ గోర్కె నెఱిని జగములన్.

వి...రుఁడు—సరి ! ఇత్తఱిఁ గ్రతుభుజులు త్వరపఱుచుచున్నారు. అందువల్ల రాముఁ డేమి యిప్పుడు చెప్పఁగలఁడు ?

[తెరలో] ఓభుజదండములారా !

చ. ఉడిగి యుమేశుమౌళిపయి నొప్పెడియాశశిలేఖ నొక్కటిన్
గడమ దిగీశమౌళులను గల్గినరత్నము లెల్లఁ జెండి య
క్కడిదవుమానికంబులనె కల్గి మదీయపరాక్రమంబునుం
బెడఁ గగు మ్రోఁతఁ బాడు బలుమేల్మొలనూలిని సీత దాల్చుతన్.

వి...రుఁడు—ఓయి లంకేశుఁడా ! సమయజ్ఞుఁడ వగుచున్నావు. భుజములనే నియోగించువాఁడవు గావున, ఇప్పుడు భుజమండలమే నీకుఁ బరిచారవర్గము. [చూచి, సాకూతంబుగ] ఓహో ! ఈదశకంఠవచనముచే నెట్లో జానకీజాని కుపితుఁడువోలెఁ గానఁబడుచున్నాఁడు, [వెండియు సహర్షవిషాదంబుగ,] చూడు. ౨.

ఆ. వికచకుసుమవిసరవిలసితమవుళళి, మణిమయోరుతల్పమునను లీల
నేఁడు పండె వాఁడు నేఁడు పండుఁ బుడమి, రావణుండు రామరాగదృష్టి.

వి...రి—కావున నీవడినే జనకనందిని రామచంద్రునితోఁడఁ గూడఁ గలదు.

వి...రుఁడు—సరే. ఈమెగా !

తే. తెలుచ నెఱమంటలను దెసల్వెలుఁగఁజేయుఁ, నగ్గి లోఁజొచ్చి యవనిజయహాహావచ్చె
సమధికద్యుతితో దివసముఖసమయ,మునను సిగిడెడు నినకరముకుళమువలె.

వి...రి—చూడుచూడుము. ఇతఁడు తనవారితోడఁ గూడుకొన్నవాఁ డగుచుఁ బోలి కలనికెలన నరుగుదెంచుచున్నాఁడు రామచంద్రుఁడు. [ఇపుడు దీనిని కర్ణామృతము పులోమజునకు నివేదింతముగాక! (అని నిష్క్రమింతురు).]

[అంత రాముఁడు సీతాలక్ష్మణులతో సుగ్రీవవిభీషణులతోఁ బ్రవేశించును.]

రామ—ఓయీ! ఎట్లిపుడును బోదమెడు నిశాచరసేనాసోదరంబు తిమిరనికరంబు?

విభీషణుఁడు—ఇంతటం గూడ నిగిడెడుఁగద, రామశారాచకుటుంబకంబు సుధాకరకిరణవికాసడంబరంబు?

సుగ్రీవుఁడు—ఇట్టే యిది. ఇది గదా?

ఉ. ఇందుకరాళి పాల్కడలి నేచిన పెన్నురువందుఁ దెల్లనై
యిందుశిలాంబుశీకరసమేతము నుత్పలమాలికారజో
బృందమునై చకోరముఖభిన్నసముద్భిదమై చమత్కృతిం
బొందుగఁ జూపుచుం బొదలు భూరివియోగినిగాత్రవల్లికన్.

ల—అయ్యా! చూడుము చూడుము.

ఉ. చీఁకటిగుంపు శ్రీగళుని శ్రీగళరోచిగఁ బ్రాచిఁ గ్రమ్మఁగా
శ్రీకుముదాప్తదీధితియుఁ క్షీరసముద్రపు వెల్లిగా నొగిన్
గోకచకోరకోకసుఖకోరకితగ్లపనప్రసన్నదృ
గ్లోకవిలోకితం బగుచు లోక మిదెంతయుఁ గ్రాలు లీలగన్.

రా—ఇట్టిది. ఇప్పుడు గదా!

మ. ధవళాంశుస్ఫటికాలవాలవలయద్రాగుల్లసత్కౌముదీ
ప్రవలద్వల్లివిపల్లవంబులననం బ్రాపించి యొక్కింతసే
పు వరశ్రీనిజకోరచంచుపుటకప్రోద్భిన్నకాండక్షుర
త్ప్రవరక్షీరనిరంతరప్లుత మనన్ భాసిల్లు నిల్లోకమే.

[వెండియుం సవితర్కంబుగ,] ఇప్పుడుగా!

రథోద్ధత. శంకరార్ధతను - శైలకన్యకా
కుంకుమాక్తకుచ - కోరకాకృతిన్
బొంకమా శశిమ-నోజ్ఞసూల్లస
త్పంకభూముకుళ-భంగి నంగుగన్.

[వెండియుం సహర్షంబుగ] తమ్ముఁడా! లక్ష్మణుఁడా!

పంచపాదోత్పలమాలికావృత్తము.

సోముఁడు వీఁడె యుప్పతిలుఁ జూడు వియన్మణి పాంథపాళికిన్
గామభుజంగమూర్ధమణి కామమదాపహాభీమభీమచూ

డామణి తారహారమణి డంబరశంబరవైరిసారికాం
చీమణి సచ్చకోరకులజీవనభాగ్యదభావితాప్తచిం
తామణి యంజ్జ్వలావనకనన్మణి నిన్మణి సన్మనోజ్ఞుఁడా.

ల—ఇట్లే యిది.

ఉ. చించుచుఁ గల్వమొగ్గలను జెల్వఱఁ దమ్ములమొగ్గ మొగ్గగా
వించుచుఁ గేళిహాళి నొదవించుచుఁ బాంథులఁ జాల నొంచుచుర్
బెంచుచు వెన్నెలం దెసల వెల్లఁగనే యొనరించు చద్దిఁ బొం
గించుచుఁ గోకిఁ ద్రెంచుచు మొగిం గ్రసియించు చిరు ల్వెలుంగు గ్లౌ.

సుగ్రీవుఁడు—నెయ్యుఁడా ! విభీషణుఁడా ! చూడు. ౨.

పృథ్వి. స్థిరాంశునఖరత్రుట-త్తిమిరకుంభికుంభస్థలో
చ్ఛలత్తరళతారకా-చ్ఛలవికీర్ణముక్తౌఘమై
పురందరహరిద్దరీ-స్ఫురితగర్భసుప్తోత్థమై
కురంగధరసింహ మే-గును వియద్వనీవాటినే.

విభీ—[విలోకించి, నిర్వర్ణించి,]

చ. హరిహయదిక్పటీరరసహారిసుపత్రముగా సుమాస్త్రపాం
డరవిజయాతపత్రముగ నాకరమాసతిదంతపత్రమై
హరిణసహస్రపత్రముగ నారతికేళికి రాత్రిరామకుర్
సురజతశీధుపాత్రముగఁ జూడఁబడుర్ శశిలోకనేత్రమై.

రామ—సఖుఁడా ! సుగ్రీవుఁడా ! చంద్రచరణములం దిలకింపుము.

మాలిని. ధవళరుచికపోలర్ - ధ్వస్తపద్మాననశ్రీర్
రవిసువిరహతాప-ప్రావృతర్ వ్యోమలక్ష్మిర్
శివసువిమలతారా-శీకరాసారసిక్తర్
సవనిశ యలరించుర్ - జంద్రికాచందనాప్తిన్.

[వెండియుం జంద్రుని విలోకించి, తనలో,]

ఆ. అత్రినేత్రజాఁ డని యందు రిందువు నెట్లు, భ్రమముగల్గఁ బ్రజ్ఞఁ బరఁగువా
కీసుధాంశుఁడు రతియాడితాధరసుధం, గ్రోలుమరునికంటెఁ గ్రాలుఁ బొడమి.

[విమర్శించి, స్వగతంబుగ,]

ఆ. ఇందు వింద్రుఁ డనుట యెందుల కీయాస, పయసుబిందువుగను బరఁగు నితఁడు
హరిణదృక్కపోలహార్యాన్యములు నెల,కొలఁదుఁగాద కాంతి దనకుఁ దనర.

[మఱియు మఱుఁగిడికొని సీతం గాంచి]

మ. తనుమధ్యా యెటులొందు నిండుఁడు సుధాధాముండు దుగ్ధాబ్ధికిన్
దనయుం డయ్యుఁ ద్వదాస్యశోభను లసత్తారుణ్యలావణ్యవా
ర్ధినిధానంబుఁ దరంగితేక్షణ వొకింతేఁ గష్టు శీతాంశుఁ డొం
దును నీలాబ్జవనీవిహారకలనాధుర్యోరుహంసద్యుతిన్.

సీత—[సిగ్గుతో మోము వంచుకొంచున్నది. వెండియు, సకౌతుకంబుగ నాలోకించి,]

ఆహా! వీఁడే చందురుండు వెలుంగుచున్నాఁడు.

క. ముకుళీకృతారవిందుఁడు, సకలసతీమానహస్తిసమజమృగేంద్రుం
డు కువలయానందుఁడు రజ, నికనం జందనపుబొట్టు నెఱచందురుఁ డౌ.

రా—నెయ్యుఁడా! సుగ్రీవుఁడా! చూడుచూడు.

శా. ఇందు శ్రీభువిఁ గ్రమ్ము నిందువనరాత్రిందీవరాక్షీకుచా
స్పందశ్రీకరగంధసారముగ ద్యుగపద్మాప్రకీర్ణంబుగన్
గందర్పస్ఫటికాలయంబుగను బ్రాక్కాష్ఠాంగనానాసికం
బందు న్మౌక్తికముగ న్మహేశ్వరజటాప్రాంచల్లతాంతంబుగన్.

సుగ్రీ—ఓయి రఘునాథా! సుధాంశుకిరణవికాసము పునరుక్తిం జెప్పుచున్నది.

రా—ఎటువలె?

సు—మునుపే.

సీ. కర్పూరమునకంటె గంధసారముకంటెఁ గైతకంబునకంటెఁ గైరవంబు
కంటెను స్వర్గగంగాతరంగముకంటె క్షీరాబ్ధికంటెను స్త్రీకటాక్ష
మునకంటె శ్రీస్మితమునకంటెఁ బున్నమవెన్నెలకంటె రేవెల్గుకంటె
మానిమనముకంటె మఱిసరస్వతికంటెఁ గైలాసమునకంటె శూలికంటెఁ
దెల్లనగునీదుకీర్తులఁ దేజరిల్లు, సప్తసాగరసహితమా క్ష్మాతలంబు
ధవళధవళంబుగను దుష్టదనుజదమన, రచితసకలజగద్భద్ర రామభద్ర.

రా—[సలజ్జంబుగ] అళీకవాక్పరికరము చేఁ జాలు.

విభీ—ఎందువలన క్ష్మాతలము ధవళిత మని చెప్పఁబడెనో, అందువలన నిది యళీక మనుట సత్యమే. సర్వభువనములును భవత్కీర్తిచేత ధవళితములు గదా? ఇప్పుడు గా?

పృథ్వి. సదున్నతఘనస్తన- స్తబకచుంబితుంబీఫలో
న్నదన్మధురవీణస్వ-ర్ణళినసేత్రసత్పోషిమన్
సుధాకరకరాయితా-ర్జునసుకాంతిసత్కాంతముగ్
ద్వదీయయశముం గదుం - దనరఁ బాడెదు న్వేదుకన్.

రా—ఓయి లంకేశ్వరుఁడా ! నీవును కిష్కింధాధీశ్వరుని నే యనుసరించుచున్నావు.

[వెండియు విలోకించి] తమ్ముఁడ ! లక్ష్మణా ! వీఁడుగా,

స్రగ్ధర. సౌరభ్యోద్రిక్తనక్తం - సమయదశముఖో-చ్చండదోర్దండలీలా
కైలాసంబుం ద్రిలోకీ-కలితజయరతీ-కాంతశంఖంబు ప్రాంచ
ల్లోలాక్షీగండము న్స-ల్లులితజలధిక-ల్లోలఫేనోరుఖండం
బాలోకింపఁగదే యీ-యదనఁ బొదలు నీ-యబ్బుఁ డాకాశమందున్.

ల—[సకౌతుకంబుగ] అమ్మా ! జానకమ్మా ! ఆలోకింపుము.

క. ఔనందము కుముదాదుల, కానందముఁ గొలుపుచిందుఁ డాకాశంబున్
దానుల్లంఘించును హను, మానుం డంబుధినిఁబోలె నహహా కనుమా.

సీత—[సవాత్సల్యంబుగ] ఓయి ! మంచిదిస్నేలఁగల లక్ష్మణుండా ! వెండియు నిపుడు
రాఁగవులవంగడముయొక్క యుంక్కనడంచు గందము గాలిమాలి.

ల—అమ్మా ! ఆహనుమంతుఁడు, బందుగుల నలరింప నయోధ్యకు రామచంద్రునిచేఁ
బంపఁబడినాఁడు.

సీత—కనుక మన మేల యాలస్యము సేయవలయును ?

-[విభీషణు నవలోకించుచున్నాఁడు.]

విభీ—[వెలువడి వెండియుం బ్రవేశించి,] పుష్పకాభిధానమైన విమానరత్నము నారో
హింపవచ్చును.

[అందఱుం దాని నధిరోహించుట నభినయించుచున్నారు.]

రా—ఎందువలన, త్రిభువనైకవీరుఁడు గుబేరానుజుఁడు (రావణుఁడు) కుబేరునివలననుండి
హరించెనో, యందువలన నిది విమానరత్నమే సరి.

ల—అన్నా! వెండియు వీఁడెట్లు కిష్కింధామాహిష్మతీపతులకంటె వీరుఁడని యెన్నఁబడు
చున్నాఁడు ?

రా—[విహసించి] వత్సా ! ఇట్లిది.

తే. అట్టిగట్టిభుజంబుల నదుముకతనఁ, గాఁగనిశ్శబ్దములు దశకంఠకంఠ
ములు దదాలింగితుండయి జలధులందు, ముంచినకపీంద్రుఁడవ్వాలికాంచు ఘనత.

[మఱి సకౌతుకంబుగ]

తే. రుదరుణీకృతదృగ్దీప్తరుచికవచితుఁ, డగుచు విజయార్థ్యుఁడైన దశాననుం డె
తనిదియగు బంధనాలయమున వసించె, నతఁడు హైహయపతి సుత్యుఁ డర్జునుండు.

ఔనుగాని, ఇతఁడును.

శా. ద్రాఘిష్ఠాసినికృత్తమూర్ధతలిపాదస్థానమందుం బడన్
శ్లాఘాపాత్రము గాఁగఁ బిండి శశిలీలం దత్సుధాధారలన్
వేగం గూర్చి తగం బునర్జనితుఁ గావించె న్నతు స్రావణున్
శ్లాఘింపంబడుఁగాత మాతఁడు జగత్సంస్తుత్యుఁ డీశానుఁడే.

[నిర్వర్ణించి,] ఓయీ! ఏమిచెప్పఁబడును? త్రికూటశిఖరిశిఖర కంఠీరవుండగు పంక్తిముఖుని చరిత్రములు లోకోత్తరములుగదా?

ఉ. ఎత్తఁబడంగ నెవ్వనియహీనభుజంబులఁ జంద్రమౌళి భూ
భృత్తు నిరస్తభారత నహీంద్రుఁడునుం దల లెత్త దత్ఫణా
ప్యుత్తమరత్నరాజిరుచు లుద్యదినాంశులువోలెఁ గ్రాలఁ గ్రు
చ్చిత్తజవైరిదృక్త్రయముఁ జేరఁగ నద్దెస లెట్టివాఁడవే.

ల—అన్నా!

తే. రథ మిదియె మూర్తిమన్మనోరథమువోలె, నెన్నఁబడియెడి నాచేత నిపుడుమాన
లీలదూరాగతులకేని లేదుశ్రమము, సంతసం బెంతయేనియుఁ సమకొనియెడి.

రా—ఎట్లు దూరమువచ్చినారము? [విలోకించి] ఇదియిట్లు.

తే. కాండనిధిదాటి మఱిదండకావనంబు, మేఖలకళిందనందను శైలఁగు నెడలఁ
గడచివచ్చితి మిదియె శిఖండిమండి, తావనీజంబు చిత్రకూటాచలంబు.

సీత—[కేఁగంటఁ గాంచి,] అమ్మా! జమునా! నిక్కువమయిన మక్కువగలదాన వవు చున్నావు. ఎక్కుతమున వెండియుం నీకొలనునకుఁ జూడ్కి నిడినదాన వవుచున్నావో, అక్కుతమున.

రా—ఆహా! విడువఁబడిన వైరముగల క్రూరజంతువులఁ గలదిగనుక నిది భరద్వాజా శ్రమము.

ల—ఇది యిట్లు.

క. ఏనికగున్నలు తొండము,చే నెఱసింగములజడలఁ జెలఁగుచుఁ బీఁకున్
మానుగ నేనుఁగుపిల్లలు, మానిచి శిశువు హరిపాల మఱిమఱి గ్రోలున్.

మఱియును.

ఉ. ఆడెడుబాలకావళి పదాహతిచేత వినిద్రమైన శా
ర్దూలము గోళ్ల స్నగముదూలను బాపికొనుం భయంబుఱన్
వ్యాలము కేకిచంచువిన్యాలాంచితకంచుకమై నిశాస్త్రని
ద్రాలసమైన ముంగిసది ద్రావెడు నూరుపుగాలి లీలగన్.

రా—అహా! ఎట్లువచ్చినది, చక్రవాకవిలాసినీరతిసమయము ప్రభాతసమయము! ఎట్లన్న;

మ. ఇవిగా కైతకధూళిధూసరరుచు ల్వీక్షింపుఁ డింద్వంశువుల్
దవిలెం బశ్చిమవార్ధితీరము జరార్తంబు ల్నిశాంతంబుగా
నివిగో సంవికసత్సరోరుహావనీ దృక్పాతసంభావ్యముల్
రవిరాజత్కరము ల్వహించు నహహా ప్రాచీమహారాగమున్.

ల—ఇది యిట్లు.

మ. ఇవి గావించును జక్రవాకులకుఁ దా మెంతేనియాశ్వాస మీ
యవి ధ్వాంతాబ్ధి మునింగినట్టిజగతిన్ హర్షంబుగన్ లేవనె
త్తు విలాసంబుగ దిక్సతీతతిని వే తోఁచు న్వసంతంబునన్
రవిపా సత్కరము ల్సరోరుహావనిన్ రంజించు సల్లీలలన్.

సుగ్రీవుఁడు—[విభీషణుంగూర్చి,]

మ. నెరయం జాల నిశానిశాచరవధూనిర్ఘాటనా మాంత్రిక
స్ఫురితంబుల్ రజనీప్రసుప్తనళినీప్రోద్బోధవైతాళిక
స్ఫురణంబు ల్జలజాతకోశకుహరప్రోద్భూతభృంగౌఘఘుర్ఘాం
కరణోంకారమహోపదేశగురులక్ష్యంబు ల్దినేశాంశువుల్.

[విలోకించి, సకౌతుకంబుగ,] అహో!

మ. దివసశ్రీపదయోజనానుభవప్రాప్తింబోలె ఖాశోకశా
ఖివలత్సత్కలికోరుపుంజము దిశాక్రీడత్కురంగేక్షణా
స్వవతంసభ్రమముం బొనర్చు చుదయప్రాంచత్సహస్రాంశ్వభీ
షవలోకంబు కదుంగడు న్వెలిఁగెడున్ జానొందగా నివ్వడిన్.

రా—[సీత నపవారించి,]

మ. రవి యొందాఁక సరాగుఁడై కమలినీరాజీవకోశోల్లస
త్ప్రివినీవి న్వదలించుఁ దాఁ గరమునన్ భవ్యాళిమాలాసుకై
తవ మొప్పంగను జొప్పడు న్మఱియు నందాఁకం దదంభోజినీ
చ్ఛవిమత్కాంచికచారునీలమణిరుగ్జాలంబు గ్రాలుం బొరిన్.

సీత—[నవ్వి, చూచి,] ఎట్టు వీఁడె పుట్టుచున్నాఁడు.

తే. పొడుపుఁగొండగవినినుండిపొలిచితమ్మి, యొడలఁ దనచల్లనియొడంద నెఱకపఱుచు
చౌందికుంకుమపుంబూఁత నొప్పుచిప్పు, డలరుచున్నాఁడు వేవెలుంగయిన వేల్పు.

రా—ఓసి జానకీ ! చూడుచూడు.

ఆ. ప్రచురతరతరంగరంగమాలికయును, మంజులతరహంసమాలికయుం ౙ
మర్త్యమర్త్యలోకమంగళకారిణి, పరఁగు నార నేత్రపర్వ మగుచు.

సీత—[సహర్షంబుగ, దానినే పఠించుచున్నది.]
అయ్యపుత్తుఁడా ! ఇది యిట్లు.

రామ—ఓజానకీ! చూడుచూడు. [సహర్షంబుగ,] ఇది, రఘుకులకల్యాణప్రరోహాధరణి ఇది సరయువు. మఱి, సరయూతరంగశీకరశీతలీకృతపరిసరనగరీసీమంతమణియయోధ్య.

ల—అన్నా ! చూడుము చూడుము. భరతానుగతుఁడు. పుణ్యజలపూర్ణకలశహస్తుఁడు నీయభిషేకముకై సముత్సుకమతి భగవంతుఁ డరుంధతీపతి.

ఆ. గురుయశోదిలీపకులవరమాణిక్య, మఖిలదిగ్వికాసకాదిమూల
మగుచు నుదయమొందినట్టిభాస్వంతుని, నిన్నుఁ జూడవేఁడుచున్నవాఁడు.
కనుకఁ బుష్పకమవతరింతము.

రా—వత్సా ! (తమ్ముఁడా !) అందాఁకం బ్రతీక్షింపుము. సులభసకల మంగళాలోకం డును, అఖండలాశామండనుండును నగుభగవంతుని వివస్వంతునికి నమస్కరించు చున్నాము.

[సాంజలి యగుచు,]

క. ప్రాచీకుంకుమతిలకము, ప్రాచీనోదయగిరిశిఖరమణి త్రిభువన
ప్రాచుర్యభవనదీపము, నై చెలఁగెడు సూర్యునికి మదభివందనముల్.

[తెరలో] ఓవత్స ! రామభద్రా !

రా—ఆహా ! అద్భుతము !!!

తే. జలజములఁబోలెఁ జేయుచు సద్వికాస,ములను మామానసములను ముద మెలర్ప
భానుబింబంబునందుండి ప్రభయుంబోలె, నేదొ యొకవాక్యమిప్పుడె యుప్పతిల్లు.

[మఱియుఁ దెరలో,]

శా. రామా నేత్రకువాలకాననతమఃప్రధ్వంసిచంద్రాతప
శ్రీమంతంబగు నీయశోలహరి భాసిల్లంగఁ జేయంగదే
భూమి స్వర్షసహస్రము ల్మఱియుం సంపూర్ణంబునా త్వద్గుణో
ద్దామ శ్రీకథనామృతప్లుతముగం త్రైలోక్య మింపొందెడున్.

రా—మిగుల ననుగ్రహింపఁబడుచున్నాను.

[మఱియుం దెరలో]

ఓయీ! సకలకల్యాణగుణారామా! రామా! నేఁడేమి కోరువారము ?

సుగ్రీవుఁడు—ఓయి తండ్రీ! ప్రభాకరపరిపూర్ణమనోరథుఁడు రాముఁడు. ఇం[illegible]దేఁగదా? బంగారము.

నిజగుణంబులచేత నిర్భరంబుగ మహోన్నతి సమకూనె మున్నె క్షితితలమునఁ - బ్రతిలేమి నె
పిత్రాజ్ఞ సద్భక్తి వెలయంగఁ బాలింపఁబడె ధర్మసూక్ష్మంబు బయలుపడఁగఁ - బ్రజకెల్లను
మిత్రసుగ్రీవుఁడు పాత్రవిభీషణుఁడైరి మహారాజు లభిమతముగ - స్వాశ్రయాప్తి
రావణుం డుగ్రసంగ్రామరంగంబున నయ్యెఁ గథాశేషుఁ డమరవైరి - యత్రముగా
చూడఁబడిరెల్లబంధువులొక్కమెడలి - సొంపుమీఱఁ
గలితబాష్పోల్లసల్లోచనులుగ నగుచు - లలితముగా
పట్టభద్రుండయ్యె రామభద్రుఁ డొప్పె - భద్రుఁడై
యంద ఱానందమొందిరి యభిలషితమహార్థసిద్ధి.

అట్లయ్యు నిది యవుత. [భరతవాక్యము.]

శా. ఆబాల్యంబుగ మానవావళికి విద్యాధిక్యమేపొందెడున్
దేవుండౌ శివునందు విష్ణువునెడన్ ధీభక్తిసంయుక్తమై
ద్వైవాద్వైతమతాప్తమై వెలయుతన్ ద్వైవారశేషస్ఫుటా
గ్ర్యావాసంబున జ్యావలెం బరఁగు శ్రీయార్యాలయాళి న్సదా.

రాముఁడు—అందువలన రండు. పుష్పకమునుండి దిగి గురుజన బంధుజన పౌరజనుల నందఱ నానందింపింతము.

[అని, పుష్పకమునుండి యవతరించుట నభినయించుచు నందఱు నిష్క్రమించుచున్నారు.]

గద్యము. ఇది, శ్రీమత్తనుమధ్యాంబాకరంబిత శ్రీబిల్వనాథమహాదేవశిష్య శిష్యోపజ్ఞాక్షర సాంఖ్యాచార్య పర్యవితకవిత్వతత్త్వవిత్ప్రకాండ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నశర్మ వినిరి[illegible]న్నరాఘవం బను నాటకంబు సర్వంబును సమాప్తము.

---

రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.